Roy, Dwijendra Lal, 1864-1913.

మేవాడుపతనము

బెజవాడ, 1925

## Bibliographic Record Target

Roy, Dwijendra Lal, 1864-1913.

మేవాడుపతనము / ద్విజేంద్రలాల్ రాయల బంగాళీ గ్రంథమునకు అనువాద కర్తలు శ్రీపాలపర్తి సూర్యనారాయణగారు ; పరిష్కర్తలు శ్రీ జంధ్యాల శివన్నశాస్త్రిగారు .- బెజవాడ : ఆంధ్ర గ్రంథరత్నాకర కార్యాలయము, 1925.

(4), 2, 154, (1), 10 p. ;21 cm

Record no. 580

Roy, Dwijendra Lal, 1864-1913.

Mēvāḍupatanamu / Dvijēndralāl Rāyala Baṅgāḷī grandhamunaku anuvāda kartalu Śrīpālaparti Sūryanārāyaṇagāru ; pariṣkartalu Śrī Jandhyāla Śivannaśāstrigāru .- Bejavāḍa : Āṃdhra grantharatnākara Kāryālayamu, 1925.

(4), 2, 154, (1), 10 p. ;21 cm

Record no. 580

ఆంధ్ర గ్రంథరత్నాకరము ౪వ అనుబంధము.

బాలభారతీ గ్రంథనిలయము ౪వ రత్నము.

# మేవాడుపతనము.

నాటకరచనా ధురంధరులగు,

## శ్రీ ద్విజేంద్రలాల్ రాయల

బంగాళీ గ్రంథమునకు


అనువాదకర్తలు:

శ్రీ పాలపర్తి సూర్యనారాయణగారు,

పరిష్కర్తలు:

శ్రీ జంధ్యాల శివన్నశాస్త్రిగారు









ప్రకాశకులు.

ఆంధ్ర గ్రంథరత్నాకర కార్యాలయమువారు, గుడివాడ.






చందాదారులకు రు. 1-0-0] [ఇతరులకు రు. 1-4-0.



PRINTED BY
K. Kodanda Ramayya Garu,
AT THE
Andhra Grandhalaya Press, Ld,
BEZWADA.
1925


# బాలభారతీ గ్రంథనిలయమునకు

## రాజపోషకులు

---

(1) మ. రా. శ్రీ. బొల్లవరం ఎఱ్ఱవంది రెడ్డిగారు
ల్యాండులార్డు, బొల్లవరం.

(2) ,, వీరంరెడ్డి నాగిరెడ్డిగారు,
ల్యాండులార్డు, చాగలమఱ్ఱి.

(3) ,, దాసు కేశవరావుగారు,
వాణీముద్రాశాలాధిపతులు.

---

## పోషకులు

(1) ,, భమిడిపాటి కామేశ్వర శాస్త్రిగారు,
శ్రీమద్రామాయణ గ్రంథమాలా
వ్యవస్థాపకులు, రాజమండ్రి.

(2) ,, ఏడిదె, వెంకటావ్రుగారు,
ఆంధ్రసర్వస్వ వ్యవస్థాపకులు, రాజమండ్రి.

---

# అంకితము

శ్రీ సింగరాద్రి నరకేసరి పాదపద్మ వ్యామోహితులును,

శిష్యహృత్తమోపహారకులును,

భరద్వాజగోత్రోద్భవులును, అస్మద్గురువర్యులునునగు

**శ్రీ పాలపర్తి నృసింహదాసుల**

పాదపద్మముల సన్నిధిని

భక్తిమై సమర్పించుచున్నాను.

—అనువాదకర్త.

# విజ్ఞప్తి

ఆర్యమహాశయులారా!

పెక్కుకష్టములఁ గడచి మరల మా గ్రంథనిలయము నిలుపఁబడినదని చెప్పుటకు సంతసమగుచున్నది. శ్రీ పాలపర్తి సూర్యనారాయణగారు రచించిన మేవాడు పతనమును బ్రకటించు విషయమునఁ గలిగిన ప్రతిబంధకమునకుఁగాను శ్రీ ఆంధ్రగ్రంథరత్నాకర కార్యాలయమువారు సదుపాయము చేసినందులకై తదధిపతులగు శ్రీడాక్టరు నందూరి శివరావుగారికి నాహృదయపూర్వక వందనములు.

బహుభాషా విశారదులగు శ్రీ పండిత జంధ్యాల శివన్నశాస్త్రిగారు మాగ్రంథమును సంస్కరించి మాగ్రంథమాలయెడ నభిమానము వహించినందులకై వారికి మిగులఁ గృతజ్ఞుఁడను.

అన్యమండలవాసులయ్యు మాగ్రంథమాలయెడ నభిమానము వహించి పలువిధముల మాకు సహాయ మొనరించుచు గ్రంథములు రచియించియిచ్చినట్టియు హిందీ, ఉర్దూ, ఆంధ్ర, ఆంగ్లభాషా పరిచయము గలిగినట్టియు శ్రీపాలపర్తి సూర్యనారాయణగారికి నిరంతరము కృతజ్ఞుఁడను. భాషాభిమానులందఱును మాయుద్యమమునెడ నభిమానము వహించి తగు ప్రోత్సాహ మొసఁగుదురని నమ్ముచున్నాను. నాల్గవరత్నముగ ప్రియదర్శినిని ప్రకటింపవలసినను మిత్రులకోరికచే దీనిని ప్రకటింపఁ జేసితిమి. పిదప ప్రియదర్శిని వెలువడును.

చాగలనాటి
1—4—25

సర్వజనవిధేయుఁడు
యం. రామసుబ్బయ్యశ్రేష్ఠి,
అధ్యక్షుఁడు.

# విన్నపము

పాఠకమహాశయులారా!

నేను హిందీసాహిత్య సమ్మేళనము వారి రాష్ట్రభాషా పరీక్షకై మేవాడుపతనమును హిందీలో చదువుట తటస్థించెను. అప్పుడే దీనిని తెలుఁగున ననువదించవలెయునను సంకల్పము గలిగి నానేర్చినకొలఁది దీనిని అనువదించితిని. పిదప నా యీ యనువాదమును బాలభారతీ గ్రంథనిలయాధ్యక్షులగు శ్రీయుత యం. రామసుబ్బయ్యశ్రేష్ఠిగారికి వినిపింప వారు దయతో దీనిని తమగ్రంథమాలలోఁ బ్రకటించుట కంగీకరించిరి. కాని శ్రీ ద్విజేంద్రలాల్ రాయల గ్రంథములన్నియు ఆంధ్రభాషలోఁ బ్రకటించు నధికారము ఆంధ్రదేశమున ఒక ఆంధ్రగ్రంథరత్నాకరమువారికే కలదుగాన దీనిని ప్రకటించువిషయమై ప్రార్థింప వారుదయతో నంగీకరించిరి. పైగ్రంథమాలల అమూల్య సహాయముననే నా యీ గ్రంథము ప్రచురింపఁబడుటచే తత్తదధ్యక్షులగు శ్రీయుత సుబ్బయ్యశ్రేష్ఠిగారికిని శ్రీ నండూరి [illegible] పంతులుగారికిని నిరంతరము కృతజ్ఞుఁడను.

గ్రంథరచనకు నా కిదియే ప్రథమయత్నమగుటచే నాలోపములన్నియు సవరించియు యథోచితముగ గ్రంథమును సంస్కరించుటయే కాక గీతములు మున్నగునవి వ్రాసి యీ గ్రంథమునకు పరిష్కృత రూపమును ప్రసాదించినవారును సంస్కృతాంధ్ర హిందీ వంగభాషా భూషితులును, విద్వత్కవులునగు శ్రీ పండిత శివన్న శాస్త్రిగారి యుపకారమును మఱువఁజాలను. వారికి నా హృదయపూర్వక వందనములు.

చాగలమఱ్ఱి,
1—4—25.

విధేయుఁడు,
పాలపర్తి సూర్యనారాయణ

# భూమిక

నాటకవాఙ్మయమున నూతనశకము ప్రవర్తింపఁజేసిన శ్రీయుత ద్విజేంద్రలాల్ రాయిగారు దీనిని వంగభాషయందు రచియించి మహాకవి మైకేలు మధుసూదనదత్తునకు అంకితముచేసిరి. వర్తమాన యుగమున నాటకలేఖకులలో ద్విజేంద్రబాబును బోలినవారు భారతదేశమున లేరని పలువురయభిప్రాయము. ద్విజేంద్రుఁడు అంతర్జగత్తునకుఁ జేరిన మహాకవి. మహాకావ్యలక్షణములుగా మనయాలంకారికులచే శాసింపఁబడిన అష్టాదశవర్ణనలు వీరిరచనలందు తఱుచు గోచరింపవు. వీరు బాహ్యసౌందర్యమునకన్న ఆంతరికసౌందర్యమునే అనఁగా ప్రేమ, భక్తి, దయ, క్రోధము, ఈర్ష్య మున్నగు మనోభావములచేష్టలనే కడుహృద్యముగఁ జిత్రించెదరు. నాటకమునకు అధికసౌందర్యము నాపాదించు అంతఃప్రవృత్తుల సంగ్రామమును వీరు హృదయంగమముగఁ జూపెదరు. వీరి మానవస్వభావచిత్రణము వీరితత్త్వజ్ఞానమును జాటును. వీరి రచనలందు ఉన్మాదశృంగారమును, అశ్లీలహాస్యమును గానరావు. మఱియు వీరిహాస్యము ప్రయత్నపూర్వకముగ వ్రాయఁబడినదిగాక స్వాభావికముగను, సమయోచితముగను ఉండును. కవిబ్రహ్మయగు ద్విజేంద్రుఁడు సృజించినపాత్రములు స్పృహణీయములును ఆదర్శప్రాయములునయి యుండును. ఇంతయయ్యును వానియందు అస్వాభావికత గనుపట్టకయుండుట గొప్పవిశేషము. నాటకవాఙ్మయమున ద్విజేంద్ర [illegible] యధికారమును, పరిజ్ఞానమును దెలిసికొనవలయునన్న వారు విశేషానుభవముతో వ్రాసిన "కాళిదాసభవభూతులు" అనుగ్రంథమును జదివి దానికి లక్ష్యముగ వారినాటకములను జదువవలయును.

ద్విజేంద్రునకు స్త్రీలయెడ ముఖ్యముగ హిందూస్త్రీలయెడ సమితగౌరవమును పక్షపాతమును గలదని దుర్గాదాసు నందలిసరస్వతియు, మేవాడుపతనమందలి కల్యాణి, సత్యవతి, మానసియును, పాషాణి, యందలి అహల్యయు మున్నగు నాయకాపాత్రములఁజూచిన తెల్లమగును. ఇప్పటి కిరువదిసంవత్సరములకు బూర్వమే వ్రాయబడిన ద్విజేంద్రుని గ్రంథములందు మహాత్మాగాంధి మున్నగుప్రస్తుతదేశనాయకుల సిద్ధాంతములగు హిందూమహమ్మదీయమైత్రి, పరమతసహిష్ణుత, అహింస, విశ్వప్రేమ మున్నగు మహావిషయములు ఆదర్శములుగఁ జిత్రింపబడుట యాతని ప్రతిభావిశేషమును బ్రకటింపుచున్నవి. ఈకాలమున ఈనాటకముల ప్రచారమెంత యావశ్యకమో వేఱుగ

చెప్పనక్కరలేదుగదా. నిక్కముగ మహాకవిరచన కాలత్రయాబాధ్యమై హిమాలయమువలె అచలమై, ఉషఃకాలమువలె దినదినస్పృహణీయమై యలరారును.

ద్విజేంద్రుఁడు వంగభాషలో దాదాపు 25 ఉద్గ్రంథములు వ్రాసెను. అందును శ్రేష్ఠతమములగు గ్రంథరత్నముల నన్నింటిని తెలుఁగున ననువదింపఁజేసి క్రమముగఁ బ్రకటింపుచు ఆంధ్రగ్రంథరత్నాకరము ధన్యతను గాంచుచున్నది. అట్టి యుత్తమగ్రంథములలో మేవాడుపతన మొక్కటి. విశ్వప్రేమను లక్ష్యముగా నుంచుకొని కవి దీనిని రచించినాఁడు. ఇందు కల్యాణియందు దాంపత్యప్రేమయు, సత్యవతియందు దేశప్రేమయు, మానసియందు విశ్వప్రేమయు చక్కగ పొందుపఱచఁబడినవి. విశాలహృదయము లేక సంకుచితాభిప్రాయములకు వశులగుటచే దేశమెట్లు విధ్వంసమగునదియు ఇందు చక్కగ చూపింపఁబడినది. కవి గ్రంథాంతమందలి గీతములో 'మీమనుష్యత్వము పోయినది. మీరు మరల మనుష్యులు కండు' అని కర్తవ్యమును చక్కగ నుపదేశించినాఁడు.

దీనిని హిందీరూపాంతరమునుండి తెలుఁగున అనువదించిన శ్రీ పాలపర్తి సూర్యనారాయణగారు హృద్యమగు శైలిలో స్వతంత్రకావ్యరచన సేయ సమర్థులయ్యును హిందీభాష వారికి అభ్యాసదశలో నుండుటచే దీనిని ఉచితరీతిని సంస్కరించుటకు నన్నుఁ గోరిరి. నేను నందుకియ్యకొని దీనిని పూర్తిగా సంస్కరించితిని. ఇందు కొంత భాగము స్వయముగా తిరిగి వ్రాయవలసివచ్చుటచే నట్టి దానిని వంగమాతృకనుండియే గ్రహించితిని. ఇట్టి అమూల్యరత్నమును బ్రకటింపఁజేసి ఆంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులగు శ్రీ యం॥ రామసుబ్బయ్య శ్రేష్ఠిగారిని పరమేశ్వరుఁడు సకలైశ్వర్యముల నొసఁగి రక్షించుఁగాత. శ్రీ శ్రేష్ఠిగారు నిస్స్వార్థభావముతో మాతృభాషను పోషించు యువకులలో నొకరు. వీరు చాగలమఱ్ఱిలో "బాలభారతీ గ్రంథనిలయ" మను గ్రంథమాలను స్థాపించి భాషాసేవను చేయుచున్నారు. ఆంధ్రమహాజనులు వీరి గ్రంథమాలను ఆదరించుచు వీరి సదుద్యమమునకుఁ దోడ్పడుదురుగాక!

గుడివాడ,<br>21—7—25.

సహృదయ విధేయుఁడు,<br>జంధ్యాల శివన్న శాస్త్రి



# మేవాడుపతనము.

## ప్రథమాంకము

### ప్రథమ దృశ్యము.

స్థానము-సాలుంబరాధిపతియగు గోవిందసింహుని గృహము.

సమయము-మధ్యాహ్నము.

[గోవిందసింహుఁడును అతని పుత్రుఁడు అజయసిం
నిలిచి మాట్లాడుచుందురు.]

గోవిం—అజయా! మొగలుసైన్యము మేవాడు
చున్నదని రాణాగారి కెవరు చెప్పిరి?

అజ—అది నాకు తెలియదు నాయనా

గోవిం—రాణా ఏమనిరి?

అజ—సంధిచేసికొనుటయే తమ తలంపని సెలవిచ్చిరి. సంప్రదించుటకే రేపు ఉదయము దర్బారునకు రావలసినదిగా సామంతులకు కబురంపిరి: అట్లే మీకును పంపిరి.

గోవిం—నన్నెందుకు పిల్వనంపిరి?

అజ—ఆలోచించుటకు.

గోవిం—సంధి విషయమా?

అజ—అవును, తండ్రీ!

గోవిం——కాని అజయా! నేఁటిదనుక నేను సంధివిషయమై మాట్లాడియే యెఱుఁగను. పాతిక సంవత్సరములనుండి ఎడతెంపు లేక యుద్ధము చేయుటయే యెఱుఁగుదును. ఖడ్గముల ఝుంకారమును, అశ్వముల హేషాంకారములను, భేరీపటహాదుల భాంకారములను, ఆహతుల యార్తనాదంబులను మాత్రమే నేనెఱుఁగుదును. ఇన్ని దినములనుండియు నేను తెలిసికొనిన విషయము లివియే. శత్రునితో సంధిచేసికొనుట నేఁటిదనుక నేను చూచియే యెఱుఁగను. సంధియన నేమియో కూడ నే నెఱుఁగను. (అజయుఁడు మెదలక యుండును. గోవిందసింహుఁడు తలవంచుకొని యాలోచించును. మరల నడుగును.) రాణా సంధిచేసి... టకుఁగల కారణముకూడ నీకు చెప్పెనా?

అజ——కొన్ని సంవత్సరములనుండి మేవాడుస్థితి బాగుపడుచున్నదనియు ...ధాన్యపూర్ణమగు నీసుందర దేశమునందు ఇపుడు వ్యర్థముగా ...లు పాటించుట మంచిదికాదనియు చెప్పిరి.

...కై మ్లేచ్ఛుల పాదరక్షలు శిరముల ధరింపవల...
...ను ఈసుఖభోగవిలాసము స్వర్గీయ మహారాణా...
... స్వేచ్ఛాలబ్ధమగు పారదర్శిస్థానము ...నాక...
...ఁడె మేవాడురాజ్యపతనము సమీపించినదని...
...తి, నాకుమారుని రాజ్యకాలమున మేవాడు మొగలు...
...పోవునని ఆమహాత్ముఁడు చెప్పనేచెప్పె. మొగలులును ...
...క్తి ...హా ...ంచే ను ...త్తులై యున్నవారు. ఇంక ని... ...రు ...స్వ...
...మ్యము నష్టమగును.

అజ——రాణాయును మేవాడు మొగలులతో ప్రతిఘటింపఁజాలదుగాన వ్యర్థముగ రక్తపాత మేల చేయవలయుననియే యనిరి.

గోవిం——అజయా! నీవును వారితో నేకీభవించితివా! మనము వారికి బానిసలమై యురిలో మెడదూర్చవలయుననియే నీవు కోరుచుంటివా? మొగలులు ఢిల్లీ సార్వభౌములనియు వారికి విరుద్ధముగ నెదురుతిరుగుట పాపమనియు నేనెఱుగుదును. అయితే మేవాడును స్వతంత్రరాజ్యమే కదా! గోవిందసింహుని కంఠమున ఊపిరిఉన్నంతవఱకు దానిస్వాతంత్ర్యము నష్టముకాదు. ఏడు శతాబ్దములనుండి ఎడతెగని తుపానులకును పిడుగులకును జంకక అభిమానముతో తలయెత్తుకొనియున్న మేవాడు రక్తపతాకము నేఁడు మొగలులరక్తనేత్రములఁ జూచుటచే కూలిపోవునా? ఎన్నటికిని కాదు. నీవుపొమ్ము. రాణాగారితో వచ్చుచున్నానని చెప్పుము.

(అజయుని ప్రస్థానము)



గోవిం——(గోడపై వ్రేలాడుకత్తిని ఒరనుండిదూసి) నాప్రియసహచరీ! నీవు నాచేతనున్నంతకాలము మహారాణాప్రతాపసింహుని కవమానము కలుగకుండుఁగాక! ప్రియాతమా

చ॥ కలుషతజెందితీవు చిర♦కాలము నిన్నిటు విస్మరించుటన్
గలవరమొందఁబోకు మిఁకఁ ♦ గాఁగలయుద్ధమునం దురుష్కవీ
రుల బహులోష్ణశోణితముఁ ♦ గ్రోలెదుగాత తృమించి నాకడన్
మెలఁగు, ప్రతాపకీర్తి భువి ♦ నిల్పెద మించెద ఖడ్గరాజమా!

(ఖడ్గము హృదయమున కద్దుకొని మెల్లఁగా ద్రిప్పఁబోవుచు ననను) కాదుకాదు. చేయి వణఁకుచున్నది. ఇప్పుడు నీమర్యాద నేనుకాపాడఁజాలను. ఇప్పుడు నేను వృద్ధుఁడనైతిని. (కనులవెంట నీరుకారును.) ఓ ఈశ్వరా! ఏమి ఇట్లు చేసితివి?

(నిలబడి మరల కత్తిఎత్తును. ఇంతలో కళ్యాణి వచ్చును.)

కళ్యా——నాయనగారూ! ఇదియేమి?

గోవిం——అమ్మా! ఇదిఖడ్గము. చూడుము.

కళ్యా——కం॥ ఆకస్మికముగ ఖడ్గము
మీకరమునఁ జూడ వెఱపు ♦ మిగులఁగలిగెన్

బాకుధరించుట మీకిపు
డేకతమున? పుడమి నుంచుఁ డింతకు దీనిన్.

గోవిం—(కత్తి మొన నేలపై మోపి ప్రేమతో కళ్యాణిని చూచుచు) కళ్యాణీ! ఈఖడ్గ మెంత భయంకరమును ఎంత సుందరమునో చూడుము. ఇది యేమికోరుచున్నదో తెలియునా?

కళ్యా—లేదు. ఏమికోరుచున్నది?

గోవిం—నెత్తురు.

కళ్యా—ఎవరిది?

గోవిం—మహమ్మదీయులది.

కల్యా—అయితే నాయనగారూ! మహమ్మదీయులపై మీకింతక్రోధ మేల?

గోవిం—దీనికికారణము నీజన్మభూమియగు మేవాడునడుగుము. ఏడు వందల సంవత్సరములనుండియు తురుష్కులీ స్వతంత్రరాజ్యమును వశపఱచుకొనుటకయి రాక్షసులవలె విఱచుకొని పడుచున్నారు. అయితే పర్వతమును ఢీకొను సముద్రతరంగములవలె ప్రతిపర్యాయమును వారు వెనుకకు మరలిపోవుచున్నారు. ఇది వారి కేమి యపరాధముచేసెనో అడుగుఁడు. కాని

క॥ మనుజుఁడు శక్తిమదాంధత
ననువుగ నెఱుఁగంగఁబోఁడు న్యాయాన్యాయం
బనఘమతి నట్టివేళల
ఘనఖడ్గమె వారిదుండగమ్ము నడంచున్॥

కటా! కల్యాణీ! నేనిపుడు కడుంగడు వృద్ధుఁడనైతిని.

(కల్యాణి యేడ్చును.)

గోవిం—అమ్మా! ఏల ఏడ్చెదవు? భయపడకుము. దీనిని ఒరలోపెట్టుచున్నాను. (ఒరలోపెట్టి) పొమ్ము. లోపలికిఁ బొమ్ము. నేనును పోవుచున్నాను. (ప్రస్థానము)

కల్యా—నాయనా! మీరు బాగుగ ఆలోచించినచో—



## ద్వితీయ దృశ్యము.

స్థానము – ఉదయపురమార్గము.

సమయము – అపరాహ్ణము.

[సత్యవతియు చారణులును పాడుదురు.]

### గీతము.

ఇదె మేవాడు మహీధరమెత్తగు నెత్తిని జెండా ద్యుతిమించెన్
ఇదె యిందనుకనుమహమ్మదులకు మదము చూర్ణమొనరించెన్॥
ఇదె మేవా డిదె మేవా డీయెడనే కష్టనిడుములఁ బడియున్
గదిసి ప్రతాపుఁడు దీని శృంగమటుగాంచెను నిశ్చలతావాప్తిన్॥ ౧
ఈయెడనే మునుపద్మినీమణుల యిద్ధంబగు రూపాగ్నిన్
బాయక యుఱికి తురుష్క సైన్యమది భస్మంబై పోయెన్॥ ౨
క్షత్రవీరగణ రక్తరంజితము కాసారోదక మిచట—
చిత్రశౌర్యుఁడగు బాప్పామ్లేచ్ఛుని ప్రతిక నిటఁగొని తెచ్చెన్।
పాడిపంటలకు తావిది యిచ్చటి ఫలనీరంబులు రుచ్యంబుల్
పాడునుతోఁటలఁ గీరశారికలు వాయువు చల్లగవీచున్॥ ౩
ఈమేవాడు మహోన్నత శిఖరంబెగసి యాకసము ముద్దుగొనున్
శ్యామలకానన భూమి లీయెడను స్వర్గజ్యోతిసి నిండెన్॥ ౪
వనకుసుమమ్ముల నిచ్చటి వనితాజనము భూషలుగఁదాల్చున్
ఘనకృపఁ జాతివ్రత్యమునన్ సరిగారెవ్వరు వీరలకున్॥ ౫

(ఇంతలో అజయుఁడు ప్రవేశించును)

సత్య—మీరు సైనికులా?

అజ—అవును, నేను మేవాడుసేనాపతులలో నొకఁడను.

సత్య—మిమ్మొక మాట యడుగఁదలచితిని. నేనొకవార్త వింటిని, అది నిజమేనా?

అజ—ఏమివార్త యది?

సత్య—మొగలసైన్యము మేవాడుపైకి దాడివెడలి వచ్చుచున్నదని.

అజ—ఇంక వచ్చుటలేదు. రాణా సంధికిచ్చగింపనిచో తప్పకవచ్చును. రాణాగారు నెయ్యమున కియ్యకొనునో కయ్యమునకో యని తెలిసికొనుటకే మొగలసేనాపతి తనదూత నంపెను.

సత్య—మీరు యుద్ధమునకు సన్నద్ధులైయుంటిరా?

అజ—రాణాగారి ఇచ్ఛానుసారము ప్రవర్తింతుము.

సత్య—రాణాగారియిచ్ఛ యేమియో మీకు తెలియునా?

అజ—తెలియదు. కాని సంధికే యొడంబడెదరని యూహించుచున్నాను. ఈవిషయమాలోచించుటకే నన్ను, మానాయన నంపిరి.

సత్య—మీనాయనగా రెవరు?

అజ—మేవాడు ప్రధానసేనాపతియగు గోవిందసింహుఁడు.

సత్య—మీరు గోవిందసింహునిపుత్త్రులా? మంచిది. వారియుద్దేశ మేమి?

అజ—యుద్ధమే వారియభిమతము.

సత్య—మంచిది. మీకుకష్టమొసఁగితిని. మీరింక వెళ్లవచ్చును.

(అజయుని ప్రస్థానము)

సత్య—సంధి! రాణాప్రతాపసింహునిపుత్త్రుఁడు మొగలులతో సంధి తలపెట్టెనా? ఇది అసంభవము. ఇందు తప్పక పొరపాటున్నది. (చారణులతో) మీ రీచెట్టుక్రిందనుండుఁడు. నేనిప్పుడే వచ్చుచున్నాను.

(చారణులొకవైపుగను సత్యవతియొకవైపుగను నిష్క్రమింతురు.)



తృతీయదృశ్యము

స్థానము - ఉదయపురమున మేవాడురాజసభ

సమయము-ప్రభాతము

[సింహాసనమున అమరసింహుఁడును, ఇరుప్రక్కలను సామంతులును కూర్చునియుందురు-గోవిందసింహుఁ డొకప్రక్క నిలఁబడియుండును.]

జయ—మహారాజా! మొగలసైన్యము మేవాడువఱకు వచ్చినప్పుడు కర్తవ్యమునుగూర్చి రాజపుత్త్రులకెట్టిమతభేదమును లేదు. మేము యుద్ధము చేయుదుము.

రాణా—జయసింహా! ఈచిన్నరాజ్యమే బలముతో ఢిల్లీ సార్వభౌముని బృహత్సైన్యము నెదుర్కొనును?

జయ—క్షత్త్రియసహజమగు శౌర్యబలముతోడనే.

కృష్ణ—దేవరవారి స్వర్గీయజనకులు ప్రతాపసింహు డేబలముతో మొగలుల నెదుర్కొనెను?

రాణా—వారిమాట వదలివేయుము. వారు మనుష్యులుగారు.

శంక—వారును రాజపుత్త్రులేగదా!

రాణా—కాదు శంకరసింహా!

చ॥ జనకుఁబ్రతాపసింహు నొక♦సాటి నరుండని పల్కఁగూడదా
ఘనుఁ డొకదైవశక్తివలె ♦ ఖస్థలినుండి పవిత్రపాత మ
ల్లను [illegible]తిభూ[illegible] [illegible]టుఁ ♦ [illegible] ఘు[illegible]ధియూర్మ[illegible]
బును బురుడించి రాజకుల♦మున్ వెలిగించె [illegible].

మఱియు నమ్మహాత్ముఁ డెందుండివచ్చినదియు నెందుల కేగినదియు నెవ్వరికినిఁ దెలియదు. ఎందఱును వారివలెఁ జేయఁజాలరు.

కృష్ణ—అందఱును వారివలె చేయఁజాలరను మాట వాస్తవము. కాని వారి పుత్త్రుఁడు తప్పక వారి ననుకరించునని యే మనుకొను

చున్నాము. స్వర్గీయమహారాణా మేవాడుస్వాతంత్ర్యరక్షణమునకై తమ ప్రాణము లర్పించిరి ఇంక వారి పుత్రుఁడు పోరుసలుపక యే మొగలులకు లొంగిపోవునా?

రాణా—కృష్ణదాస్! అది సుందరమగు నొక యనుభూతిమాత్రమే. ఇప్పుడు కొన్ని సంవత్సరములనుండియు మేవాడుప్రజ ధనధాన్యసంపన్నులై సుఖముగ కాలము పుచ్చుచున్నది. రాజ్యమున శాంతినెలకొనినది. కేవల మాయనుభూతికొఱకు ఈ సుఖము, ఈ స్వాతంత్ర్యము నాశమొనర్పవలయునా? నామమాత్రముగ పన్ను ఇచ్చుటచే రక్తపాతము తప్పిపోవుచుండ వృథాగా ఇన్ని జీవహత్యల కేల కడంగవలయును?

[illegible]—మహారాజా! మేము పన్ను ఇచ్చెదమా? ఎవనికి? మొగలులకా? పన్ను తీసికొనుటకు వారెవరు? శ్రీరామచంద్రునివంశీయులయొద్దనుండి పన్ను వా రేయధికారముతో పుచ్చుకొందురు?

రాణా—కొద్దిగ పన్ను ఇచ్చి ఈసుఖము, ఈశాంతి, ఈస్వాతంత్ర్యమును రక్షించుకొనుట మంచిదా? లేక ఇవియన్నియు పోఁగొట్టుకొనుటయా? ఏమి గోవిందసింగ్! మీయభిప్రాయ మేమి?

గోవిం—(ఉలికిపడి) మంచిది. ఈవిషయమున నేనేమియభిప్రాయమీయఁగలను? నేనేమియు చెప్పనుజాలను. ఈవిషయములను తెలిసికొననుజాలను. బాల్యమునుండి దుఃఖమే నాకు సహచరము. ఆపదుత్సంగమున నేను పెరిగితిని. మహారాజా! ఇరువదైదు సంవత్సరములనుండి స్వర్గీయమహారాణాతో ఆఁకలిదప్పికలు సరకుగొనక కొండలలో తిరిగితిని. ఆమహాత్మునికొలువుననుండి ఈయిరువదైదువత్సరములు నేను దారిద్ర్యవ్రతము నేయభ్యసించితిని. ఈయిరువదైదుసంవత్సరములు నేను దుఃఖమందలి సుఖమునే అనుభవించితిని. ఆసుఖ మేమనియడిగెదరు! ఇతరు



లకై దుఃఖమనుభవించుటలో నెట్టిసుఖముగలదు! కర్తవ్యపాలనమునకై దారిద్ర్యమనుభవించుట ఎంతమంచిమాట! ప్రాభాతికసూర్యునిసువర్ణకిరణములు దారిద్ర్యకుటీరమం దెట్టిప్రేమతో ప్రసరించునో అట్లు మరియొక్కెడను ప్రసరించవు. మహారాజా! నా యట్టిమంచిరోజులు గడచిపోయినవి! (పలుకుచు పలుకుచు ఆగిపోవును.)

జయ—గోవిందసింగ్! మధ్య నేల యూరకుంటిరి? తక్కినది చెప్పుడు.

గోవిం—ఏమిచెప్పుదును? ఏమియు చెప్పఁజాలను. నేనా మేవాడులో ఆదేవతాకుటీరము కూలుటయు ఆస్థానమున భోగవిలాసార్థమగు నీనాటకశాల నిర్మింపఁబడుటయు చూచితిని. ఆ మహాత్ముని పవిత్రమందిరము పగులఁగొట్టి ఆరాళ్ళతోనే ఐశ్వర్యవంతమగు ప్రాసాదము కట్టఁబడుట గాంచితిని. ఏపర్వతము ఒకనాఁడు జయధ్వనిచే ప్రతిధ్వనించుచుండెడిదో, ఏపర్వతము కీర్తిచే మహాపవిత్రముగ నుండెనో దానినీడను ఈ కేళీనికుంజముల నాలోకించితిని. నేను నా యాక్షీణదృష్టితో ఆమహాత్మ్యము ధూమమై ఆకసమున లీనమగుట గనుగొంటిని. జయసింగ్! సర్వస్వముపోయినది. ఇంక నున్నదియేమి? ఇప్పుడా మహిమాకిరణములు కొన్నిమాత్రమే మిగిలియున్నవి. ఇప్పుడా మహాత్మ్యము మరణోన్ముఖమై మృత్యుశయ్యపైఁబడి కిరణావిలోకనంబుల మనవంక చూచుచు చావున కెదురుచూచుచున్నటుల గనిపించుచున్నది.

కేశ—గోవిందసింహాజీ! తామబ్రదికియుండువఱకు గౌరవము నష్టము కాఁజాలదు.

గోవిం—నేనా? కేశవసింహాజీ! ఇప్పుడు నేనేమి చేయఁగలను? ఇప్పుడు నా కారోజులు గడచినవి. నే నిప్పుడు ముక్కాలిముదుసలినైతిని. చేతులు వణఁకుచున్నవి. ఈ చేతులతో నిప్పుడు

చక్కఁగా కత్తినైనఁ బట్టఁజాలను. ఈ బక్కయెముకలతో శరీరము నిలఁబెట్టనేని చాలను. కాని మహారాజా! ఇప్పుడును నాకు మరల ఆపర్వతారణ్యములఁ గ్రుమ్మరవలయునని యు, మాతృభూమికై ఆఘుధుర దుఃఖము ననుభవించవలయుననియు కోర్కె గలదు. హా! ఈశ్వరా! దుఃఖము సహించు శక్తిని గూడ నీవు హరించితివి! (గోవిందసింహుఁడు మెదలక యుండును. అందఱును నిశ్చేష్టులగుదురు.)

రాణా—అయితే గోవిందసింహాజీ! భారతవర్షమంతయు మొగల బాదుషాకు తలవంచెనని మీ రెఱుఁగుదురు. ఇంక రాజపుతానాలో నీచిన్న మేవాడురాజ్యము విశ్వవిజయిని యగునా! మహాసేనముం దెట్లునిలువఁబడఁగలదో చెప్పుడు.

గోవిం—మహారాజా! నేను విన్నవింపవలసినది మొదటనే విన్నవించితిని. ఇప్పుడు నేను చెప్పనదేమియు లేదు.

రాణా—సామంతప్రభువులారా! ఇప్పుడు యుద్ధము వ్యర్థమని నాకు తోఁచుచున్నది. మనము మొగలులతో సంధిచేసికొందము. చోబ్దార్! నీవేగి మొగలదూతను గొనిరమ్ము. (చోబ్దారు పోవును.)

గోవిం—మహారాణాప్రతాప్! మహారాణాప్రతాప్! నీవు స్వర్గములోఁ గూర్చుండి యీమాటలు వినఁజాలకుంటివి. మంచిది. వజ్రిమా! నీభైరవస్వరమున ఈహీనపదోచ్చారణ మడఁచివేయుము. మేవాడ్! మొగలుప్రభుత్వస్వీకారమునకు మున్నె నీవు భూకంపముచే ధ్వంసముగమ్ము.

(చోబ్దారుతో మొగలదూత వచ్చును.)

రాణా—మేము సంధికి సంసిద్ధులమని నీవు మీసేనాపతితోఁ జెప్పుము.

(సత్యవతి అతివేగముతో ప్రవేశించును.)



సత్య—ఎన్నటికినికాదు. ఎన్నటికినికాదు. సామంత ప్రభువులారా! మీరు యుద్ధమునకు సన్నద్ధులుకండు. రాణాగారు మిమ్ము రణక్షేత్రమునకు గొంపోవనిచో మీసైన్యములను నేను నడిపెదను.

గోవిం—దేవీ! నీవెవరు? ఈఘోరాంధకారమున విద్యుల్లేఖవలె వచ్చి నిలబడిన నీవెవరు? కోమలమును గంభీరమునగు ఈవజ్రిధ్వని ఎవరిది?

రాణా—నిజముగ నీవెవ్వరవో చెప్పుము.

సత్య—మహారాజా! నేనొక చారణిని. మేవాడురాజ్యమున గ్రామములకును పర్వతపరిసరభూములకును జని మేవాడుమహిమను గానముచేయుచుందును. ఇంతకన్న నన్నుగూర్చి వివరముగ జెప్పఁబనిలేదు.

సామం—ఆశ్చర్యము!

సత్య—సామంతప్రభువులారా! రాణాగారు ఉదయసాగరపు రాజప్రాసాదములందు విలాసస్వప్నముల వీక్షించుచు నుండుఁగాక! నేను మిమ్ము యుద్ధక్షేత్రమునకుఁ గొంపోవుదును.

గోవిం—ఇదియేమి? నాశరీరమున ఈయావనోత్సాహ మెచ్చటనుండి వచ్చినది! ఈఆనందము యీఉద్రేకము నా కెక్కడనుండివచ్చినవి! సామంతప్రభువులారా! మీరు మహారాణాప్రతాపసింహునిపుత్రుని యీ యపకీర్తినుండి రక్షింపుఁడు. ఈ విలాసమును పదదళితము గావింపుఁడు. ఈయాటవస్తువుల బ్రద్దలు కొట్టుఁడు.

(గోవిందసింహుఁడు దగ్గిరనున్న ఇత్తడిరేకుతో నిలువుటద్దమును బ్రద్దలుగొట్టును)

గోవిం—సామంతప్రభువులారా! మీరు ఖడ్గములు ధరింపుఁడు. (రాణాను పట్టుకొని) మహారాజా! దయచేయుఁడు.

రాణా—గోవిందసింహాజీ! నడువుఁడు, మనము యుద్ధము చేయుదము. మొగలదూతా! మేము యుద్ధమొనర్చెదమని మీ సేనాపతితో చెప్పుము. చోబ్దార్! నాగుఱ్ఱమును సిద్ధపఱచుము.

సత్య—మేవాడురాణాకు జై!

సామం—మేవాడురాణాకు జై!

---

చతుర్థదృశ్యము.

స్థానము—ఆగ్రాలో మహాబత్ఖాను ఇల్లు

సమయము:—ప్రభాతము.

(సేనాపతియగు మహాబత్ఖానును, మొగల సర్దారగు అబ్దుల్లాయు నిలిచి మాట్లాడుచుందురు)

మహా—హిదాయత్ఖాను సేనాపతి యయ్యెనా?

అబ్దు—అవును, ఖాన్సాహబ్.

మహా—ఈవిషయము మీరు బాగుగ నెఱుగుదురా?

అబ్దు—అవును బాగుగ నెఱుఁగుదును. బాదుషా అతని వెంట ఏఁబది వేల సైన్యముకూడ పంపిరి.

మహా—ఎక్కడి హిదాయత్ఖాను! ఎక్కడి సేనాధిపత్యము! ఈకాలమున యోగ్యతకును సామర్థ్యమునకును గౌరవములేదు. యోగ్యులకు చాల అగౌరవము జరుగుచున్నది. తడిసిన యీ పెంటకుప్పలనుండి ఎన్ని కుక్కగొడుగులు పుట్టునో తెలియదు.

అబ్దు—నిజము. మీరు చెప్పినది యథార్థము. హిదాయతు ఖానునాయకుడగుటకు హేతువు ఆతఁడు బాదుషాకు మేనల్లుఁడు.

మహా—మేనల్లుఁడయిన నగుఁగాక! ఇంత పెద్దసైన్యమును నడపుట సులభమగు పనికాదు. అతని బావమఱఁది ఇనాయత్ఖానుకూడ అతని వెంటనే యుండెనా?



అబ్దు—ఉండవచ్చును.

మహా—ఇనాయత్ఖాను నిజముగ యోధుఁడే. అతఁడు యుద్ధము చేయఁగలఁడు. బాదుషా హిదాయత్ఖానును నామమాత్రమునకు సేనాపతిగాఁ జేసినట్లు తెలియుచున్నది. అసలు సేనాపతి ఇనాయత్ఖానే అయియుండును.

అబ్దు—జనాబ్! ఎంత నామమాత్రపు దళవాయియైనను తుదకు తుపాకిమోఁత కేని వెఱువక యుండవలయునుగదా!

మహా—మంచిది. ఈమాఱు మేవాడుయుద్ధములో అంతయు విశదమగును.

అబ్దు—బాదుషా మిమ్ముకూడ మేవాడుయుద్ధమునకు పొమ్మని సెలవిచ్చిరా?

మహా—అవును, సయ్యద్సాహబ్!

అబ్దు—అయితే తామేల బయలుదేరలేదు?

మహా—ఏలయన మేవాడు నాజన్మభూమి. బాదుషా నన్ను వంగ ఘూర్జరదక్షిణాదిదేశములలో నెచ్చటకుఁబంపినను పోదును. కాని మేవాడును జయింపబోవుట నాకుచితముగ లేదు.

అబ్దు—అగుచో మీరు చెప్పినది న్యాయమే. ప్రొద్దెక్కుచున్నది, నాకు సెలవిండు. ఆదాబ్!

మహా—ఆదాబ్!

(అబ్దుల్లా పోవును.)

మహా—కానిమ్ము. హిదాయతు సేనాపతియగుట మంచిదే. బాగుగ తమాషా చూడవచ్చును. బిచ్చగానిని పట్టుకొని బలాత్కారముగ గుఱ్ఱము నెక్కించుటవంటిదే యిది. (ప్రస్థానము)

---

## పంచమదృశ్యము

స్థానము - మొగలులశిబిరము.

సమయము - మధ్యాహ్నము.

(మొగలసేనాపతియగు ఖాన్ఖానాహిదాయత్ అలీఖాన్‌బహద్దరు తన క్రిందియుద్యోగియగు హుసేనుతో మాట్లాడుచుండును.)

హిదా—హుసేన్! ఈకాఫరులను జయించుట మురబ్బాతినుటకన్న సులభమగుపని.

హుసేన్—అలీసాహెబ్! ఈపని మీరనుకొన్నంత సులభమైనది గాదు. ఏడువందలసంవత్సరమునుండియు ఈచిన్నరాజ్యము మహమ్మదీయప్రభుత్వమునకు లోఁబడకయున్నది. ఇంతయేల, సాక్షాత్తు అక్బరుబాదుషాయును దీనిని వశపఱచుకొనలేక పోయెను.

హిదా—అయితే అక్బరువద్ద మంచిసేనాపతి యుండకపోవచ్చును. అప్పుడు ఖాన్ఖానాహిదాయత్ అలీఖాను ఉన్నచో చూపించువాఁడు!

హుసేన్—అయితే మానసింహుఁడు తక్కువవాఁడా?

హిదా—పాపము, మానసింహుని కేమి తెలియును? అతఁడు యుద్ధము చేయఁగలఁడా?

(వంటవానిప్రవేశము.)

వంట—హుజూర్! వంట సిద్ధము.

హిదా—మానసింహుఁడే సేనాపతియగుచో మావంటవాఁడగు జాఫర్ మియాంకూడ సేనాపతికావచ్చును. ఏమి జాఫర్ మియా!

జాఫర్—హుజూర్! వంట తయ్యారు.

హిదా—నీవు ఫౌజుతో పోట్లాడఁగలవా?

జాఫర్—హుజూర్! కోడిపెట్టమాంసము.



హిదా—మంచిది. నీవు కోడిమాంసము వండితివి. సరియే. నీవు యుద్ధముచేయఁగలవాఁయని యడుగుచున్నాను.

జాఫర్—వేపుడుమాంసమా హుజూర్? అది గొఱ్ఱెది.

హిదా—మంచిది. మేమును ఇచ్చట గొఱ్ఱెమాంసము తయ్యారుచేసెదము. నీవు పొమ్ము. మేము వచ్చెదము.

(జాఫరు పోవును)

హిదా—హుస్సేన్! ఇప్పుడిక్కడ గొఱ్ఱెమాంసము వేయింపఁబడును.

హుసేన్—ఏగొఱ్ఱెది?

హిదా—ఏగొఱ్ఱెదా? ఈరాజపుత్రులది. వీరును గొఱ్ఱెలేకదా.

హుసేన్—సాహెబ్! క్షమింపుఁడు. ఈవిషయమై మీతో నేకీభవింపఁజాలను.

హిదా—హుసేన్! నీవింకను కొంతకాలము శిక్షగఱచుట యవసరము. నావెంటవచ్చినందుకు యుద్ధమన నేమియో చక్కఁగ నేర్చుకొనుము. ముందు నీ కుపయోగపడును.

హుసేన్—చాలమంచిది జనాబ్! పెద్దపెద్దయేనుఁగులు కొట్టుకొనిపోయినవి. ఇంక దోమచేయునదేమో చూడవలయును.

హిదా—హుసేన్! నీవు చాలపొగరుపోతువుగను, మర్యాద తెలియనివాఁడవుగను కనిపించుచున్నావు. నేను సేనాపతినని యెఱుఁగవు. నేను కోరినచో ఇప్పుడే నీతల తీయించెదను.

హుసేన్—అవును జనాబ్! మీరు సేనాపతియని యెఱుఁగుదును.

హిదా—ఆఁ. నేను సేనాపతియని యెప్పుడు జ్ఞాపకముంచుకొనుము.

హుసేన్—చిత్తము! అట్లే జ్ఞాపకముంచుకొందును. కాని మేవాడును గెలుచుట—

హిందా—అరే మరల మేవాడుమాటయెత్తెదవు! హుసేన్! నీవు నాకు మిత్రుఁడవుగాన చెప్పుచున్నాను, వినుము. మేవాడు గెలుచుట యన నా కొకచిటిక వేయుటవంటిది.

హుసేన్—అట్లయగుచో నొకపెద్దచిటిక యని చెప్పవలయును.

హిందా—చాలపెద్దదికాదు. మంచిదిపొమ్ము. ఇప్పుడు మేము భోజనమునకుపోవుచున్నాము. (హుస్సేను వెళ్ళఁబోవును. హిందాయాతు అతనిని మరల పిలుచును.) ఇదుగో హుసేన్! ఒకమాట వినిపొమ్ము. చూడు, నేను సేనాపతిననుమాట యెప్పుడును మరువవద్దు.

హుసేన్—చాలమంచిది జనాబ్!

హిందా—పొమ్ము. (హుసేన్ వెళ్లును)

హిందా—ఈకాఫరులనుగెలుచుట ఏమికష్టము! వీరియుద్ధముచేయుటయే తటస్థింపదు. నాలుగుతుపాకిమ్రోఁతలు వినఁగనే అందఱును పాఱిపోదురు. మళ్ళీ జాడ తెలియదు.

(గర్వముతో ప్రస్థానము.)

---

## షష్ఠదృశ్యము

స్థానము - ఉదయపురమున ఉదయసాగరతీరము.

సమయము - ప్రభాతము.

(మేవాడు రాజకన్యయగు మానసి పాడును.)

### గీతిక.

భిక్షుకిగా నీదరికే తెంచితి వేఱుగ నిను నేఁగోర నిఁకన్
రక్షింపుమ యీదాసికి ప్రేమపుభిక్ష పెట్టుమో ప్రాణప్రియా॥
నీవయి నామది దవిలినదాదిగ నిద్దుర ఆఁకలి నన్నువిడెఁగ
తాపమేల మానమేక ప్రేమబంధమునఁ దగుల్కొనియుండఁగ॥



నీమృదుహాసము నాకుప్రాణమిదు నేనిఁక నేమియుఁ గోరఁబ్రియా
ప్రేమ మొక్కటియె నినుయాచించెద వేయరుదెమ్మదయాహృదయా!

(ఒక అంధబాలకునితో నొకభిక్షుకి వచ్చును.)

భిక్షు—దాతకు జయము.

మాన—ఏయమ్మా! ఇతఁడు నీపిల్లఁడా?

భిక్షు—కాదు. వీఁడు నాచెల్లెలిబిడ్డఁడు. వీఁడు పుట్టుగ్రుడ్డి. వీనితల్లి చనిపోయినది.

మాన—వీనితండ్రి?

భిక్షు—పరదేశమున నున్నాఁడు.

మాన—ఆహా! ఎంత ముద్దుపిల్లఁడు. వీనిని నాకిచ్చెదవా?

భిక్షు—వీఁడు నన్ను విడిచి ఒంటరిగా నుండఁడు అమ్మా!

మాన—మంచిది. వీనిని నీయొద్దనే యుంచుకొనుము. అప్పుడప్పుడు వీనిని నాకడకుఁ గొనివచ్చుచుండుము. ఇదిగో! (ఒక మొహరీ ఇచ్చును.)

భిక్షు—దేవరవారికి జయము. మీరాజ్యము చల్లగ నుండవలె.

(బాలకునితో ప్రస్థానము)

మాన—ఈభిక్షుకురాలి జయశబ్దోచ్చారణ మెంతమధురముగ నున్నది! ఇది జయభేరికంటెను ప్రబలము. తల్లి దీవనకంటెను అధిక ప్రేమ పూరితము. బాలకుని తొలుతొల్లటి పలుకులకంటెను అతిమధురమై యలరారుచున్నది.

అజయసింహుఁడు—(ప్రవేశించి) మానసీ!

మాన—అజయా! రమ్ము, రమ్ము. నేనిపుడు చాల సంతోషముగ నుంటిని. ఈ సంతోషములో కొంతభాగము నీవును బుచ్చుకొనుము.

అజ—నీ యీ సంతోషమునకుఁ గతంబేమి?

మాన—నాయీ సంతోషము పరిపూర్ణము. శరత్కాల సదికంటెను బరిపూర్ణము. నేఁడొక భిక్షుకురాలు నన్ను ఆశీర్వదించిపోయి నది.

అజ—ఈ ప్రపంచమున నిన్ను హృదయపూర్వకముగ నాశీర్వదింపని వా రెవరు? నేను నిత్యము సందులందును, బజారులందును జనులు మేవాడురాజకుమారికను ప్రశంసించుటయే విను చుందును.

మాన—నీవు రోజు వినుచుంటివా? అయితే ఒకనాఁడు నేనును వినఁ జాలుదునా?

అజ—ఒకనాఁడు ఇంటినుండి బయలువెడలుము. తప్పక వినఁగలవు.

మాన—అజయా! నేను ప్రతిదినము బయటికి వెళ్ళుచునే యున్నాను ఎట్లన,

గీ॥ అతిథిశాల నిర్మించి తం♦డనుదినమ్ము
పోయి యతిథులకు న్నేనె ♦ భోజనంబు
పెట్టుచుందును స్వయముగ ♦ నట్టుకాని
నాడు కడుఁబొక్కుచుందును ♦ నామనమ్ము.

అజ—మానసీ! నీజీవితము ధన్యము. మానసీ! నేను నీకడ సెలవు గైకొనుటకై వచ్చితిని.

మాన—ఏమి? ఎక్కడకు పోయెదవు?

అజ—యుద్ధమునకు.

మాన—ఎప్పుడు పోయెదవు?

అజ—రేపు ఉదయము.

మాన—అచ్చటనుండి మరల నెప్పుడువచ్చెదవు?

అజ—నిశ్చయములేదు. తిరిగివచ్చెదనో లేనోకూడ చెప్పఁజాలను.

మాన—ఏమి?

అజ—యుద్ధమున చనిపోవచ్చును.



మాన—హా! (తలవంచును.)

అజ—మానసీ! నేను తిరిగిరాకున్నచో?

మాన—అప్పు డేమియగును?

అజ—నీకుదుఃఖముండునా లేదా?

మాన—ఉండును.

అజ—ఇంత ఉపేక్షాభావమా! మానసీ! నీవెఱుఁగవా?—

మాన—నే నేమియెఱుఁగుదును?

అజ—నీపై నాకెంత ప్రేమయున్నదో యెఱుఁగవా?

మాన—ఎఱుఁగుదును. చాల ప్రేమయున్నది.

అజ—నీకు నాపై ప్రేమలేదా?

మాన—ఉన్నది.

అజ—కాదు. నీకు మఱియొకరిపై ప్రేమయున్నదా?

మాన—ఉన్నది. మనుష్యమాత్రునిపై నున్నది.

అజ—కఠినురాలా! నిర్దయురాలా!

మాన—ఏమి అజయా! నేను నిన్నొక్కనినే ప్రేమింపవలయుననియు మఱియెవ్వరిని ప్రేమింపఁగూడదనియు తలఁచుచుంటివా? నీ వొక్కఁడవే నాహృదయమంతటను అధికారము చేయఁగోరి తివా? అగుచో నీవు చాల స్వార్థపరుఁడవు.

అజ—మానసీ! నీవింతదనుక ఏమియు తెలియని బేలవేనా?

మాన—అజయా! నాపై నింత కోపగించెదవేల? ఇందు నాయపరాధ మేమున్నది? మానవమాత్రునిపైఁ బ్రేమపూనుటయే యప రాధమా? ఇదియే నాయపరాధమగుచో తగినదండన మొసఁ గుము. దాని ననుభవించుటకు సిద్ధముగనుంటిని.

అజ—నీకు దండ మొసఁగుదునా—నేనా?

మాన—నీవు దండించుము అజయా! నేఁడు నీవు యుద్ధమునకుఁ బోవు చుంటివి. అందు నీవెంతహత్య యొనర్చిన .. జనులు నిన్నంత

పొగడుదురు. అట్లే నేనెంత అధికముగ ప్రేమవహించిన నా అపరాధమంత యధికమగునా?

అజ—మానసీ! నీవు ప్రపంచమునంతను ప్రేమింపుము. నీయుదార హృదయమున విశ్వమంతయు నుంచుకొనుము. ఇపుడు నేను నిన్నేమియు ననను. ఆకాశమువంటి నీయుదారహృదయమును తుచ్ఛమగు నాక్షుద్రహృదయమున బంధింపనెంచితిని. నేను చాలమూర్ఖుఁడను. నన్నుక్షమించుము. మానసీ! సెలవుపుచ్చుకొందును.

మాన—మంచిదిఅజయా! పొమ్ము. ప్రపంచమంతయు నన్యాయము నావరించినది. దానినడంచుటకై అప్పుడప్పుడు యుద్ధముచేయుట తప్పనిదగుచున్నది. కాని యుద్ధము చాలక్రూరమగుపని. వీలగునంతవఱకు అందుఁ బవిత్రుఁడవుగా నుండుము.

(అజయసింహునిప్రస్థానము.)

మాన—పొమ్ము అజయా! నీవు యుద్ధక్షేత్రమునకుపొమ్ము. నా శుభసంకల్పము కవచమువలె నిన్నురక్షించును. అయితే యుద్ధమునచచ్చినవారిగతి యేమగును? వారితల్లులును, ఆలుబిడ్డలును ఇటులే భగవంతునితో వారిమంగళమును ప్రార్థింపరా? అందులో నెందఱిప్రార్థనలు నిష్ఫలములగునో, ఎందఱిసాధనలు వ్యర్థములగునో తెలియదు. దీనికి ప్రతిక్రియయేమియు లేదా? (కన్నీరుకార్చుచు ఆకసమువంక చూచును కొంతసేపటికి ప్రసన్నవదనయై చప్పట్లువేయుచు ననును) మంచిది. ఇప్పుడు నేనును ఒకపనిచేసెదను. యుద్ధములో చనిపోయినవారికి నేనేమియు సాయముచేయఁజాలను. కాని దెబ్బలుతిన్నవారికి శుశ్రూషచేయుదును. ఈపనియే చేసెదను. ఇందు చెడుగేమున్నది? ఇదియే చేసెదను.

(రాణిప్రవేశించును)

ణి—వింటివా మానసీ?



మాన—ఏమి?

రాణి—మీనాయనగారు యుద్ధమునకు వెళ్ళిరి.

మాన—అవును వింటిని.

రాణి—మొగలులతో యుద్ధము చేయుటకు వెళ్లిరి.

మాన—అవును వింటిని.

రాణి—ఔరా! ఏమి ఆ యౌదాసీన్యము! వింటిననియా! యుద్ధమన వెన్నతినుట యనుకొంటివా? యుద్ధములో వేలకొలఁది జనులు మడసెదరు. తెలియునా?

మాన—అవును. మడియవచ్చును.

రాణి—మడియవచ్చునుకాదు. మడియుదురు. ఈమాఱు బాదుషాసైన్యముతో యుద్ధము. ఇంక సర్వస్వము పోయినదనుకొనుము. యుద్ధమునకు వెళ్ళినవారు చంపఁబడుదురు సరే. వెళ్ళనివారి గతియేమి కానున్నదో తెలియదు.

మాన—అయితే నేనేమిచేయుదును?

రాణి—నేను నీపెళ్ళిమాట ధృవపఱచితిని. కాని పెండ్లికి సమయము చిక్కదు. ఇట్టిగడబిడలో నెక్కడనేని పెండ్లియగునా?

మాన—కాకున్న పోనిమ్ము.

రాణి—కాకున్నపోనిమ్మా! పెండ్లికాకున్న నేమగునో తెలియునా?

మాన—బాగుగనే యగును.

రాణి—బాగున్నది. ఇది యెచ్చటనేనికలదా? కన్యలపెండ్లికాకున్న నింకేమేనికలదా? యోధపురరాజకుమారునితో నీపెండ్లి నిశ్చయింపఁబడినది. కాని ఇప్పుడు పెండ్లికాఁజాలదు. అందఱు పోయెదరు. అందఱుచచ్చెదరు. ఎక్కడనైన పెండ్లిపనికానిచ్చుకొని యుద్ధమునకు దిగుదురు. కాని రాణాగారు నామాటవినలేదు.

మాన—అమ్మా! నీవుచింతింపకుము. నేను పెండ్లికన్న నుత్తమమగు పనిచేయుటకు తలపెట్టితిని.

రాణి—అదియేమి?

మాన—నేను యుద్ధక్షేత్రమునకుఁ బోవుదును.

రాణి—ఎందుకు?

మాన—అమ్మా! యుద్ధములో చాలమంది చచ్చెదరని నీవిపుడే చెప్పితివి కదా! చచ్చినవారికి నేనెట్టిసహాయమును చేయఁజాలను. కాని శస్త్రాహతులకు నేను పరిచర్య చేసెదను.

రాణి—రంగము చెడినది. అజయుఁడు నీకిదియే నేర్పినట్లులున్నది.

మాన—లేదు, ఇందతని దోషమేమియు లేదు. అజయుఁడు జనులను జంపుటకుఁ బోవుచున్నాఁడు. నేను రక్షించుటకుఁ బోయెదను.

రాణి—కాదు. ఇది యెచ్చటనేని జరుగునా?

మాన—చాల బాగుగ జరుగును.

రాణి—కాదు నీవు వెళ్ళఁజాలవు.

మాన—అమ్మా! నీవు నిశ్చింతముగ నుండుము. నేను తప్పక వెళ్ళెదను. కర్తవ్యము నన్ను ఆహ్వానించునపుడు నేనింక నెవరిమాటలను విననని నీవెఱుఁగుదువు. ఇంక నీవు పొమ్ము. నేను ప్రయాణ సన్నాహము చేసెదను.

రాణి—నీవెవరి వెంటఁబోదువు?

మాన—అజయసింహుని సేన వెంట.

రాణి—ఏమనుకొంటినో అదియే యయ్యెను. రాణాగారు వెళ్ళిపోయిరి. ఇంక దీనికి చెప్పువారెవరు?



మాన—నాయనగారిక్కడనున్నచో ఈపనినుండి నన్నెన్నడు వారింపరు. వారిని నేను బాగుగా నెఱుఁగుదును. వారు చాల దయాస్వభావులు.

రాణి—వారు నీయీపనికిని అడ్డుచెప్పరు. కనుకనే నీకింతయాగడముగ నున్నది. పోయినది. అంతయు పోయినది, నాకు తెలియును. ఏదియో గొప్పయనర్థము రానున్నది.

మాన—అమ్మా! నీవేమియు చింతింపకుము. ఒక మనుష్యుఁడు మఱియొక మనుష్యునిపై విద్రోహము సేయుచున్నాఁడు. చేతనగునంతవఱకు నేనా విద్రోహమును తగ్గించెదను. అమ్మా! ఇంక నీవు పొమ్ము. ఏమియు భయము లేదు.

రాణి—ఇప్పుడు పూర్తిగా కలియుగము వచ్చినది. (పోవును)

మాన—నాహృదయమున ఈ ఇచ్ఛను ఎవఁడు కలుగఁజేసెను? మొదట నీజ్యోతి నాహృదయమున నెక్కడనో మిణుకు మిణుకు మనుచుండెడిది. కాని దానిప్రకాశము ఇప్పుడు హృదయమంతటను చక్కగ వ్యాపించినది. ఇది ఒక నూతనోత్సాహము. పరమానందము. వివాహసుఖము దీనిముందెందుకును కొఱగాదు.

---

స్థానము—మేవాడు, యుద్ధక్షేత్రము.

సమయము—సాయంకాలము.

[హిదాయతు ఒక డేరాలో కూర్చుండి హుసేనుతో మాటలాడుచుండును. బయట యుద్ధకలకలము వినఁబడుచుండును. ఇద్దఱు సిపాయీలు ఖడ్గపాణులై ద్వారముకడ నిలఁబడియుందురు.].

హిదా—హుసేన్! మేవాడుసైన్యమెంతయుండునో నీవుఊహించితివా?

హుసేన్—సుమారు యేబదివేలు ఉండును.

హిదా—ఆఁ— అయితే రాజపుత్రులింకను పారిపోవుటలేదా?

హుసేన్—లేదు జనాబ్!

హిదా—పొద్దుటనుండి పోరుచున్నారు. కాని పాఱిపోవుచున్నట్లు గనుపట్టుటలేదా?

హుసేన్—లేదు. వారు బాగుగపోరాడుటకు నిశ్చయించుకొనిరి.

హిదా—వారు పోరాడుట కొంచె మెఱిఁగినవారుగాఁ గనుపట్టుచున్నారు.

హుసేన్—చూడఁగా నట్లేయున్నది.

హిదా—ఇదిగో! ఈవినఁబడునది రాజపుత్రులధ్వనియే. మన సిఫాయిలేమియు అఱచుచున్నట్లులేదు. వారుయుద్ధము చేయుచున్నారా?

హుసేన్—ఎందుకుచేయరు? మీరొకమారు బయటికివచ్చిచూడరేమి? మీరు సేనాపతులుగదా!

హిదా—అవును నేను నిజముగ సేనాపతినే. అయిననేమి? నేను డేరానుండి బయటికి వచ్చునవసరములేదు నాబావమఱది ఇనాయత్ఖానొక్కఁడే వీరికిచాలును. ఇంక నాతోకూడ వీరెక్కడ యుద్ధముచేసెదరు?

హుసేన్—అవును జనాబ్! కాని చూడుడు. రాజపుత్రులు మరల గర్జించుచున్నారు. ఇదిగో! వారియఱపె. మన యదృష్టము మంచిదిగాఁ గనుపట్టుటలేదు.

హిదా—బయట నేమిజరుగుచున్నదో కొంచెము చూచిరమ్ము.

హుసేన్—మంచిది.



హిదా—వద్దులెమ్ము. నీ విచ్చటనే యుండుము. నాకిదియొక పెద్ద దురభ్యాసము. పొద్దుకుంకిన నేనొక్కఁడ నుండఁజాలను.

హుసేన్—ఇది నిజముగ దురభ్యాసమే.

హిదా—మరల నేదో గందరగోళమగుచున్నది చూడుము.

హుసేన్—ఇది మనకు దగ్గఱనే కనుపట్టుచున్నది.

హిదా—ఏమంటివి?

హుసేన్—జనాబ్! ఎవ్వరో ఇటే వచ్చుచున్నటులున్నారు.

హిదా—ఆఁ! ఎవ్వరోవచ్చుచున్నారా? (హుసేనుని పట్టుకొనును)

(ఒక సిఫాయివచ్చును)

హిదా—ఏమిసమాచారము?

సిఫా—ఖుదావంద్! ఫౌజుదారగు శంశేరుఖాను చచ్చిరి.

హిదా—ఏమీ!

హుసేన్—తక్కినయుద్యోగులు?

హిదా—ఇనాయత్ఖాను బ్రదికియున్నాడుగదా?

సిఫా—చిత్తము.

హుసేన్—మంచిది. పొమ్ము. (సిఫాయి పోవును.)

హిదా—నిజముగ నేదియో మొప్పము రానున్నది.

హుసేన్—చిత్తము. అట్లే యున్నది. అయితే నాడు మేవాడు జయించుట చిటికెవేయుటవంటిదని సెలవిచ్చితిరి. కాని ఇది యెంత కఠినకార్యమో నేఁడు తెలిసియుండవచ్చును. ఇప్పుడు మీకీనాసుఖముమాట వచ్చినదా? ఇదిగో! చూడుడు. ఇంక దగ్గఱకు వచ్చుచున్నారు.

హిందా—నిజము. ఈయుద్ధములో నేమి కానున్నదో తెలియదు.

హుసేన్—ఏమియు తెలియదు.

[రెండవ సిఫాయి వచ్చును.]

హిందా—ఏమి సమాచారము?

సిఫా—హుజూర్! బాదుషాసైన్యము ఎడమవైపుగా పాఱిపోవు చున్నది.

హిందా—ఎందుకు?

హుసేన్—ఈయుఅవు వారిదేకాఁబోలు.

సిఫా—చిత్తము. (ప్రస్థానము)

హుసేన్—అయ్యా సేనాపతిగారు! మీరు కొంచెము బయటకు దయ చేయుఁడు. మిమ్ములఁజూచిన సైనికులకు కొంచెము ధైర్యము గలుగును. మీరు సేనాపతులుగదా! కొంచెము బయటకు దయచేయుఁడు.

హిందా—హా! నేను సేనాపతిని! (హతాశాసూచకమగు రూపము దాల్చును.)

[మూడవసిఫాయి వచ్చును.]

సిఫా—ఖురావంద్! ఇనాయత్ఖాను చంపఁబడిరి.

హిందా—ఏమీ! వీడేమి చెప్పుచున్నాఁడు? ఇదియును సంభవమా? మరల రాజపుత్రుల ధ్వని వినిపించుచున్నది. అదిగో! వారు చాల దగ్గఱకు వచ్చిరి.

హుసేన్—జనాబ్! మీరొకసారి బయటకు వచ్చిన బాగుగ నుండును.

హిందా—ఇప్పుడు సమయమేది? ఇదిగో! వినుచున్నావా?



హుసేన్—ఆఁ వినుచున్నాను. క్రమముగ నీధ్వని హెచ్చుచున్నది. మఱియు సమీపించుచున్నది.

[నాల్గవసిఫాయి వచ్చును.]

సిఫా—జనాబ్! అంతయు నశించినది.

హిందా—ఇది నేను మొదటనే యెఱుఁగుదును. ఇంకా?

హుసేన్—ఇంక నేమగును? నాశనమైన పిదప నింక నేమగును?

సిఫా—హుజూర్! బాదుషాసైన్యమంతయు పాఱిపోవుచున్నది. రాజపుత్రులు ముందుకు వచ్చుచున్నారు.

హిందా—హుసేన్! శత్రువులు వచ్చినట్టులున్నారు.

(తెరలో) పాఱిపొండు! పాఱిపొండు!

హిందా—ఏవైపు?

హుసేన్—ఈవైపు.

[హుసేను ఒకవైపునకు పాఱిపోవును. హిందాయతు రెండవ వైపు పాఱిపోవును. కొందఱు రాజపుత్రులతో మొగలుల జెండా పుచ్చుకొని అజయుఁడు వచ్చును.]

అజ—మేవాడరాణాకుజై!

సైనికులు—మేవాడరాణాకుజై!

హిందా—(రెండుచేతులు పైకెత్తి) శరణు. నన్నుకొట్టకుఁడు. నే నింక బ్రతికియుంటిని. నన్ను చంపకుఁడు. నన్ను కైదుచేయుఁడు.

అజ—నీ వెవరు?

హిందా—నేను బాదుషా ఫౌజుకు సేనాపతిని.

అజ—సేనాపతీ! ఇప్పుడు రణరంగమును విడిచి డేరాలోనుంటివేల?

హిందా—ఆఁ—నేను—ఆఁ—నేనా? దీనికొక పెద్దకారణమున్నది. కాని ఇప్పుడు జ్ఞాపకములేదు. నన్ను మీరు చంపకుఁడు. నాప్రాణము రక్షింపుఁడు.

అజ—చూచితిరా ఈబయ్యన్న మేవాడుగెలుచుటకు వచ్చినాడు! నీవు భయపడకుము. నీప్రాణముతీయము. రాజపుత్రానాయంతటను మేవాడువిజయఘోషణము గావింపుఁడు.

హిదా—ఆఁ. కావింపుఁడు. ఇందు నాకేమియు బాధలేదు.

[సైనికులతో అజయుఁడు పోవును.]

హిదా—ప్రాణము దక్కినది. దాహము! నీరు! నీరు!

—oo✠oo—

అన్యదృశ్యము.

స్థానము - యుద్ధక్షేత్రము.

సమయము - అర్ధరాత్రి.

[శవములయు రణాహతులయు కుప్పలు పడియుండును. సైనికులతో మానసి తిరుగుచుండును. కొందఱు సైనికుల చేతులలో కాగడాలుండును.]

మాన—కొందఱు అటుపొండు. నే నిక్కడ చూచెదను.

[కొందఱు రాజపుత్రసైనికులు వెళ్ళుదురు]

మాన—ఆహా! నలుగడలను ఏమిహత్య జరుగుచున్నది! ఏమిహత్య! ఈయేడుపులు! ఈఅఱపులు! ఎట్టి కరుణదృశ్యము! ఓ పరమేశ్వరా! నీరాజ్యములో మనుష్యుఁడు మనుష్యునిఁ దినుటయే నియమమా? పృథ్విపై నీహింస కింక నంతముండదా? మనుష్యుఁడు నిరాతంకముగ నింకొకమనుష్యునిఁ జంపుచుండ దయామయుఁడవగు నీవు మెదలక చూచుచుందువా? నీలాకాశమును భేదించుకొనుచు పాపముయొక్క వికటము భీకరము నగు విజయహుంకారము పైకెగయుచున్నది. అప్పటికిని నీవు దానికుత్తిక నొత్తవా? ఇదియెంతభీషణము, కరుణము, మర్మ



భేదకము నగుదృశ్యము! ఈపీనుఁగులకుప్పలుచూడఁజాలను. ఈయాహతుల యార్తనాదములు వినఁజాలను.

౧ ఆహ—అబ్బో చచ్చితిని.

మాన—అబ్బాయీ! నీకు దెబ్బ ఎక్కడతగిలినది. అయ్యో! నీకెట్టి కష్టమువచ్చినది!

౧ ఆహ—ఇక్కడ ఇక్కడ. అమ్మా! నీవెవరు?

మాన—ఊరకుండుము. మాట్లాడకుము. (గోలితగిలినచోట కట్టుకట్టును. మఱియొకసైనికుని సంజ్ఞసేయ వాఁడు గిన్నె తెచ్చియిచ్చును. మానసి ఆహతునితో అనును) ఏమియు భయములేదు. ఇదిగో! మందు త్రాగుము. (వాఁడు మందుత్రాగును. ప్రక్కనున్న మఱియొక ఆహతునియొద్దకుఁబోయి మానసిచెప్పును.) మెదలక పండుకొనుము. నీకు పరిచర్య యేర్పాటు జరుగును. (ఒక రాజపుత్రసైనికునకు సంజ్ఞచేయ వాఁడువెళ్లును. అంతఆమె రెండవఆహతునితో ననును.) నీవు మెదలకయుండుము. నేనిప్పుడే వచ్చెదను.

౩ ఆహ—రామ రామా! ప్రాణముపోయిన బాగుగనుండును. బాధ యెక్కువగా నున్నది.

మాన—(వానియొద్దకుఁబోయి చూచి యనును) ఇంక వీనికి ప్రాణమున్నది. (ఒకసైనికునితో) వీనిని చూడుము.

హిదా—దాహము! దాహము! నీరు! నీరు!

మాన—(హిదాయతుయొద్దకుఁబోయి ఒకసైనికునినుండి జలపాత్రముదీసికొని వానికిచ్చుచు) ఇదిగో! నీరు త్రాగుము.

హిదా—(నీరుత్రాగి) అల్లా! ప్రాణమునిలిచినది.

[కొందఱు సైనికులతో అజయుఁడు వచ్చును]

అజ—ఈఅంధకారములో నీవెవరు?—మేవాడురాజకన్యయా?

మాన—ఎవరు?—అజయుఁడా?

అజ—(దగ్గరకువచ్చి) అవును మానసీ!

మాన—అజయా! నీసైనికులతో ఆహతుల పరిచర్యలో నాకు సాయపడుఁడని చెప్పుము. మామనుష్యులు తక్కువగ నున్నారు.

అజ—వారేమి పనిచేయవలయును?

మాన—ఆహతుల నెత్తుకొనిపోయి సేవాశిబిరమునఁ జేర్చవలయును.

అజ—మంచిది. సైనికులారా! మీరీపనిచేయుఁడు.

[సైనికులు డోలీ తెచ్చుటకు పోదురు]

మాన—ఏమిఆనందము అజయా!

అజ—ఏమిజ్యోతి మానసీ!

మాన—ఎక్కడ?

అజ—నీముఖమున.—ఈ వికటార్తనాదపు జన్మభూమిలో, ఈమృత్యులీలాక్షేత్రమున, ఈ భయానక శ్మశానమున, నక్షత్రదీప్తమగునీయంధకారమున ఏమిజ్యోతి! ప్రక్షుబ్ధసాగరమున ప్రభాతసూర్యుఁడువలె, కాలమేఘములలో స్థిరమగు నీలాకాశమువలె, దుఃఖముపై కరుణవలె—ఏమిమూర్తి! ఈ సౌందర్యము! ఈ గరిమ! ఈ విస్మయము! చాల అపూర్వములు.—మానసీ! (చేయిపట్టుకొనును.)

మాన—అజయా!





## అష్టమ దృశ్యము.

స్థానము—ఉదయపుర రాజమార్గము.

సమయము—ప్రభాతము.

[కొందఱు చారణులు పాడుచువచ్చెదరు. వెనుక అమరసింహుఁడు, గోవిందసింహుఁడు, అజయసింహుఁడు, సామంతప్రభువులు వచ్చెదరు.]

అమ్మాలెండు పురకాంతలార!
సమ్మదమున సమరమ్మును గెలిచి తే
జమ్మున నమరసింహుఁ డేతెంచు నిదే ॥అమ్మా॥

౧ ఇనవంశమ్మున కెగ్గుసేయుటకు
మొనసి యవనవాహిని యేతెంచెను
మనకత్తులకు న్నెత్తురు బలియిడి
మడసిరి తురుష్కులెల్లన్ ॥అమ్మా॥

౨ మనభూపాలుఁడు నేఁడు తురుష్కుల
మదమడంచె మనమాన్యత నిలిపెను
మన మేవాడుకు నేఁడు కల్గె శుభ
దిన మాద్యుఁడు పాడుఁ డికన్ ॥అమ్మా॥





# మేవాడు పతనము.

## ద్వితీయాంకము

### ప్రథమ దృశ్యము.

స్థానము - ఆగ్రాలో సగరసింహునియిల్లు

సమయము - ప్రభాతము

[సగరసింహుఁడును అతనిదౌహిత్రుఁడగు అరుణసింహుఁడును మాటాడుచుందురు.]

సగ—అరుణా! ఇది చాలవింతమాట. అమరసింహుఁడు దేవారయుద్ధములో మొగలులను గడ్డిపరకనుబలె నరికివేసెనఁట.

అరు—రాణాఅమరసింహా! నీవుధన్యుఁడవు.

సగ—బాల్యమున అమరసింహుఁడు ఆటలకోరుగను విలాసప్రియుఁడుగను ఉండెడివాఁడు. ఇంతవాఁడగునని ఎవ్వరికిఁ దెలియును!

అరు—తాతా! వాల్మీకమహర్షి మొదట దోపిడిగాడుకాదా?

సగ—వాల్మీకియెవరు? తులసీదాసునికొడుకా?

అరు—ఔరా! తాతా! నీవు వాల్మీకిపేరే వినలేదా? ఆయన ఒకగొప్ప మహర్షి.

సగ—అటులనా? అయితే ఆయనను ఎక్కడ నేనిచూచితినేమో గుర్తు లేదు.

అరు—నీవెట్లు చూడఁగలవు? ఆయన త్రేతాయుగపువాఁడు.

సగ—ఏయుగమంటివి?



అరు—త్రేతాయుగమున.

సగ—ఓహో! అయితే నేను పుట్టకముందుమాట, విన్నాను. ఆయన చాల రసికుఁడఁట.

అరు—కాదయ్యా! ఆయన రామాయణము వ్రాసినాఁడు.

సగ—రామాయణము వ్రాసెనా! అదిచాల మంచిపుస్తకము.

అరు—ఏమి తాతా! నీవు రామాయణము చదువలేదా? రాములవారు మన పూర్వపురుషుఁడు, అందు ఆయనకథయే వ్రాయఁబడినది. నీవు ఆయననుగూర్చి ఏమియు నెఱుఁగవా?

సగ—అబ్బాయి! నేనెక్కడ చదువుదును? యుద్ధములతోనే నాజన్మము గడచినది, చదువుటకు తీరికయెక్కడ?

అరు—తాతా! నీవుకూడ నెన్నఁడేని యుద్ధము చేసితివా?

సగ—అబ్బో! చాల గొప్పయుద్ధములు చేసితిని. అప్పుడింక నీవు పుట్టలేదు.

అరు—నీవెవ్వరితో యుద్ధము చేసితివి?

సగ—ఇదిబాగుగ జ్ఞాపకము లేదుగాని నేనుచాల యుద్ధములొనర్చిన మాటమాత్రము వాస్తవము. అప్పుడు మీఅమ్మ—

అరు—తాతా! మాఅమ్మ ఎక్కడనున్నది?

సగ—ఆమె ఎక్కడనున్నదో ఎవ్వరికిని తెలియదు. ఒకనాఁడు ఉదయము లేవగనే "మేవాడుమేవాడు" అని అఱచెను. నాఁటి సాయంత్రము మేము చాలవెదకితిమిగాని ఆమెజాడ తెలియలేదు.

అరు—మాతండ్రియో?

సగ—ఆయన మొదటనుండియు పిచ్చివాఁడు. ఒకమారు గజసింహమహారాజుతో గుజరాతుపైదాడి వెడలి అచ్చటనే మరణించెను.

అరు—మాఅమ్మ ఈ మేవాడుప్రాంతముననే యుండునని యనుకొనియెద.

సగ—ఉండవచ్చును.

అరు—తాతా! నీవు మేవాడువిడిచి యిచ్చటి కేలవచ్చితివి? చూచితివిగదా నీసోదరుఁడు మహారాణా ప్రతాపసింహుఁడు దేశమునకై ప్రాణమర్పించెను.

సగ—కనుకనే పాప మింతచిన్నతనముననే చనిపోయినాఁడు. నేనెంతవలదన్నను నామాటవినలేదు. ఇంక నాదోషమేమో చెప్పుము.

అరు—అయితే ఎక్కడచూచినఅక్కడ భట్టులు, చారణులు ఇప్పుడాయనకీర్తినే గానముసేయుచు తిరుగుచున్నారు.

సగ—అయిన నేమాయె? చచ్చిపోయినవాఁడు తనకీర్తి వినుటకు తిరిగి రాఁడుగదా! నాకు బాగుగ జ్ఞాపకము. ఒకమారు మేము బాలురముగా నున్నపుడు ఒక ముంగిసకును పామునకును పోరు జరిగినది. ముంగిస గెలుచునని నేనంటిని. కాని ప్రతాపుఁడు నామాట ఒప్పుకొనలేదు. ముంగిస పాముపడిగపై లక్ష్యముండి ఇటునటు ఉరకసాగెను. పాము పడిగవిప్పి బుసకొట్ట నారంభించెను. తుదకు ముంగిస పామును గట్టిగా పట్టుకొనెను. పాము తల నేలనుగొట్టుకొని అక్కడనే చచ్చిపోయెను. ముంగిసకు పామును జంపుట సహజము. ఇంక పామెంతవఱకు దానిముందు నిలువఁగలదు? కనుకనే నేను ముంగిస పక్షము గ్రహించితిని. ప్రతాపుఁడు పాముపక్షము. ఇప్పుడును నిదియే సంగతి.

అరు—అయితే దేవారయుద్ధము మాటయేమి చెప్పెదవు?

సగ—అబ్బాయీ! ఎన్నేనిచెప్పు, ఇంతకు నది రక్తబీజవంశము. ఎంతవఱకు దానిని నఱకెదవు? ముసల్మానులసంఖ్య తగనేని



మరల హిందువులను ముసల్మానులుగా చేసికొని వారు పోరాడెదరు. హిందువులు ముసల్మానులను ఆవిధముగ హిందువులఁ జేసికొనరుగదా! ఇంతే కాదు. ఒకమారు ఏవిధముగనో ముసల్మానులైన హిందువులనుగూడ మరల హిందువులుగ పరిగ్రహింపరుగదా. ఇంక హిందువులు ముసల్మానుల నేమిచేయఁగలరు. ఇచ్చటనే హిందువులు చాల పొరఁబడుచున్నారు.

అరు—ఎట్లు?

సగ—చూచితివిగదా! నీమేనమామ మహాబత్ఖాను ఎంతసులభముగ ముసల్మానయ్యెనో. వారి అబ్దుల్లా హిందువు కాఁగలఁడేమో కొంచెము విచారించుము. అతఁడెప్పటికిని హిందువు కాఁజాలఁడు.

అరు—తాతా! అయితే నీవుకూడ ముసల్మానెందుకు కాలేదు?

సగ—ఇక్కడనేమీ తాతకు తెగింపుకలుగలేదు. నా కుమారుఁడత్యంత సాహసుఁడు. వాఁడేమియు నాలోచనము సేయలేదు. అయితే అంతకుముందు నేనుచేయవలసిన పనియంతయుఁ జేసి వాని మార్గము సుగమముచేసితిని. నేనుసాహసించి మొగలుల పక్షమునఁ జేరకున్నచో మహాబత్ఖాను ముసల్మానగుటకు సాహసింపఁడు.

అరు—తాతా! నీవు తప్పక ముసల్మానుకావలసినదియే. రామాయణము చదువని హిందువు ముసల్మానే కావలయును.

సగ—అరే! రామాయణమున నేమున్నది? కల్లుసుకాణము కబురులు.

[మొగలుసేనాపతి సైయదు అబ్దుల్లా ప్రవేశించును.]

సగ—అబ్దుల్లాసాహబ్ గారు! రండి ఆదాబు!

అబ్దు—ఆదాబు రాణాజీ!

సగ—రాణా ఎవరు?

అబ్దు—మీరే రాణా.

సగ—నేనెక్కడి రాణాను.

అబ్దు—మేవాడుకు.

సగ—ఎట్లు? మేవాడుకు రాణా అమరసింహుఁడు.

అబ్దు—బాదుషాగారు ఇప్పుడు మిమ్మే రాణాచేసిరి.

సగ—దీనిఉద్దేశము?

అబ్దు—మీరిప్పుడు చిత్తూరు వెళ్లవలయునని వారిహుకుం.

సగ—చిత్తోడెందుకు?

అబ్దు—అదియే మీరాజధాని.

సగ—అయితే అమరసింహుని రాజధానియెక్కడ? ఉదయపూరులోనా?

అబ్దు—ఆయన యిపుడు రాణాకాఁడు. బాదుషాగారు ఆయనను రాజ్యభ్రష్టునిఁజేసిరి.

సగ—అతఁడు రాజ్యమెట్లువిడుచును?

అబ్దు—విడిపింపఁబడుటచే.

సగ—అయితే నేనిపుడు అతనితో యుద్ధముచేయవలయునా? వద్దు బాబా! నేను రాణా కాఁగోరుటలేదు.

అరు—ఏమి? యుద్ధముచేయుట బాగుగ తెలియుననియు, జీవితమంతయు యుద్ధములతోనే కడచెననియు నీవిప్పుడేకదా చెప్పితివి. ఇప్పుడు వెళ్లి యుద్ధముచేయుము.

సగ—అబ్బాయీ! నీవు మెదలకుము. నిన్నెవ్వరడిగినారు? (అబ్దుల్లాతో) సైయదుసాహెబ్! నేను యుద్ధము చేయఁజాలను. అందుకనియే నేను మొగలులపక్షమునఁ జేరితిని. నేను యుద్ధమే చేయఁగల్గియున్నచో నా మాతృదేశముపక్షమున పోరాడక పైఁగా ధానికివిరుద్ధముగ నేఁదుకుదాడివెడలుదును?



అబ్దు—లేదు జనాబ్! మీరు యుద్ధముచేయవలసినపనిలేదు. అట్టిఅవసరమువచ్చుచో మేమే యుద్ధముచేసెదము. దయచేసి రాణాయగుటయు, చిత్తోడులోనుండుటయునే మీరు చేయవలసినపని.

సగ—అమరసింహుఁడుచిత్తోడుమీదికి దాడివెడలినచో?

అబ్దు—లేదు. ఆయన దాడివెడలఁడు. ఇదివరకెన్నఁడును దాడివెడలనివాఁడు ఇప్పుడెందుకువెడలును?

సగ—ఔరా! సయ్యదుసాహెబ్! ఇదియు నొకయుక్తియా? మనుష్యుఁడు ఇదివఱకెన్నఁడును చావలేదని ముందెన్నఁడును చావఁడా? మీ రారోజున పెళ్లిచేసికొనిననింక మీకు పెళ్లికాలేదనియా?

అబ్దు—నాకు మీమాట యర్థముకాలేదు.

సగ—అనఁగా మీరు పూర్వమెన్నఁడును పెండ్లిచేసికొనలేదు. అందుకని మీ యాపెండ్లి పెండ్లికాదా? ఇదియు నొకప్రమాణమా? (అరుఁణునిదిక్కు యి) అబ్బాయీ! నీవేలనవ్వెదవు? (అబ్దుల్లాతో) పాము పూర్వముకఱచియుండినచో నింకనెన్నఁడును కఱవదనియా?

అబ్దు—జనాబ్! మీరు కోపించెదరేల?

సగ—వహ్వా! కోపగించనా? మీ రాడేమాటలెమి! క్షమించుఁడు. నేను రాణాకాఁగోరుటలేదు.

అబ్దు—మంచిది. అయితే మీరు బాదుషాగారివద్దకు నడువుఁడు. మీరు చెప్పఁదలచినది అక్కడనే చెప్పికొనుఁడు.

సగ—మంచిది నడువుఁడు. కాని ఇది చాలనీచమును దుష్టమునగు సంగతి. నన్ను మీరు గుప్పిటలో నుంచుకొని బలవంతముగా నన్ను రాణాచేయఁగోరుచున్నారు. తర్వాత ఏమగునో చూడుఁడు. కాని ఇది చాల అన్యాయము. కృతఘ్నత. అరుణా! పద.

## ద్వితీయదృశ్యము

స్థానము:—ఉదయపుర రాజ ప్రాసాదము.

సమయము—ప్రభాతము.

[మానసి పాడును]

### గీతము.

నీదుదర్శనమున జగము నిర్ణిద్రితవహించెన్
నీదు కరస్పర్శమునఁ బ్రిమోద మెడఁద వసియించెన్
శూన్యజగము శుభభరితము సులలితరవ మెసఁగె దెసల
మాన్యసూర్యచంద్రులు సుధంబరువడి వర్షింపుచుండిరి
వనమునవికసించెఁ బువులు ప్రవహింపుచునుండె నదులు
అనువుగ మలయానిలవు సమాగమమ్ము సుగమమయ్యె
కరమున నవకుసుమమాల గ్రాల నధర సుధనొసంగు
కరముసుందరము వసంతు ఘనకుంజము సుఖకరమ్ము॥

[అజయసింహుఁడు వచ్చును.]

మాన—ఎవరు? అజయా!

అజ—అవునుమానసీ!

మాన—ఇన్నినాళ్లవఱకు నీవు రాలేదేమి? అస్వస్థతగానుంటివా?

అజ—లేదు.

మాన—నేను వారియనగారితో నీవిషయము నడిగితిని. వారు నీతో నేమేని చెప్పిరా?

అజ—లేదుమానసీ! ఇచ్చట నొంటిగానుంటివేల?

మాన—పాడుచుంటిని. ఇంక నాలోచించుచుంటిని.

అజ—ఏమి ఆలోచించుచుంటివి?

మాన—మానవుఁడు చాలదుర్బలుఁడని యాలోచించుచుంటిని. మేవాడుయుద్ధములో నేనిదియే నేర్చుకొంటిని ఒకకత్తి వ్రే



టుతో నేలపైఁగూలును. కొంచెము జ్వరమురాఁగానే బాలకునివలె నిస్సహాయుఁడగును. ఔరా! ఎవ్వనిరక్తములో మృత్యుబీజముకలిసియున్నదో వాఁడు తోడిమానవుని ప్రేమింపక ద్వేషమేలవహించును? అజయా! నీవు ఱెప్పయార్పక నా మొగము చూచుచుంటివేమి?

అజ—నీమొగమున నేఁడును ఆనాఁడుచూచిన స్నిగ్ధజ్యోతిని చూచుచుంటిని.

మాన—ఏనాఁడు?

అజ—నాఁటిరాత్రి—దేవారయుద్ధక్షేత్రమున. నాఁడు అంధకారమున నీవు మూర్తీభవించినదయవలె గన్పట్టితివి. నాఁడే నా యున్ముఖప్రేమ అపారనిరాశానిశ్వాసమున లీనమైనది.

మాన—అజయా! ఏటినిరాశ?

అజ—ఏటినిరాశయో చెప్పుదునా? నిన్ను పరిగ్రహింపబూనుట వ్యర్థమని యెంచితిని. నీ వీ భూలోకపుసుందరివి గావనియు, మూర్తిమతియగు మహిమవనియు, స్వర్గీయదేవివనియు తెలిసికొంటిని. తీవ్రమగు నీ యాత్మజ్యోతిని ఈవిశ్వము భరింపఁజాలదు. దానినికప్పియుంచుటకే ఈశ్వరుఁడు నీ ఈ సుందరశరీరమును ఆవరణస్వరూపముగ రచించెను. ఆకాశ మొకరంగస్థలమగుచో ఒక్కొక్క నక్షత్ర మొక్కొక్క పవిత్రచరిత్రమగుచో, చంద్రిక యొకనిర్మలసంగీతమగుచో ఆ మహానాటకమునకు నీవు నాయికవగుదువు. నేను నిన్ను ప్రేమించుటకు యోగ్యుఁడనుగాను. కాని నీపై భక్తినొసర్పఁగలను. ఆ భక్తికిబదులుగా లేశమాత్రము నీకరుణను గోరుచున్నాను. నాకోరికతీర్చెదవా? (అజయుఁడు మానసిచేయి పట్టుకొనును. ఇంతలో రాణివచ్చును.

రాణి—అజయసింహా!

[మానసిచేయివిడిచి అజయుఁడు వెనుకకుఁబోవును.]

మాన—ఏమిఅమ్మా?

రాణి—అజయా! ఏకాంతమున నీవిటుల నాకన్యతో మాట్లాడఁ గూడదు.

అజ—నేను క్షమాపణగోరుచున్నాను.

మాన—క్షమాపణయెందుకు అజయా?

రాణి—నీవు రాజకన్యవని జ్ఞాపకముంచుకొనుము లోపలికిఁబొమ్ము.

[మానసి వెళ్ళును.]

రాణి—అజయా! నీవు గోవిందసింహుని పుత్రుఁడవు. నిన్ను మేము పరాయివానిగా నెంచము. కాని యిపుడు 'మానసియు పిల్ల కాదు. నీవును పిల్లవాఁడవుగాదు' అనుసంగతి నీవు మఱువఁ గూడదు. మానసితోఁ గలియునపుడు నీవీవిషయము జ్ఞప్తినుంచు కొనుము. అసలు నాయుద్దేశము నీవు దానితోఁగలియుటయే మంచిదికాదని.

అజ—చిత్తము. (నమస్కరించిపోవును.)

రాణి—బాగుగ తెలిసినది. అజయునితో మా మానసికి పెండ్లియయిన బాగుగనుండును. కాని యిది అసంభవము. (దృఢచిత్తముతో) కాని దానివిషయమై చింతయెందుకు?

(రాణా అమరసింహునిప్రవేశము)

రాణా—రాణీ!

రాణి—మహారాజా! నేను మీయొద్దకు రావలయుననుకొంటిని.

రాణా—నీవు మానసి నేమేనియంటివా?

రాణి—లేదు. ఎందుకు? ఏమయినది?



రాణా—అదియేడ్చుచున్నది.

రాణి—(విస్మయముతో) ఏడ్చుచున్నదా?

రాణా—ఔమ్మ. ఎందుకుఏడ్చుచున్నదో చూడుము.

రాణి—ఒట్టిపిచ్చిపిల్ల. ఏడ్చుటకు నేను దాని నేమంటిని? మీరు పిల్లదానిజోక్యమేమియు పుచ్చుకొనరు. అదియు నంతమాత్రము తెలివిగలదియే. అది యిప్పుడే కొంచెముసేపటికిక్రింద అజయ సింహునితో—

రాణా—జాగ్రత్త! మానసివిషయమై ఆలోచించి మాటాడుచుండుము. అదియెవ్వరో తెలియునా?

రాణి—ఎవ్వరు?

రాణా—అదియెవ్వరో మనమెఱుఁగము. ఇంతవఱకు మనము దానిని గుర్తించనేలేదు. అదియెవ్వరో ఎక్కడనుండివచ్చినదో యెవ్వరును చెప్పఁజాలరు.

రాణి—అదిగో! ఇటుఅటు కూడ నేనేచెడ్డదానను. పిల్ల ఎందుకు ఏడ్చుచున్నదో వెళ్ళిచూచెదను. ఊరక మొండిపట్టు పట్టును (వెళ్ళఁ బోవును).

రాణా—ఇదిగో! చూడు. (రాణి తిరిగివచ్చును) ఇఁకముందు మానసిని నీవేమియు ననవద్దు. ఒక స్వర్గీయకిరణము దయచే నీలోకము నకువచ్చినది. నీవేమేనియన్నచో కోపించి వెళ్ళిపోవును. (రాణి నిరాశను బ్రకటించుచు వెళ్ళిపోవును. రాణా ఒక ఉన్నతాస నమునఁ గూర్చుండి ఆకాశమువంక చూచుచుఁ జెప్పును) ఈ జీవితముకూడ ఒకస్వప్నము. ఈ ఆకాశ మెటుల నీలము, నిర్మ లము, గంభీరమునై యొప్పారుచున్నది! దానిక్రింద గొప్ప మేఘములు మెల్లగ నెగురుచున్నవి. ప్రకృతిజీవితములో సముద్ర

మునందుబలె అలలులేచుచుండును. మరల కూలుచుండును. ఈ అలల సౌందర్య మప్పుడప్పుడు భీకరాకారమును ధరించుచుండును. ఆకాశమున మేఘములు గర్జించును. పృథ్విపై జలము వర్షించి ప్రవహించును. మరల పూర్వమువలె నన్నియు శాంతములు స్థిరములు నయిపోవును.

[గోవిందసింహుఁడు వచ్చును.]

రాణా—ఎవరు? గోవిందసింహాజీ! ఈసమయమున హఠాత్తుగ వచ్చితిరేల?

గోవిం—మహారాజా! మేవాడుపై దండెత్తుటకు మరల క్రొత్తగా మొగలసేన వచ్చినది.

రాణా—వచ్చినదా? దేవారయుద్ధముతో నీయుద్ధమంతరింపదని మనము మొదటనే యనుకొంటిమి. రాజపుతానాను యావుమావు వశమును మొగలు లూరుకొనరు.

గోవిం—మహారాజా! మన పక్షమున నింక నాప్రయత్నములో నుండక పోవుట కేమి కారణము?

రాణా—ఎందుకు! ప్రయత్నమెందుకు?

గోవిం—మహారాజిప్పుడు యుద్ధము చేయరా?

రాణా—ఎందుకు? యుద్ధముచే నేమి ప్రయోజనము?

గోవిం—అయితే మొగలులు వెంటనే మేవాడును వశపఱచుకొందురు.

రాణా—వారికింత పట్టుదలయున్నచో నింక బాధ యేమున్నది?

గోవిం—నిజముగ మహారాజు యుద్ధము చేయరా?

రాణా—లేదు, ఒకమారేమైనదో అయినది.



గోవిం—మన మేప్రయత్నమును, ఏప్రతిక్రియయు చేయకయే—

రాణా—అయితే ఈమాటలన్నియు నెందుకు! ఇవన్నియు వ్యర్థమని నాయభిప్రాయము. దేవారయుద్ధములో మన సైనికులలో సగము కెక్కువగ చచ్చిరి. మొగలులతో పోరాటకు మనకు సైన్యమేది?

[సత్యవతి ప్రవేశించును.]

సత్య—మహారాజా! భూమి పెకలించుకొని సైన్యము వచ్చును. సైన్యమునకై మీరు చింతింపకుఁడు.

రాణా—ఎవరు?— చారణీ!

సత్య—అవును మహారాజా? నేను చారణిని. మొగలులు మేవాడుపైకి మరల దండెత్తివచ్చిరని వింటిని. మేవాడ తగుప్రయత్నములో లేక నిశ్చింతముగనుండుట చూచితిని. మహారాజింకను నిద్రించుచున్నాడేమో యనుకొంటిని. మహారాజునకు నిద్రాభంగము చేయుటకై యిపుడు నేను వచ్చితిని.

రాణా—చారణీ! ఇప్పుడు మేము యుద్ధము చేయఁగోరుటలేదు. ఈమారు మేము సంధిచేసికొందుము.

సత్య—ఇదియేమి మహారాజా? దేవారయుద్ధవిజయానంతరము సంధియెందుకు? ఏమిమహారాజా! ఆగౌరవశిఖరమునుండి జారి అవమానగర్తములోపడుదురా?

రాణా—చారణీ! దేవారవిజయముమాట పోనిమ్ము. దేవారలో మనకు విజయముగలిగినమాట వాస్తవము. కాని అదియెట్లు కలిగెనో యెఱుఁగుదువా? అందు మనసైనికులు సగముమంది నశించిరి. ఇందఱువీరులరక్తము పాఱించి మన మావిజయము పొందితిమి.

సత్య—మహారాజా! ఇందుకై చింతింపవలసిన పనిలేదు. వీరులరక్తమే

జాతిని ఫలాఢ్యముగఁజేయును. వీరులు మరణించు దేశమునకై చింతింపఁగూడదు. వీరరక్తము నొసగనిదేశమునకై చింతింపవలయును.

రాణా—ఇంకనొకమారు యుద్ధముచేసినను మనకేమియు ఫలితము గనుపట్టుటలేదు. ఈయుద్ధమున కెన్నటికిని అంతములేదు. ఈ గుప్పెడుసైనికులను దీసికొని విశ్వవిజయియగు డిల్లీసమ్రాట్టు సేనతో పోరాడుట పిచ్చితనము.

సత్య—మహారాజా! దీనిని పిచ్చియన్నను దీనిస్థానము అన్నివివేచనలకంటెను, అన్నిఆలోచనలకంటెను చాలఉన్నతము. ప్రపంచమంతయు నీపిచ్చితనముకాళ్ళపైఁ బడుచున్నది. స్వర్గమునుండి యొకగరిమ యే తెంచి ఈపిచ్చితనము శిరమున కిరీటము నుంచుచున్నది. మహారాజుగారు దేనిని పిచ్చితనమనుచున్నారో ఆ పిచ్చితనములేక నేటిదనుక యెవ్వఁడేని పెద్దపనిచేసెనా?

రాణా—కాని యీయుద్ధపరిణామము మృత్యువు—

సత్య— కం॥ ధీరుఁడు ప్రతాపసింహ కు
మారుఁడు యోజింపఁగలుగు ♦ మరణ ముహితమో
భీరుత నవమానంబును
నోరిచి మ్లేచ్ఛులకు లొంగి ♦ యుండుట హితమో.

మృత్యుభయమునఁజేసి రత్నమును చోరులకర్పింతుమా? రత్నముకంటెను గొప్పదియగు మన యీసర్వస్వమును, పూర్వసంచితమును, అనేక శతాబ్దుల స్మారకచిహ్నమును ప్రాణభయముచే యుద్ధముచేయకయే అప్పగింతుమా? వారు తీసికొనఁగోరినచో చచ్చి తీసికొందురుగాక! చావునకై ఇంత చింతయేల? అది యెల్లరకును ఒకనాఁడు తప్పక కలుగును. మహారాజా!

తే॥ గీ॥ పరబలంబులు కడు సమీ ♦ పమునఁ గవిసి
వచ్చుచున్నవి మీరు స్వప్నములు గనఁగ



సమయమిదికాదు లెండిఁక ♦ సమరమునకు
నిజబలముగూర్చి వేగ స ♦ న్నిద్ధు లగుఁడు॥

రాణా—చారణీ! నీవెవ్వరు! నీవాక్యములందు గర్జనము, నీనేత్రములందు విద్యుత్తు, నీఅంగభంగియందు తుపానును గలవు. సూర్యునివంటి ప్రకాశమును, జలప్రపాతమువంటి బలమును, వజ్రమువంటి భీషణతయు గల నీవెవరు? నీవు వట్టి చారణివి గావు.

సత్య—మహారాజా! మీరడుగుచున్నారుగాన చెప్పెద. ఇంక నన్ను దాచియుంచుట ఎక్కువ అవసరములేదు. నేను రాణాప్రతాపసింహుని సోదరుఁడు సగరసింహుని పుత్రిని, సత్యవతిని.

రాణా—ఆఁ! నీవు రాణాసగరసింహుని పుత్రివా?

సత్య—మహారాజా! ఈవిషయము తెలుపునపుడు నాశిరము లజ్జచే వంచుకొనిపోవును. అయినను వీలగునంతవఱకు ఈమె తన తండ్రిపాపములకు ప్రాయశ్చిత్తము చేయుచునేయున్నది. నా తండ్రి తనయన్నకొడుకును రాజ్యభ్రష్టునిఁజేయుటకై చిత్తూరుదుర్గమున రాణాగాఁగల్పింపఁబడి కూర్చున్నాఁడు. ఇంక నాయనకూతురగు నేను మేవాడుప్రజలను ఆయనపైకి ఎగఁగొల్పుచున్నాను. సగరసింహుఁడు మేవాడ కేమియుఁగాడనియు, అతఁడు మొగలులబానిసయనియు నేను జనులకుద్బోధించుచున్నాను. మహారాజా! మీరెఱిఁగియేయుందురు. నేటిదనుక మేవాడవాసులెవ్వరును నాతండ్రికి పన్నునీయలేదు.

రాణా—అవునుసోదరీ! తెలియును.

సత్య—మహారాజా! మేవాడకై నేను నాసుఖమును, భోగవిలాసములను, తండ్రిని, పుత్రునివిడచి చారిణినై పర్వతారణ్యభూములందు దానిమహిమనుపాడుచు తిరుగుచున్నాను. నీవు నాప్రి

యమగు మేవాడును తుచ్ఛము ననావశ్యకమునగు వస్తువును బలె నాశము కానిచ్చెదవా? (సత్యవతికన్నుల వెంటనీరువచ్చును. కంఠావరోధముగలుగును. కన్నులుతుడుచుకొనును.)

రాణా—శాంతించుమమ్మా! నీవు రాజకన్యవు. మాసోదరివి. నీవలె నీసోదరుఁడగు రాణాయును దేశమునకై ప్రాణమర్పింపఁ గలఁడు. గోవిందసింహాజీ! యుద్ధసన్నిద్ధుఁడవగుము. సైన్యముల నాయత్తపఱచుము.

—०ॐ०—

తృతీయదృశ్యము

స్థానము—మేవాడ అబ్దుల్లాడేరా

సమయము—రాత్రి.

[అబ్దుల్లా. హిందాయత్ఖాను మాట్లాడుచుందురు.]

అబ్దు—ఈదేశములో కొండలు చాలకలవు.

హిందా—అవును జనాబ్!

అబ్దు—మీరు ఓడిపోయినప్పుడు రాజపుత్రులెటునుండి ముట్టడించిరి?

హిందా—నే నెప్పుడును ఓడిపోలేదే.

అబ్దు—మీరు ఓడిపోలేనా? శత్రువులు మిమ్ము కైదుచేసితీసికొని పోఁగా మీరు ఓడలేదందురేమి? ఓడుటయన నింక నేమి?

హిందా—వారునన్ను కైదేమిచేసెదరు? నేనే తమాషాకు పట్టుపడితిని.

అబ్దు—తమాషాగా పట్టుపడుట కేమియర్థము?

హుసేన్—అవును జనాబ్! ఈయన తమాషాకే పట్టుపడెను. రాజపుత్రులు నెత్తిపైకివచ్చినపుడు మాసిఫాయీలు బాగుగ ఆలోచించి ఒరలనుండి కత్తులందసిరి. పక్కలపై కత్తులొరకపక్కను



ఒరలొకపక్కను బెట్టి తీరికగా మీసాలు మెలివెట్టుకొనుచు కూర్చుండిరి. ఇంతలో వంట తయ్యారయ్యెను. భోజనము సేయక ఎచ్చటకును కదలలేకైరి. కాన సుష్ఠుగాభోజనముచేసి గడ్డాలు మీసాలు చక్కగా దువ్వుకొనసాగిరి. ఇంతలోనే రాజపుత్రసైన్యములు మాద్వారమువద్దకు వచ్చినట్టు తెలిసెను. మా సిఫాయీలు యుద్ధమునకు బయలుదేరిరి. మొదటనే కత్తులు, ఒరలు విడిగా పెట్టియుండుటచే తొందరలో కత్తులు మఱచి ఒరలు పుచ్చుకొని వెళ్ళిరి.

అబ్దు—ఈపొరపాటు అందఱును జేసిరా?

హిందా—అవును జనాబ్! ఇది దైవవిధానము. ఎవ్వరును ఏమియు చేయఁజాలరు.

అబ్దు—ఒక పనిచేసిన బాగుగ నుండెడిది.

హిందా—ఏమది?

అబ్దు—భోజనముచేసిన తర్వాత కత్తి ఒకవైపును ఒర ఒకవైపును ఉంచి ఒక నిద్రతీయవలసినది.

హిందా—అయితే గోలశత్రువులు వచ్చి నెత్తిపై కూర్చున్నారుగదా!

అబ్దు—నిజమే. మీకు నిద్రించుటకు సమయమే లేదు. అయితే మీ రేమిచేసినారు?

హిందా—ఇంక చేయునదియేమి?

అబ్దు—బహుశః "చంపవద్దు, కైదుచేయుఁడు" అని అఱచితిరి కాఁబోలు.

హిందా—ఇది అనలేదు కాని ఇటువంటి మాటయే యేదో . అంటిని. బాగుగ జ్ఞాపకములేదు.

అబ్దు—పోనిండు. ఏదియో అంటిరి. ఇప్పు డది మఱచుటచే ఉర్దూ

సాహిత్యమునకు గొప్పలోపము వాటిల్లు వింతమాటయేమియు ననియుండరు. ఇంతకు నటుతర్వాత మీారెంతట మీారే పట్టుపడితిరి.

హిదా—అవును జనాబ్! మీారు బాగుగ తెలిసికొంటిరి. అయితే నేను పట్టువడుటకుముందు పొరపాటున నాపై తుపాకి పేల్చెను.

అబ్దు—అటుపిమ్మట రాణాకూతురు మీా పరిచర్యకు వచ్చినదనివింటిని.

హిదా—అవును. ఆమెయు నొకవీరుని కన్యయగుటచే వీరుని గౌరవించు సంగతి బాగుగ నెఱుఁగును. అందులో నా యీ ముఖము— (హుసేనుకు సంజ్ఞచేయును)

హుసేన్—నిజముగ మీా ముఖము దర్శనీయము.

అబ్దు—కనుకనే ఆమె—

హిదా—జనాబ్! మీాకొక విన్నపము చేసెదను.

అబ్దు—ఆమె చాలసుందరియా?

హిదా—అబ్బా! ఆవిషయ మడగకుఁడు.

అబ్దు—ఆమె మీా తోనేమియన్నది?

హిదా—జనాబ్! ఆమెకు నాతో మాటాడుటకు సాహసము కలుగలేదు. ఒకమారు "ప్రాణేశ్వర"లో కాబోలు 'ప్రా' స్పష్టముగ నుచ్చరించినది 'ణే' కూడ కొంతవఱకు వచ్చినట్లేయున్నది. నేను "కాఁబోలు" చెప్పుటకు కారణ మేమన నాకు అనృత మాడు అభ్యాసములేదు. తర్వాత నే నామెవంక ఒకవిధముగ జూచితిని. ఆమెయు ఇతనిపై నా టక్కులు సాగవని గ్రహించినది. తర్వాత మాట్లాడుట కామె సాహసింపలేదు.

అబ్దు—తర్వాత నేమయ్యెను?

హుసేన్—తర్వాత రాణా భయముచే సేనాపతిని వదలివేసిరి.



హిదా—లేకున్న నేనును తమాషా చూపించువాఁడనే.—

అబ్దు—హిదాయత్ అలీసాహెబ్! నిజముగ మీారు చాల గొప్ప వీరులు.

హిదా—లేదు జనాబ్! నేనంత గొప్పవీరుఁడనుగాను. అయితే నేను యుద్ధవిద్యను చాలద్రవ్యము వెచ్చించి నేర్చుకొంటిని.

అబ్దు—ఓహో! రాత్రిపూట ఈ పర్వతము లెంతనల్లగాఁ గనుపించు చున్నవి. ఈ దేశమందంతటను కొండలు ఎక్కువగా నున్నట్లున్నది.

హిదా—కొండలేకాదు. రెండుమూడు నదులుకూడ నున్నవి.

అబ్దు—రేపుప్రొద్దున బాగుగ చూచెదము.

[కొంచెము దూరమున తుపాకి మ్రోఁత వినఁబడును.]

అబ్దు—(భయపడి) ఇదియేమి!

హిదా—హుసేన్!—

హుసేన్—జనాబ్! ఈమారు రాజపుత్రులు మనముట్టడి చూడక వారే మనపైకి దండెత్తివచ్చినట్లులున్నారు.

అబ్దు—హుసేన్! సైన్యమును సిద్ధము కమ్మని చెప్పుము.



చతుర్థదృశ్యము.

స్థానము - చిగురుకోట

సమయము - రాత్రి.

[అరుణసింహుఁ డొకమంచముపై నిద్రించుచుండును. రెండవమంచము ఖాళీగానుండును. సగరసింహుఁడు పచారుచేయుచుండును.]

సగ—మొగలులు నన్నొకవిధముగ నీచితొరుదుర్గమున ఖైదుచేసియుంచినారు. ఈపురాతనశిలలును, ఈమాంధాతకాలమునాటి

వృక్షములును నాకు పెనుభూతములుగఁ గనుపించుచున్నవి. రాత్రి గాలివీచునపుడు భయముగా నుండును. ఝుంఝామారుతము వీచునపుడు దయ్యమనుభావము తప్పక కలుగును. చీకటి పడునపుడు నల్లగ తారుపూసినట్లు నుండును చుక్కలు కనుబడనే కనుబడవు. ఏమైనఁగానిమ్ము. ఇక్కడ వచ్చినందుకు పెద్ద యుపకారము ఒకమారు రామాయణపాఠము జరిగినది. చాల మంచిపుస్తకము. రెండవలాభము చారణులవలన మాపూర్వ పురుషుల గాథలువినుట. వారలు గొప్పవీరులగుటలో నేమియు సందియములేదు. నేఁడు నాకింత భయముగానుండుట కేమి హేతువో తెలియుటలేదు. అసలే ఇది నిర్జనదుర్గము. అందులో నీపెనుగాలి. ఇంక భయమెందుకుండదు? పహరేదార్! పహరేదార్!

[పహరేదారు వచ్చును.]

సగ—ఇదిగో చాలజాగ్రత్తగా నుండుముసుమా! ఎవ్వరిని రానియ్యకుము. బాబో! ఇదియేమి?

పహ—ఎక్కడమహారాజా!

సగ—ఇదిగో!ఎదుట! బాబో!

పహ—ఏమిలేదు. గాలి.

సగ—మీదేశములో గాలి బాగుగనుండునట్లున్నది.

పహ—అవును మహారాజా!

సగ—మహారాజునని బాగ [illegible]యున్నది నిద్రలేక చావుగా చావుగానున్నది ఏమోయి. మీదేశమున చీకటికూడ ఎక్కువగ నుండునా?

పహ—చిత్తము, మహారాజా!



సగ—ఇంత చీకటిలేకున్న వచ్చిననష్టమేమి? నీవు మేలుకొనియుండుము. బయట కొంచెము దీపముపెట్టుము. చీకటి కొంచెము తగ్గును. ఇంతచీకటిలో నాకు నిద్రపట్టదు. కత్తి చేతఁబట్టుకొని నలుప్రక్కలు తిరుగుచుండుము. ఎవ్వరేనివచ్చిన ఒకవ్రేటు వేయుము. పొరపాటున నామెడమీద శస్త్రము వేయకుము. పొమ్ము. (పహరేదారు వెళ్ళును.) అరుణుఁడుండి నిద్రించుచున్నాఁడు. వీనిది ఏమినిద్ర! కొంచెముకదలుచు ఊఁ ఆఁ అనుచున్నను మేల్కొన్నాఁడుగదా యనుకొందును. నాకు నేఁడు నిద్రపట్టుటలేదు. మాపూర్వులీదుర్గమందే యుండెడివారు. దీనినిఁబట్టిచూడ వారు చాలసాహసులుగాఁ గనిపించుచున్నారు. పహరేదార్!

[పహరేదారు వచ్చును.]

సగ—మెలకువగ నుంటివిగద. నిద్రపోకుము సుమా. మేలుకొనుటకు గుర్తుగా మధ్యమధ్య కొంచెము పలుకరించుచుండుము. పొమ్ము. (పహరేదారు వెళ్లును.)

అరుణా! అరుణా!

అరు—ఆఁ తాతా!

సగ—మంచిది. నిద్రపో. నేఁడు చాలజాగ్రత్తగా నిద్రించుము. నాకు భయము వేయుచున్నది.

అరు—భయమెందుకు? నీవు నిద్రపొమ్ము. (ప్రక్కకు ఒత్తిగిలును.)

సగ—ఓరీ! ఓరీ! భయమెందుకని నిద్రపోతివి. అరే ఇదియేమి? పహరేదార్! పహరేదార్! అరే నిద్రపోతివా? అరే పహరేదార్! అరుణ! అరుణ!

అరు—ఏమి తాతా! ఈవేళ నన్ను నిద్రపోనిచ్చునట్లు లేవు.

సగ—వింటున్నావా. ఎవరో మాట్లాడుచున్నారు.

అరు—ఎవరు లేరు. ఓరుగాలి (ప్రక్కకు ఒత్తిగిలును.)

సగ—అరే ఎక్కడ ఓరుగాలి! ఓరుగాలి ఎక్కడనేని మాట్లాడునా? అదిగో! మాట్లాడుచున్నాడు. బాబో!

అరు—ఏమి తాతా?

సగ—భూతము!

అరు—ఎక్కడభూతము.

సగ—అదిగో! చూడు (వ్రేలుతో చూపించును)

అరు—ఎక్కడ. నాకెక్కడ నేమియుఁ గనుపట్టుటలేదు. నీవు మేలుకొనియే కలగనుచున్నట్టు లున్నావు.

సగ—(దూరమున లక్ష్యముంచి) నేనసలు రావలయుననుకొననేలేదు. ఆయన నన్ను బలవంతముగా పంపినాఁడు. బాబూ! ఈ రాణాతనము నాకక్కఱలేదు. రాణా అమరసింహుఁడే, నాప్రాణము తీయకుఁడు. నన్నువిడువుఁడు.

అరు—తాతా!

సగ—సరే! ఈయన ఎవరు? చిత్తూరురాణా, భీమసింహా! జయమల్ ప్రతాప్! లేదుబాబూ! రేపే నేనిచ్చటనుండి వెళ్ళిపోవుదును? నావంక నింతకోపముతో చూడకుఁడు. ఇతఁడెవఁడు? వీరెవరు? చంపకుఁడు. చంపకుఁడు. (సగరసింహుఁడు అది నేలపైఁబడును. అరుణుఁడు పట్టుకొనును. పహరేదారుకూడ వచ్చును.)

అరు—పహరేదార్! నీళ్ళుతెమ్ము. తాతకు స్పృహలేదు.

---



పంచమదృశ్యము.

స్థానము—ఉదయపురము-రాజాంతఃపురము.

సమయము—మధ్యాహ్నము.

[మానసియు కల్యాణియు మాట్లాడుచుందురు]

మాన—కల్యాణీ! నే నిచట కుష్ఠాశ్రమ మొకటి స్థాపించితిని. కుష్ఠురోగులు పెక్కుమందివచ్చి నివసించుచున్నారు. పాప మెంతకష్టపడుచున్నారు.

కల్యా—మీజీవితము ధన్యము.

మాన—కల్యాణీ! నీవు నన్ను ప్రశంసింపకుము. నాకార్యము నామోదించుము. నాకు ఉత్సాహమొసంగుము. నా హృదయమునకు బలమీయుము.

కల్యా—మీ యీ పనికి నెవ్వరు నాటంకము కలిగింపలేదా?

మాన—నాయనగారేమియు ననరు. అయితే ఇతరులు రాజకుమారి కిట్టి పనులు శోభాకరము గా వందురు. రాజకుమారి సుఖపడఁ గూడదని వారితలంపు కాఁబోలు.

కల్యా—ఇందులో అంత గొప్ప సుఖముండునా?

మాన—కల్యాణీ! సుఖము తప్పక కలుగును. ఇతరులను సుఖపెట్టుటయే నిజమగు సుఖము. తన్నుతాను సుఖపెట్ట యత్నించుట వ్యర్థము. క్రూరజంతువులువలె నట్టి యత్నము తన సంతానమునే భక్షించును.

కల్యా—అన్నయ్యకూడ నిట్లేచెప్పుచుండెడి వాఁడు. అతఁడు మీ శిష్యుఁడుకదా? అతఁడు తర్చు మీపేరు స్మరించుచుండును..

మాన—నిజముగ నా పేరు స్మరించునా?

కల్యా——అంతియేకాదు. మిమ్మును పూజించుచుండుమనియే చెప్పవచ్చును. అతఁడే "నీవు అప్పుడప్పుడు నాయాత్మను హరిద్వారమునకుఁ గొంపోయి తీర్థస్నానము చేయించి గొనితెమ్ము" అనెను.

మాన——తానెందు కిచటకు రాడు? అతనితో రమ్మని చెప్పుము. అతనిని చూడవలయునని నాకు చాల కోరికగా నున్నది.

[ఒకదాసి ప్రవేశించును]

దాసి——రాజకుమారీ! ఒకపటములమ్మునది వచ్చినది.

మాన——అది పటములమ్మునా?

దాసి——చిత్తము.

మాన——మంచిది. దాని నిటకుఁ దోతెమ్ము.

[దాసి వెళ్ళును]

మాన——మీయన్నయ్య ఎప్పుడు నేమిచేయుచుండును?

కల్యా——నేనతనిని ఇంటియందరుదుగాఁ గాంచుచుందును. ఇంటికి వచ్చినప్పుడడిగినయెడల,

గీ॥ చనితి నల్ల రోగికిఁ బరిచర్య సేయ
వెడలియుంటిని నొక్క నిర్విణ్ణుఁడైన
దీనునకు ధైర్యముం జెప్ప నేనటంచు
నిట్టిపనులనె యెపుడు వచింపు నతఁడు.

[పటములమ్మునది వచ్చును]

మాన——నీవు పటములమ్ముచుంటివా?

పట——చిత్తము.

మాన——నీవద్ద నేయేపటము లున్నవి?

(పటములమ్మునది మాటవిప్పుచుండగనే మానసి యడుగును)

మాన——మీ దేయూరు?



పట——ఆగ్రా.

మాన——ఇంతదూరము నీవు బొమ్మలమ్ముటకే వచ్చితివా?

పట——అవును. మే మీపనికై పట్టణములన్నియు తిరుగుచుందుము.

మాన——ఈపటమెవరిది?

పట——అక్బరుబాదుషాది.

కల్యా——అక్బరుబాదుషాదా? తెమ్ము చూతము. (చేతఁ బుచ్చుకొని) ఔరా! ఏమి యాతీవ్రదృష్టి!

మాన——అయితే ఇందుకొంచెము ప్రేమయు దయయుఁగూడఁగలవు, ఇది యెవరిపటము?

పట——మానసింహ మహారాజుది.

కల్యా——ఈయన మొగమున ఇంచుక విచారము, నిరాశయుఁ గనుపట్టుచున్నవి.

మాన——అవును. కొంచెము విచారముగఁ గనుపట్టుచున్నాడు. అయితే చూచితివా అందు ఆత్మగౌరవము కూడ కలసియున్నది. ఇది యెవరిది?

పట——జహంగీరు బాదుషాది.

కల్యా——ఏమీ మొగమున ఆ దాంభికత్వము!

మాన——దానితోపాటు దృఢప్రతిజ్ఞయుఁ గలదు. ఇది యెవరిపటము?

పట——మొగలసేనానాయకుఁడగు ఖానఖానా హిదాయత్ అలీఖానుది. మొగమెంతచక్కనిదో చూడుఁడు.

[మానసి ఇంచుక నతనిమొగముచూచి పక్కున నవ్వును.]

కల్యా—నవ్వితి రేల?

మాన—ఎంత మూర్ఖుఁడుగా నున్నాఁడో చూడుము. ఆమొగముతీరు, ఆభావభంగిచూడు, దుర్వినవంపు వెండ్రుకలు, ఆముపారివలె ఆపాపడి చూడుము. ఎంతమూర్ఖుఁడు, అహంకారివలెఁ గనుపట్టుచున్నాఁడో చూడుము. ఈయన యెవరు?

పట—మహాబత్ఖాను.

మాన—సేనాపతి మహాబత్ఖానా? చూచెద. (కొంచెము సేపు చూచి) ముఖము వీరరసము కురియుచున్నది. ఏమి ఆఉన్నత లలాటము! ఆతీవ్రదృష్టి! ఈవిధముగ తేజము, దృఢప్రతిజ్ఞ, ఔదార్యము, ఆత్మాభిమానము అన్నియు నొక్కచోఁ గనుపట్టవు. ఏమి కల్యాణీ! రెప్పయార్పక చూచుచుంటివి?

కల్యా—ఏమి లేదు. (తలవంచుకొనును.)

మాన—ఈ బొమ్మలెవరివి?

పట—బాదుషాగారి ఉమ్రావులది.

మాన—మంచిది నేనీ అక్బరు, జహంగీరు, మానసింహుఁడు, మహాబత్ఖానుల పటములు తీసికొందును. వీని ధర యేమి?

పట—తమరు ఇచ్చినంతే.

మాన—(నాలుగు మొహరీలు ఇచ్చి) ఇవిగో!

పట—ఈ మొహరీలపైది రాణా అమరసింహుని మూర్తియే కాదు?

మాన—అవును.

పట—ఇచ్చట మీచిత్రపటమేమియుఁ గనుపట్టుట లేదు.

మాన—లేదు. నాకు చిత్రపటము లేదు.

పట—మీరు సెలవిచ్చినచో మీ పటము తయ్యారు చేసెదను,



మాన—నా పటమా? ఎందుకు?

పట—ఇట్టి కరుణాపూర్ణమగు ముఖము నెచ్చటను గాంచలేదు. అంత చక్కగా వ్రాయుట చేతకాకున్నను మీ పటము వ్రాసెదను.

మాన—వద్దు. అవుసరము లేదు.

పట—ఇందు బాధ యేమున్నది?

మాన—బాధ ఉన్నది లెమ్ము. నీవు పొమ్ము.

పట—మంచిది నేను పోదును.

మాన—పొమ్ము.

[పటములనమ్మునది పోవును.]

మాన—కల్యాణీ! ఇంత ధ్యానముతో నెవ్వరి మొగము చూచుచుంటివి?

కల్యా—ఎవ్వరిదియు లేదు. (పటములు కలిపివేయును.)

మాన—దీనివలన నగునదేమి? నే నాపటము తీసెదను. (పటము కల్యాణి కిచ్చి) ఇదియేనా? తీసికొనుము. కల్యాణీ! నీకింత సిగ్గేందుకు? ఈయనయే కదా నీభర్త?

కల్యా—(తలవంచుకొని) అయితే మతాంతరుఁడు కదా?

మాన—అదియొక కథ? మతమా? మనుష్యులెల్లరు నొక యీశ్వరుని సంతతివారగుటలనే మతములన్నియు నొకమూలమునుండి పుట్టినవే. అయినను వారిలో పరస్పరము సంత భ్రాతృద్వేషమేలొకో తెలియదు. ప్రపంచములో మతమును పేర జరిగినంత రక్తపాతము మరిదేనివలనను జరుగలేదు.

కల్యా—వారిని ప్రేమించుట పాపము కాదా?

మాన—ప్రేమించుట పాపమా? మానవుఁ డేజాతిమతస్తుఁడైన వాని ప్రేమించుట యెంతపుణ్యము. మానవుఁ [illegible]

అంత దయాపాత్రుఁడు. ఈ బ్రహ్మాండమంతటను ఆ యనాది సౌందర్యకిరణ మొక్కటియే వెలుఁగుచున్నది. ఆ కిరణరేఖ యేమాత్రమేని ప్రసరింపని హృదయమెందును లేదు. అందును,

గీ॥ అరయ నలమహాబ్బత్తాను ♦ నాస్తికుండు
కాడు; మ్లేచ్ఛమాత్రుఁడగుఁ ♦ గాక యతఁడు
బ్రహ్మమనకయు యీశు "న ♦ ల్లా" యటన్న
భావభేదమ్మె చేతనే ♦ పాపియగునె?

కల్యా—నేటినుండి మీరు నాకు గురువులు.

మాన—ప్రేమరాజ్యమున సురూప కురూపభేదమును మంచి చెడ్డల వివక్షయు నుండదు. అందుజాతిభేదముండదు. ప్రేమారాజ్యము భౌతికముగాదు. ప్రాభాతిక నిర్మలాకాశమున దాని నివాసము. ప్రేమ ఎట్టి బంధనమును ఆతంకమును లెక్క చేయదు. అది స్వచ్ఛమును స్వయంవికసితము నగు నొక సౌందర్యము. మృత్యువు జయించు ఆత్మవలె ప్రళయకాలమున మహాకాలుని వలె అసంగీతము అనశ్వరము. కల్యాణీ! ఏమి చూచుచుంటివి?

[ఇంతదనుక మౌనము, ఆశ్చర్యము గలిగి మానసివంకఁ జూచు కల్యాణి హఠాత్తుగ మానసిప్రశ్న విని స్వప్నమునుండి మేలుకొని నట్లగును]

కల్యా—రాజకుమారీ! మీ హృదయము కూడనొక సంగీతము—(కొంచెమాగి) దయచేసి నాకు సెలవిండు. రేపు మరల వచ్చెదను.

మాన—మంచిది. పొమ్ము కల్యాణీ! రేపు తప్పక రమ్ము. అజయునితో గూడ రమ్మనిచెప్పుము.

[కల్యాణిపోవును. మానసిపాడును.]

గీతము

ప్రేమమహిమ మత్యద్భుతము
ప్రేమకులొంగనివెవరు జగంబున
ప్రేమసర్వసమ్మతము॥



ప్రేమగ్రహించిన చేటువాటిలదు
ప్రేమయొసంగినఁ దరుఁగదిఁక ॥
ప్రేమనె రవి శశు లుదయింతురు మఱి
వికసించును పుష్పమ్ముల్
ప్రేమనె నిరతము గాలివీచుటలు
విహగమ్ములు ప్రేమనె పాడున్॥
ఆకస మంబుధి సంబుధియాకస
మంటును ప్రేమవశమునన్
నాకముభువిదిగు భూమియు నెక్కును
నాకము ప్రేమబలమునన్॥
ప్రేమను శిలయును దాద్రవియించును
ప్రేమ కసాధ్యము లేదు భువిన్
ప్రేమకిరణమెల్లెడ వ్యాపించెను
ప్రేమమె విష్టపసారమగున్ ॥

[రాణి ప్రవేశించును.]

రాణి—మానసీ!

మాన—ఎందుకమ్మా?

రాణి—మీనాయనగారు నిన్ను పిలుచుచున్నారు.

మాన—ఎందుకు? ఏమిపని?

రాణి—నీవివాహముహూర్తము నిశ్చయింపవలసి యున్నది. కాన నిన్నేదియో అడుగఁ గోరిరి. నామాట వారు విననే లేదు.

మాన—నావివాహమా?

రాణి—అవును. యోధపురరాజ కుమారుఁడగు యశోవంతసింహు నకు నిన్నిచ్చుట ధ్రువపడినది. ముహూర్తనిర్ణయమునకై యోధపురమహారాజువద్దకు మనుష్యునిఁ బంపుచున్నారు.

[మానసి ఏడ్చును.]

రాణి—ఎందుకు? ఏడ్చెద వెందుకు?

మాన—లేదు, ఏడ్పుటలేదు. నేను పెండ్లిచేసికొనను.

రాణి—పెండ్లిచేసికొనవా? ఇదియేమి?

మాన—నేను నాజీవితమును వివాహబంధనమున కట్టి యుంచను. నా ప్రేమ పరిధి అంతకంటె పెద్దది.

రాణి—ఇదియెచ్చటనేని కలదా అమ్మాయీ? కన్యగానుండి ఎచ్చటనేని జీవితము గడుపఁ జాలుదురా?

మాన—ఏ దుకుఁగడపఁజాలరు? బాలవిధవలు బ్రహ్మచర్యమును పాలించుచుండ నిఁక బాలకన్యలు పాలింపఁజాలరా? నేను బ్రహ్మచారిణిగ నుందును. నాయనగారితో చెప్పివచ్చెదను. (వెళ్ళును)

రాణి—ఇదియేమి? పిల్లకేమియు పిచ్చియెక్కలేదుగదా! పిచ్చిగాకున్న మఱియేమి? వారేమియు కలుగఁజేసికొనరు. మొదటనుండియు నే భయపడుచునే యుంటిని. అదిగో! వారు వచ్చుచున్నారు. నేడు అనవలసిన నాలుగుమాటలు అనితీరుదును.

[రాణాప్రవేశించును]

రాణా—మానసి యెక్కడనున్నది?

రాణి—అది మీవద్దకురాలేదా? దానికి పిచ్చియెక్కినట్లుగా నున్నది.

రాణా—పిచ్చియెక్కినదా?

రాణి—పిచ్చికాకున్న మఱియేమి? పెండ్లిచేసికొనననియు బ్రహ్మచారిణిగ నుందుననియు ననుచున్నది.

రాణా—మంచిది తెలిసినది.

రాణి—పిల్లనుకొంచెము అదుపుఆజ్ఞలలో నుంచవలసినదని నేను మొదట నుండియు చెప్పుచువచ్చితిని. మీరు పెడచెవిని పెట్టినందుకు ఫలితమిది.



రాణా—నీకేమియు తెలియుచున్నటుల లేదు.

రాణి—నాకు బాగుగ తెలియును. దానికి పిచ్చియెత్తినది.

రాణా—ఇట్టి పిచ్చి నీకున్నచో నిన్ను బంగారుసింహాసనమునఁ గూర్చుండబెట్టి పూజించువాఁడను.

రాణి—అదిగో! తండ్రికూతుళ్ళది ఒక తేదశ.

రాణా—రాణీ! నేనును దానిని బాగుగ గుర్తించితిననుట కాదు. కాని అది ఒక స్వర్గీయపదార్థమని యెఱుఁగుదును.

రాణి—అయితే అది—

రాణా—వద్దు. దానివిషయమై నీవేమియు చెప్పవద్దు. నీవు మెదలక చూచుచుండుము. (నిష్క్రమించును.)

రాణి—తెలిసినది. మానసికి పిచ్చితనము పితార్జితపు సొత్తు. ఇంక నాథవిమ్మత్తు మంచిదిగా కనుపట్టుట లేదు. (నిష్క్రమించును.)

---

షష్ఠదృశ్యము.

స్థానము—గోవింద సింహుని యిల్లు.

సమయము—మధ్యాహ్నము.

[గోడకొక పటము కొట్టియుండును. సమీపమున పుష్పములు చేతఁబుచ్చుకొని కల్యాణి యాపటమువంక చూచుచుండును.]

కల్యా—ప్రియా! ప్రాణవల్లభా! మదీయయౌవన నికుంజపికమా! మదీయ సుషుప్తి సుఖజాగరణమా! మదీయజాగృతి సుషుప్తి స్వప్నమా! నీవు నాజగత్తునకు క్రొత్తరంగద్దితివి. నానామాన్య జీవితమును రహస్యమయము జేసితివి. నీవు నా హృదయాంధకార గహ్వరమునఁ జొచ్చిన ప్రభాతసూర్యుఁడవు. నీవు నాహృదయ సింహాసన మధిష్ఠించిన నాహృదయాధిపతివి. నీవు నాజీవిత

నిరాశకు తలయెత్తుట నేర్పిన ఆశవు. నీవు సర్వదా మధురుఁడవు. సర్వదా నవీనుఁడవు. నీవు నాస్వామివి, నాదేవతవు, నాయావజ్జీవిత తపస్సవు (తనచేతిలోని పూలు పటముపైఁ జల్లును. ఇంతలో గోవిందసింహుఁడువచ్చి ఆపూజను చూచును.)

గోవిం—(గంభీరముగ) కల్యాణీ!

కల్యా—(వెనుకకుతిరిగి) నాయనగారూ!

గోవిం—ఈపట మెవరిది?

కల్యా—(తలవంచుకొని) నాభర్తది.

గోవిం—నీభర్తయెవరు? మహాబత్ఖానా?

కల్యా—అవును.

గోవిం—ఈపట మిచట కెట్లువచ్చినది?

కల్యా—పూజించుటకై నేను తెచ్చి దీని నిచట నుంచితిని.

గోవిం—పూజించుటకా?

కల్యా—అవును. నాయనగారూ! పూజించుటకు. మీరు కోపించకుఁడు. ఇది యేమేని యపరాధమా? (గోవిందసింహునికాళ్లపై బడును)

గోవిం—మహాబత్ఖాను నీకెవఁడు?

కల్యా—(లేచి) ఆయన నాకుభర్త.

గోవిం—కాని నీకుభర్తలేఁడని పలుమారులు చెప్పియుంటిని.

కల్యా—మొదట నే నట్లేయనుకొంటిని. కాని యిప్పుడు నాకు భర్త కలఁడని తెలిసికొంటిని.

గోవిం—భర్తయా! మతాంతరుఁడగు మహాబత్ఖాను నీకుభర్తయా?

కల్యా—నాయనగారూ! మతము, ఆచారము నేనేమియు నెఱుఁగను. ఈయనతో నావివాహము జరిగినదనియే నేనెఱుఁగుదును. ఆ వివాహబంధనముచే దైవసాక్షిగ మేము నాఁ డేకమైతిమి. ఇప్పు డాబంధనము నెవఁడు తెంపఁగలఁడు?



గోవిం—మహాబత్ఖాను మహమ్మదీయుఁడై స్వయముగ నాబంధనము తెంపుకొనలేదా?

కల్యా—లేదు. ఆయన మహమ్మదీయుఁడయ్యును నన్ను పరిగ్రహింపఁగోరెను.

గోవిం—నిన్ను పరిగ్రహింపఁగోరెనా? మ్లేచ్ఛుఁడైనపిమ్మట గోవిందసింహునికన్యను గ్రహించుటయు మానుటయు మహాబత్ఖానుని యిష్టమా? కల్యాణీ! ఏనాఁడు మహాబత్ఖాను హిందూధర్మమునువిడిచి ముసల్మానయ్యెనో నాఁడే అతఁడు నిన్ను పరిత్యజించెను.

కల్యా—లేదు. ఆయన నన్ను పరిత్యజింపలేదు.

గోవిం—ఏమందువు? అతఁడు నిన్ను పరిత్యజింపలేదా? కావలసిన పరాభవము నీకింకను పూర్తి కాలేదా! మంచిది వినుము. నీవు మహాబత్ఖానున కేమేని జాబు వ్రాసితివా?

కల్యా—అవును. వ్రాసితిని.

(అజయసింహుఁడు ప్రవేశించును.)

గోవిం—హా దైవమా! (నెత్తి కొట్టుకొని) మహాబత్ఖాను దానిపై "కల్యాణీ! నేను నిన్ను పరిగ్రహింపఁజాలను" అని వ్రాసి త్రిప్పి వేసెను. ఇదిగో! జాబు.

(గోవిందసింహుఁడు ఉత్తరము విసరి పారవేయును. కల్యాణి దానిని తీసికొని ఆదరముతో చూచును.)

గోవిం—ఏమి అజయా! ఈసమాచారము నిజమేనా?

అజ—అవును నాయనగారూ! మొగలులు మేవాడుపైకి దండెత్తి వచ్చిరి.

గోవిం—ఈమారు సేనాపతియెవరు?

అజ—షాహజాదాపర్వేజు.

గోవిం—సేన యెంత?

అజ—సుమారు ఒకలక్ష.

గోవిం—ఈమారు సర్వము నష్టమగును. ఏమియు మిగలదు. ఇంత వఱకు మేవాడులో మిగిలియున్న కొలఁదిప్రాణములు కూడ పోవును. ఏమి కల్యాణీ! తలపంచుకొంటివేమి?

కల్యా—ఏమిచెప్పుదును నాయనగారూ?

గోవిం—ఇప్పటికిని మహాబత్ఖాను నీభర్తయేనా?

కల్యా—అవశ్యము.

చ॥ తనుఁ గడు నాదరించుపతి ♦ దప్పక యెల్లరు పూజసేతు రే
వనితలు దన్నుఁదన్నుపతి ♦ పాదములర్చనసేతు, రేరు తి
ట్టిన నిలువెళ్ళఁగొట్టినఁ గఁ♦డింది నవజ్ఞయొనర్చినన్ నిజా
త్మను బతిభక్తిబాయరో యా♦దార్థపుసాధ్వులు వారలే భువిన్.

మఱియు నెవతె పతిభక్తి భర్త తన్నెన్ని యిక్కట్టులు పెట్టుచున్నను అంధకారమున చంద్రునివలె శాంతమై తుపానులో పర్వతమువలె దృఢమై, భ్రమణములో ధ్రువనక్షత్రమువలె స్థిరమై యుండునో ఎవతె పతిభక్తి విశ్వాసమువలె స్వచ్ఛమై కరుణవలె అయాచితమై, మాతృప్రేమవలె నిష్కామమై యుండునో ఆమెయే నిజమగు పతివ్రత. ఆయన నాకు ప్రభువు, నాకు పతి, నాకు దైవము, ఆయన నన్ను తనపాదసన్నిధిని ఉంచినను ఉంచకున్నను నాకు రెండును సమానములే.

గోవిం—రెండును సమానములా? కల్యాణీ! నీవు నా కన్యవేనా?

కల్యా—అవును నాయనగారూ! నేను మీకన్యను. నేను మీగౌరవము నెప్పుడును నష్టము చేయను. నాయనగారూ!



చ॥ అరయఁగ నిట్టిదట్టిదని ♦ యాడఁగఁజెల్లకయుండు దివ్యపుం
గరిమ వినూత్నమై చెలఁగెఁ ♦ గాంచగ నేడు మహాబతాఖ్యధీ
వరునకు సాధ్వినంచు తెలు♦పంగ సుయోగము నబ్బె మీర లే
తెరగున మీరు జీవితము♦ దేశముపాంబె త్యజించినార లా
తెరఁగును నేను త్యాగపుగ♦తిన్ జరియింతును దత్సుఖాప్తికై.

ఇప్పుడు నన్నెవ్వరడ్డగింతురు? (ఆవేశముచే స్వరము గద్గదమగును.)

గోవిం—త్యాగమా! నీవు నీ యీకులటావృత్తిని త్యాగమనుచుంటివా?

అజ—నాయనగారూ! మీరుచెప్పునది బాగుగ యోజించి చెప్పుడు. క్రోధావేశముచే మీరేమిచెప్పునదియు మీరెఱుఁగరు. లేనిచో ఏభావమత్యున్నతము, అతిసుందరమును, అతిపవిత్రమునో దానిని మీరింతకుత్సితముగ నేలతలంచెదరు?

కల్యా—(గర్వముతో) సోదరా! నీవు నాకు నిజమగుసోదరుఁడవు.

గోవిం—అజయా! నే నిక్కడకు నూరుమారులు చెప్పితిని. కల్యాణికి భర్తలేడు. అది విధవయైనది.

కల్యా—నేనును నూరుమారులు చెప్పుటకు సిద్ధముగా నున్నాను. బ్రదికినను చచ్చినను సర్వదా నాకు ఆయనయే భర్త.

గోవిం—మహాబత్ఖాను నీకుభర్తయా?—ఇంతఘృణితుఁడు, నీచుఁడు, అధమాధముఁడు—

కల్యా—నాయనగారూ! మీకు ఘృణితుఁడయ్యును ఆయన నాకు పూజ్యుఁడే.

గోవిం—పూజ్యుఁడా? ఆ జాతిద్రోహి, మతాంతరుఁడు. మహాబత్ఖాను గోవిందసింహుని కన్యకు పూజ్యుఁడా?—హా దుర్భాగ్యమా!

కల్యా—(దృఢత్వముతో) నాయనగారూ! నేను తండ్రి నెఱుఁగను, జాతి నెఱుఁగను, మతము నెఱుఁగను, ధర్మము నెఱుఁగను. నా కు

ధర్మము భర్త. శాస్త్రకారులు స్త్రీకి ఇంతకంటెగొప్పధర్మమును వ్రాయలేదు. నాయనగారూ! స్త్రీ యొకమారు ఉరికిపడినచో అది అమృతసాగరమగుంగాక, విషసాగరమగుంగాక జీవనము గాని, మరణముగాని ఆమెకు అక్కడనే యగును. అదియే ఆమెకు ఇహకాలము. అదియే పరకాలము. ఆయన హిందువో మహమ్మదీయుడో, ఆస్తికుడో, నాస్తికుడో కాని యిపుడు మేమిద్దఱము ఒకపథమునం బోవు పథికులమే. ఇందుకుగాను నేను ఆయనవెంట నరకమునకు పోవలసివచ్చినను పోవుటకు సిద్ధముగా నున్నాను.

గోవిం——మంచిది. ఇంక నీవు వెళ్ళవచ్చును నీ యిచ్చవచ్చిన చోటికి పొమ్ము. నేటినుండి నిన్ను పరిత్యజించితిని.

అజ——ఇదియేమినాయనగారూ! మీరేమిచేయుచుంటిరి? కల్యాణి మీకూతురు——

గోవిం——కాదు. అదినాకేమియు కాదు. పొమ్ము కల్యాణీ! నీభర్త వద్దకుంబొమ్ము.

కల్యా——నాయనగారూ! మీయాజ్ఞను శిరసావహించితిని. ఇంక నాకు సెలవిండు. (నమస్కరించును.)

అజ——నాయనగారూ! ఇంచుక ఆలోచింపుడు. ఇటుల అన్యాయము చేయకుడు. కల్యాణి ఆడుది. అది తప్పు చేసినచో క్షమింపుడు.

గోవిం——కుమారా! కల్యాణి నరకమునకు పోంగోరుచున్నది. పోనిమ్ము. దానిని నేనడ్డగింపం గోరుటలేదు.

అజ——నాయనా! ఆమెకది నరకముకాదు.

గీ॥ మహితము పవిత్రమైన ప్రే ♦ మప్రకాశ
మెందు వసియించు స్వర్గంబు ♦ నందెయుండు



తగవిచారింప కిట్టి ర ♦ త్నమ్ము చేతు
లారం బోంగొట్టుకొనుట న్యా ♦ యమ్ముగాదు.

నాయనగారూ! క్రోధావేశమున మీరేమి సేయునదియు మీకు తెలియుటలేదు.

గోవిం——అజయా! బాగుగ తెలియుచున్నది. కల్యాణీ!

గీ॥ హృదయమున దేశ విద్రోహ ♦ మెవండు పూను
నట్టివానికి నాయింటం ♦ బట్టులేదు
నీకు పతియె ధర్మంబగు ♦ నేని యిక
దేశమే నాకు ధర్మమై ♦ తేజరిల్లు.

పొమ్ము. (వెనుకకు తిరుగును.)

కల్యా——చిత్తము. (వెళ్ళంబోవును.)

అజ——ఆగుము కల్యాణీ! నాయనగారూ! ఇంకనాకును వెళ్ళుటకు సెలవిండు.

గోవిం——(ఎదురుగతిరిగి) ఇదియేమి అజయా?

అజ——ఈ అబలయగుబాలికను నేనొంటరిగాం బోనీయను. నేనును వెంటపోదును.

గోవిం——అజయా! నిన్నింటినుండి వెళ్ళుమని చెప్పలేదు.

అజ——నాయనగారూ! నేను దాని నపేక్షించుటలేదు. కల్యాణి యాడుది. ఆమెపుణ్యమునకు ప్రతిఫలముగ మీరామెను ఇల్లు వెడలంగొట్టుచున్నారు. ఘాతుక మానవాకీర్ణమగు ప్రపంచమున నొంటరిగా విడుచుచున్నారు. ఇప్పుడుదాని భర్తయున్నచో దానిని కాపాడువాడు. ఇప్పుడుదాని భర్త యిక్కడ లేడు. కాని సోదరుండున్నాడు. అతండే ఆమెను రక్షించును. రమ్ము కల్యాణీ! నేడు మనసోదరీ సోదరుల మిద్దఱము మనవాము

విక్షుబ్ధ విశ్వసాగరమున విడుచుచున్నాము. దరిచేరుదుమో లేదో చూతము. తండ్రీ! నమస్కారము.

(అజయుఁడు కల్యాణియు నిష్క్రమింతురు. గోవిందసింహుఁడు పాషాణమూర్తివలె నిలఁబడి యుండును.)

---

### సప్తమదృశ్యము.

స్థానము—చిత్తూరు పరిసరారణ్యము.

సమయము—సాయంకాలము.

(నగరసింహుఁడు నరుణసింహుఁడు నొకచెట్టు క్రింద నిలఁబడి యుందురు. సూర్యుఁ డస్తమించుచుండును.)

సగ—ఈరాజ్యమున నుండుటకు నాకేమాత్రమును ఇష్టము లేదు. చిత్తూరుకోట ఒకవిధమగు జైలుఖానా. ప్రాఁతపడి అంధకార గ్రస్తమై భయావహముగ నున్నది. నలుప్రక్కల కొండలు, చెట్లు. ఎక్కడను మనుష్యుని జాడలేదు. ఇంతపురాతనపు వృక్షముల నేనెక్కడనుజూడలేదు. అరుణా! నేనింక ఆగ్రాకుపోదును.

అరు—తాతా! నాకీస్థానము చాల బాగుగ నున్నది. ఇచ్చటిప్రతిపర్వతమును మన పూర్వపురుషుల స్మృతికి నెలవైయున్నది. ప్రాచీనగౌరవగాథలు నీకు బాగుగ నుండలేదా?

సగ—అదిగో! మరల ప్రాచీన గౌరవ రోదనము మొదలు పెట్టితివి. పోయినదేమో పోయినది. దానికై తలపగులఁ గొట్టుకొనకుము.

అరు—తాతా! నాకు వర్తమానముకంటె భూతమే బాగుగ నుండును. వర్తమానము చాలతీవ్రముగనుస్పష్టముగను ఉండును. భూతమాచ్ఛిన్నము నస్పష్టము నైయుండును. భూతము నీలిమవలెను, ఆఖ్యాయికవలెను స్వప్నమువలెను ఉండును.



సగ—అదిగో! నేను దేనికి వెరచుచుంటినో అదియే అయినది. పెద్దవాఁడవైనకొలఁది తల్లి పద్ధతియే నేర్చుకొనుచుంటివి. అదియు నిట్లే మాట్లాడుచుండెడిది. అదియునిట్లే మాట్లాడుచు మాట్లాడుచు ఇంటినుండి లేచిపోయినది. ఎక్కడకు పోయినదో ఎవ్వరికిని తెలియదు.

అరు—మాయమ్మ యిట్లే మాట్లాడుచుండెడిదా?

సగ—అవును. ఈమాటలే దాని పాలిట మృత్యుతుల్యము లైనవి. 'మేవాడ, మేవాడ' యని అఱచుచు పిచ్చెక్కి ఇంటినుండి వెళ్లిపోయినది.

అరు—నే నామెను వెదకి తీసికొనివచ్చెద.

సగ—ఈ యడవిలోనా? ఈయడవిలో మునిగిన సూర్యునేనియు వెదకి పట్టుకొనుట కష్టము. ఇంక మీ అమ్మ అమ్మయే.

అరు—కాదు తాతా! ఇప్పుడు నేను ఆగ్రా రాను. నీవు వెళ్ళిన వెళ్లుము. నాకీస్థానము చాలా బాగుగనున్నది. మాయమ్మ ఈ దేశములో నున్నపుడు ఇదియే నాయిల్లు, ఇంతకాలము ఆగ్రాలో నుండుట నాకు ప్రవాస శిక్షయే.

సగ—మొదటినుండియు నాకిదియే భయము. నీవు ఆగ్రాలో బాదుషాగారి పాలరాళ్ళమేడ చూచినట్లులేదు. రమ్ము. ఈమారు చూపించెదను.

అరు—వద్దు. నేనేమియు చూడఁగోరుటలేదు. నాకీ నిర్జనవనమే అంతకంటె నెక్కువమంచిదిగాఁ గనుపట్టుచున్నది.

సగ—ఆగ్రాలో నెబ్బదెనిమిది మసీదులున్నవి. ఒకదానికంటె నొకటి మించిన యందముగలవి.

అరు—తాతా! నాకు ఎత్తైన సూరుబంగారు మసీదులకంటె నాదేశములోని ఒకశిథిల దేవాలయము మంచిది. మొగలుల కాళ్ళ కడఁ గూర్చుండి రాజభోగము లనుభవించుటకంటె దీనురాలగు నాతల్లి యొడిలోఁ గూర్చుండి గంజినీళ్ళు త్రాగుట మంచిది. తాతా! నీ వీభిక్షాన్నము గుడుచుటకేనా నీదేశము విడచి నీసోదరుని విడిచి పుణ్యకథాభరితమగు నీగృహమును విడిచి యొరులపంచకు చేరితివి? వారు రోజు నీకు గుప్పెడు బంగారము ముష్టి వెట్టినను దానితో వారి పాదధూళి కలసియుండును. వారు నీవంక చూచి నవ్వునపుడు ఆనవ్వులో నేవగింపుకూడ నాకు గోచరించుచుండును. తాతా! పరుఁడొసఁగిన బంగారు బొక్కసముకంటె తనసోదరుని వట్టిపరిహాసము ఉత్తమమని నాతలంపు.

[సత్యవతి ప్రవేశించును.]

సత్య—చిరంజీవివి కమ్ము కుమారా!

సగ—ఎవరు? సత్యవతియా? నేను కలగనుచుంటినా? లేదు. ఇది సత్యవతియే. సత్యవతీ! నీవిచటి కెట్లువచ్చితివమ్మా?

సత్య—కుమారా! ఏనాఁడు స్వదేశమునకై సన్న్యాసము స్వీకరించి నేను ఇలు వెడలఁబోతినో నాఁడు నీ యీ చిన్ని చేతుల బంధనము విడిపించుకొనిపోవుట నాకు అన్నిటికంటెఁ జాల కఠినమైనది. మేవాడుమహిమను గానము చేయుచు నీకొండలలో తిరుగునపుడు నీచిఱునవ్వు మఱచుట అన్నిటికంటె నాకు కష్టమయ్యెను. నీవు ఇచటకువచ్చితివని వినినపుడు ఇంక నామనసు నిలువలేదు. వెంటనే పరుగెత్తుకొని నిన్నుచూచుటకు వచ్చితిని. ఇంతసేపునుండి చాటుననుండి నీయమృతవాక్కుల వినుచుంటిని. ఇట్టి స్వర్గీయవాక్కులును పృథ్విపై నుండునా యని ఆలోచించుచుంటిని. తుదకు నే నుండలేకపోతిని. నా బిడ్డా! నాసర్వస్వమా!



[సత్యవతి చేయిసాచును.]

సగ—అమ్మా సత్యవతీ! నీవు నావంక నొకమారును చూడలేదు. నే నేమని యపరాధముచేసితినా?

సత్య—అపరాధమా? నీయపరాధము నీవెఱుఁగవా? అది యెఱుఁగఁగల శక్తియు నీకులేదు కాఁబోలు. నీవు నీయీదీనయు, హీనయు దుఃఖితయు, జననియునగు జన్మభూమిని విడిచి యవనప్రసాదభోగి వయితివి. ఏ మొగలులు మన దేవళములను బగులఁగొట్టి మన తీర్థస్థానముల నపవిత్రముచేసిరో, ఏ మొగలులు ఇచ్చటి స్త్రీజాతి నవమానపఱచి యిచ్చటిపురుషులను మనుష్యత్వహీనులుగఁ జేసిరో వారికే నీవు దాసుడవైతివి. మఱియు నే మొగలులు గర్వోన్మత్తులై రాజపుత్రస్థానములో హతావశేషమగు స్వతంత్రరాజ్యము మేవాడుపైకి మాటిమాటికి దాడి వెడలుచున్నారో, ఏ మొగలులు దాని సస్యశ్యామల ధరిత్రిపై తత్పుత్రుల రక్తనదులఁ బాఱించుచుండిరో ఆ మొగలులనే నీవు శరణుజొచ్చితివి. నీ వా మొగలుల కృపచే నీసోదరుడగు రాణా ప్రతాపసింహుని పుత్రుని సింహాసనచ్యుతునిఁ జేయుటకు సిద్ధపడితివి. పైఁగా నాయపరాధ మేమియని అడుగుచుంటివి. నాయనా! నీవొకత్రోవఁబోవుట కిష్టపడితివి. మే మొకత్రోవను బోవుచుంటిమి. పొమ్ము రమ్ము కుమారా! ఈ అంధకారమున ఈ దుర్దినమున నీవే నాకు తోడిబాటసారివి. నేడు నాహృదయమునకు రెట్టింపు బలము వచ్చినది. రమ్ము, కుమారా! పోదము.

(అరుణుని తీసికొని వెళ్ళఁబోవును.)

సగ—వద్దు, వద్దు. సత్యవతీ! ఆగుము. అరుణా! నీవును వెళ్ళవద్దు. పోనిండు, నేనును మీ వెంట వచ్చెదను. నేఁడు నేను కనులు తెరచితిని. నేఁడు నేను నామాతృభూమిని గుర్తించితిని. నేఁడు

నేను నాహృదయమునుండి పరుల కృపపైని ఆశను పారదోలితిని. నేటనుండి నేను నా దేశమునకై దారిద్ర్యమును, దుఃఖమును ఉపవాసమును స్వీకరించితిని. రమ్ము కుమారీ! నిన్ను కౌగిలించు కొందును.

సత్య—ఇదియేమి నాయనా! నేఁడు నాకింతటి భాగ్యమా? ఏకకాలమున తండ్రిని పుత్రుని పొందగలిగితినా? నీవుచెప్పునది సత్యమేనా? ముమ్మాటికి సత్యమేనా?

సగ—అవును సత్యవతీ! ఇదిసత్యము. ముమ్మాటికి సత్యము. మొదట నా కీసంగతులు తెలియలేదు. నన్ను క్షమింపుము. క్షమింపుము.

సత్య—నాయనా! నాయనా! (మోకరిలఁబడి తండ్రిపాదములపై తలయుంచును.)

---



# మేవాడుపతనము.

## తృతీయాంకము.

ప్రథమదృశ్యము

స్థానము—ఉదయపురరాజసభ

సమయము—ప్రభాతము.

[సామంతరాజులు నిలచి మాటాడుచుందురు.]

జయ—ఈకామనేరుయుద్ధము ఇతిహాసములో సువర్ణాక్షరములతో వ్రాయఁదగినది.

గోకులసింహుఁడు—పర్వేజునకు ఆహారసామగ్రిలు రాకుండ దారికట్టుట చాల తెలివిగలపని.

భూపతి—వారీ యడవిత్రోవ మెఱుఁగనట్టులున్నది.

గోకు—అయితే పాఱిపోవుత్రోవ బాగుగ నెఱుగుదురు.

జయ—నేటిప్రభాతము మేవాడునకు గౌరవమయమైనది. మేవాడు పర్వతమెట్టి నవీనప్రకాశముచే మెఱయుచున్నదో చూడుము.

భూప—ఈసుందరసమీరము ఈవిజయసమాచారమును భారతవర్షమంతటను వ్యాపింపఁజేయును.

[రాణా అమరసింహుని ప్రవేశము]

అంద—జై, రాణా అమరసింహునకు జై.

[రాణా సింహాసనమునఁ గూర్చుండును. రాజకవియగు కిశోరదాసు వచ్చి యీపద్యము చదువును.]

గీ॥ జయము జయము మహారాజ ♦ జయము నీకు
ఇన ప్రతాపత నీవిల ♦ నేలుచుండ
నీదు శత్రులు నిలువఁ ♦ నీడలేక
దాఁగుచుండిరి గిరి గుహాం ♦ తరములందు.

రాణా—కిశోరదాసూ! నీపద్యమున మఱియొక పాదము గూర్చుము.

కిశో—చిత్తము మహారాజా!

రాణా—"నీదు కతన సర్వస్వమ్ము ♦ నిర్గమించె"

కిశో—ఇదియెందుకు మహారాజా?

రాణా—(ఇంచుకనవ్వి) ఎందుకా? అడుగుటయేల? చూడుము.

(సత్యవతి ప్రవేశము)

సత్య—మేవాడురాణాకు జై.

రాణా—ఎవరు? సత్యవతియా? (సింహాసనము దిగి ఆమెను ఎదుర్కొని) రమ్ము సోదరీ!

సత్య—మహారాజా! ఇంతదనుక నేను బయట నిలఁబడి మేవాడువిజయ గీతమును వినుచుంటిని. వినఁగా వినఁగా కనులవెంట నానందాశ్రువులు వెడలినవి. మంత్రముగ్ధునిబలె మెదలక నిలఁబడి విస్మాగితిని. లంకా విజయానంతరము మహారాణా పూర్వపురుషుఁడగు శ్రీరామచంద్రుని అయోధ్యానగర ప్రవేశ వృత్తాంతము స్మృతికి వచ్చినది. తర్వాత గీతమాగినది. ఒక దేవివచ్చి తన తేజమున నావరించి యాగీతమును తనస్వర్గరాజ్యమునకుఁ గొనిపోయినట్టు లయ్యెను. అప్పుడు నేను కలనుండి మేల్కొని నట్టులైతిని.

రాణా—సత్యవతీ! గీతమిట్లే యాగిపోవును. గీతములన్నియు తొలుత ఒకవిధమగు నానందకోలాహలముపలె ప్రారంభమై ఒక దీర్ఘ నిశ్వాసమున లీనమగును.



సత్య—ఇదియేమి మహారాజా! ఆనందదినమున మీరిటుల నిరానందముగను విచారముగను ఉంటిరేమి? మహారాజా! మీరుమీ హృదయమునుండి నిరాశను బారఁద్రోలుడు. నేటిదినము మేవాడుకు చాలగౌరవమయమైనది.

రాణా—గౌరవదినమే యగునవచ్చును. సత్యవతీ! ఒకక్రొత్తసంగతి విందువా? కామనేరుయుద్ధమున మనము గెలువలేదు.

సత్య—ఇంకెవరుగెలిచిరి? మొగలులుగెలిచిరా?

రాణా—లేదు. రాజపుత్రులుగెలిచిరి. కాని ఇచ్చట విజయోత్సవము చేయుమనము గెలువలేదు. యుద్ధమున గెలిచినవారు యుద్ధక్షేత్రమున పడియున్నారు. సత్యవతీ! నిజమునకు యుద్ధక్షేత్రము నుండి డంకాపటహాదులు వాయించికొనుచు జయజయధ్వానములు సేసికొనుచు వెడలువారలు గెలుపొందినవారు గాను. యుద్ధక్షేత్రమున ప్రాణమర్పించినవారే జయమందినవారు.

సత్య—మహారాజా! ఇదియథార్థము. ఈశ్వరుఁడు వారికక్షయకీర్తి నొసగుగాక!' మహారాజా! నేను మీకొక శుభవర్తమానము వినిపించెద.

రాణా—సత్యవతీ యేమివర్తమానమది?

సత్య—మహారాజా! మాతండ్రియగు రాణాసగరసింహుడు మీకై చిత్తౌరుకోట విడిచినాఁడు. మీరు నిరాతంకముగ కోటను వశపఱచుకొనవచ్చును.

రాణా—చిత్తౌరుకోట మనకై విడిచెనా? సత్యవతీ! ఏమిఅట్లనుచుంటివి? ఇది యథార్థమా? ఇది సంభవమా?

సత్య—మహారాజా? ఇది కేవలము సత్యము.

రాణా—వారు హఠాత్తుగ మనకై కోటనేలవిడిచిరి? బాదుషా ఇట్టి హుకుమునిచ్చెనా?

సత్య—లేదు. మహారాజా! బాదుషా ఆయనకు కోటనిచ్చెను. ఉంచుకొనుటకుఁగాని యిచ్చుటకుఁగాని ఆయన కధికారముగలదు కాన మనఃపూర్వకముగ చిత్తౌరుకోట మీకుఇచ్చి ఆయన ఆగ్రాకి వెళ్ళెను.

రాణా—సామంతులారా! జయధ్వనిసేయుఁడు. స్వర్గస్థులగు నాయన గారి జీవితస్వప్నము నేఁడు సఫలమయ్యెను. అయితే ఆయన పుత్రుని బాహుబలముచేఁ గాదు. ఆయన సోదరుని దానముచే వెళ్ళి కోటవశపఱచుకొనుఁడు. క్రొత్తసైన్యము నాయత్తపఱచుఁడు. నడువుఁడు ముట్టడింపుడు. అంతపర్యంతము యుద్ధము సలుపుడు.

సత్య— జై-రాణా అమరసింహునకు జై!

సామంతులు—జై! రాణా అమరసింహునకు జై!

---

## ద్వితీయదృశ్యము

స్థానము—ఊరిబయట త్రోవలో భగ్నకుటీరము.

సమయము—సాయంకాలము.

(కల్యాణితో అజయుఁడు ఆత్రోవనే వచ్చుచుండును.)

కల్యా—అన్నా! నే నింక నడువఁజాలను.

అజ—నేఁడు మన మీయూరిలోనే యుందము. ఈ కుటీరమూరి బయటిదే! ఏదియో మకాణముగా నున్నది. తలుపు వేసిలేదు. లోపలచీఁకటిగా నున్నది.

కల్యా—కొంచెము కేక వేసి చూడుము.

అజ—ఎవరైన నున్నారా? లోపల నెవరు? ఎవ్వరును మాట్లాడుటలేదు. ఎవ్వరు నున్నట్లు లేదు.

కల్యా—నేఁడు మనమిక్కడనే యుందము. ఇంక నడువఁజాలను.



అజ—మంచిది. నీవు కొంచెము సేపిచ్చటనే యుండుము. నేనుపోయి ఊరినుండి దీపము తెచ్చెదను.

కల్యా—పొమ్ము. నేనొకయడుగేని నడువఁజాలను. అన్నా! నాకు చాల ఆఁకలిగా నున్నది.

అజ—నేనుకొంచె మాహారపదార్థము కూడ తెచ్చెదను. నీవిచ్చటనే యుండుము.

కల్యా—అన్నా! త్వరగా రమ్ము. ఒంటరిగానుండుటకు నాకు భయము వేయుచున్నది.

అజ—నేను చాలత్వరగా వచ్చెదను. ఇచ్చట భయపడవలసిన పని లేదు. ఇక్కడ ఎవ్వరును లేరు. (వెళ్ళును.)

కల్యా—నేటిదనుక నే నెన్నఁడును నడచియెఱుఁగను. కనుక నే—

చ॥ పదముల శోణితంపునది ♦ పాఱుచునున్నది యైననాదు నె
మ్మదిఁ గడు సమ్మదంబొదవె ♦ మానుగ స్వేచ్ఛ మెయిన్ వరించుటన
హృదయము నీదరిద్రితకు ♦ నీయుగచాట్లకు డస్సిపోక తా
విదిత మహాభిమానమున ♦ వెల్గుచునుండె మహోన్నతంబునై.

గీ॥ రంగదుత్తుంగ భంగముల్ ♦ నింగిముట్ట
నుదధి ననివార్యమై చేరు ♦ నదివిధంబు
నాదు సర్వస్వమైన నా ♦ నాథుకడకుఁ
బోవుచుంటిని యధిక స ♦ మ్మోదమలర.

అయితే వారు తనపాదములకడ నాకు దాసీస్థానము నేనియు నిత్తురో లేదో తెలియదు. ఎవరు?

[ఫకీరు వేషమున సగరసింహుఁడు ప్రవేశించును]

సగ—అమ్మా! నేనొక రాజపుత్రుఁడను. నీకేమియు భయము లేదు? నీవు రాజపుత్రస్త్రీవలెఁ గనుపట్టుచున్నావు. ఒంటరిగ నుంటివేల?

కల్యా—నాసోదరుఁడు దీపమును ఆహారసామగ్రిని దెచ్చుటకు ఊరి లోనికి వెళ్ళినాఁడు.

సగ—మంచిది. ఆయన తిరిగివచ్చునంతవరకు నేనిచ్చటనే యుందును. ఇచ్చట ముసల్మాను సిఫాయీలు ఉత్పాతము సేయుచునుందురు. వారిలోని నలుగురైదుగురను ఇప్పుడే నే నీసమీపమునఁ జూచితిని. నీయన్నవచ్చువఱకు నేను నిన్నుకాపాడుదును.

కల్యా—మీరిచ్చటనేయుండి నన్నుకాపాడుఁడు. నాకు భయము వేయుచున్నది.

(తెఱలో)—ఈపాడుగుడిసెలోనేనా?

(తెఱలో)—అవును. ఇక్కడనే. (ఒకడు తలుపుతట్టును.)

కల్యా—ఎవరు? ఎవరు? అన్నా! అన్నా!

[ముగ్గురుదొంగలు లోపలఁజొరఁబడుదురు.]

౧ దొంగ—ఇదియే. ఇదియే.

౨ దొంగ—పట్టుకొనుము.

(౧ దొంగ కల్యాణిని పట్టబోవును. ఆమె తప్పించుకొని యఱచును)

కల్యా—నన్నురక్షింపుఁడు, రక్షింపుఁడు.

సగ—(ముందుకుఁబోయి) జాగ్రత్త.

౧ దొంగ—వీఁడెవఁడు?

౨ దొంగ—ఎవఁడో, ముందు వీనినేకొట్టుము.

[సగరసింహుఁడు దొంగలతోఁబోరాడి క్రిందబడును.]

కల్యా—అన్నా! అన్నా!

[అజయసింహుఁడు ప్రవేశించును.]

అజ—కల్యాణీ! భయపడకుము. నేనువచ్చితిని, (అజయుఁడు కత్తి



దూసి దొంగలను క్రిందబడగొట్టును.) వీరినందరను తుద ముట్టించితిని. ఈయన యెవరు?

కల్యా—నన్నురక్షించుటకు వచ్చిరి. పాపము వీరికి దెబ్బతగిలినది.

సగ—నీవెవరవు?

అజ—నేను సేనాపతి గోవిందసింహుని పుత్త్రుఁడను. అజయసింహుఁడను. ఈమె నాచెల్లెలు కల్యాణి.

సగ—ఎవరు? మహబ్బత్ఖానునిభార్య కల్యాణియా?

అజ—అవును. వీరాగ్రణీ! మీరెవరు?

సగ—నే నా మహబ్బత్ఖానుని తండ్రిని, సగరసింహుఁడను.



## తృతీయదృశ్యము

స్థానము - యోధపురమహారాజగు గజసింహుని దర్బారు.

సమయము - ప్రభాతము.

[గజసింహుఁడు, అతనిపుత్త్రుఁడు అమరసింహుఁడు, సభ్యుఁడగు హరిదాసు, దూతవేషమున అరుణసింహుఁడు.]

గజ—దూతా! మేవాడుమహారాణాతో మే మీసంబంధము నొప్పుకొనలేదని చెప్పుము. బాదుషాకు విద్రోహులగు వారితో మే మెట్టిపొత్తును పెట్టుకొనఁగోరుటలేదు. ఏమి హరిదాసూ?

హరి—అవును మహారాజా! చాల బాగుగనున్నది.

అరు—మహారాజా! మా మహారాణా విద్రోహి యెట్లు? మేవాడు యింతవఱకును మొగలులకు స్వాధీనము కాలేదుగదా. ఇన్ని దినములనుండియున్న తన స్వాతంత్ర్యమును గాపాడుకొనఁ బూనుట విద్రోహము కాఁజాలదు.

జ—కాదు. ఇదియే విద్రోహము. రాజపుత్రస్థానమంతయు మొగలుల యధికారమునకు లొంగియుండ నొక మేవాడుమాత్రమే తలయెత్తుకొని యేల ఉండవలయును?

అరు—తెలిసినది. మహారాజుగారి మనమున నీర్ష్య నెలకొనినది. అన్ని పర్వతముల శిఖరములనుండియు గౌరవకిరణములు దిగిపోయినవి. ఒక మేవాడుపర్వతముననే ఆకిరణములావరించియున్నవి. దీనిని మహారాజు సహింపఁజాలకున్నారు. రాజపుత్రరాజుల తలలన్నియు నగ్నములు. ఒక మేవాడు మహారాణా శిరమే కిరీటశోభితము. ఈదృశ్యము మహారాజు నేత్రములకు కంటకముగ నుండనోపును. కాని మహారాజా! మామహారాణాగారు మిమ్ము గౌరవముచే వంచితులఁ జేయలేదు. మీరే మిమ్ముల నిట్టిగౌరవముచే వంచితులఁ జేసికొనిరి. ఇందు రాణాగారి దోషమేమియు లేదు.

గజ—దూతా! నీవు అతిసాహసివిని, ధృష్టుఁడవుగను ఉన్నావు. గజసింహ మహారాజు ఎదుట నిట్లెవ్వరును బలుకఁ జాలరు. ఇరువదివేల రాజపుత్రసైనికులతో భారతరాజేశ్వరుని నెదుర్కొన నెంచినచో ఇట్టియున్మత్తత మీరాణాకే చెల్లును.

అరు—మహారాజుగారు చెప్పినదినిజము. ఇట్టిఉన్మత్తత వారికే చెల్లును. ఇట్టు లున్మత్తుఁడగుశక్తి మీకు లేదు. మీరు చెప్పినది నిజము.

గజ—దూతా! నీ వవధ్యుఁడవు. లేకున్న—

అరు—మంచిది. ఇంతమనుష్యత్వము మీయందున్నది. మహారాజా! దూత యవధ్యుఁడని మీ రెక్కడ నేర్చుకొంటిరి? ఇంతగొప్ప నీతి, ఇంతగొప్ప మాట మీ నోటినుండి యెట్లు వెలువడినది?

గజ—దూతా! మాటకును మేరయున్నది. పొమ్ము. రాణాతో మే మీ వివాహ మొప్పుకొనలేదని చెప్పుము. పొమ్ము—



అరు—మహారాజా! నేను వెళ్ళుచున్నాను. కాని ఒకమాటచెప్పి పోవుచున్నాను. మీరు దక్షిణదేశమున బాదుషా పక్షమున చాల యుద్ధములు చేసిరఁట. మీరు గుజరాతుకూడ జయించితిరఁట. ఈమారు మీరు మేవాడుకు కూడ వచ్చెద రనుకొనియెద. ఇందుకై నేను మిమ్ము నాహ్వానించుచున్నాను. (వెళ్ళఁబోవును)

గజ—మంచిది, అట్లేకానిమ్ము. అయితే దూతా! ఆగుము. నీవు మా వెంటనే వెళ్ళుదువుగాక!

అరు—నన్ను ఖైదుచేసెదరా?

గజ—అవును. అమరా! వీనిని బంధింపుము.

అమ—ఎందుకు నాయనగారూ? ఇతఁడు దూత. దూతపై ద్రోహము సేయుట క్షత్రియ ధర్మముకాదు.

గజ—అమరసింహా! నేను నీయొద్ద ధర్మాధర్మములు నేర్చుకొనఁ గోరుటలేదు. నీవు నాయాజ్ఞను పాలించుము.

అమ—నాయనగారూ! నేనీ యన్యాయపుటాజ్ఞను పాలింపఁ జాలను.

గజ—(కోపముతో) నీవు నాయాజ్ఞను పాలింపఁజాలవా? పొగరుపోతా! వినుము. నీవు నాకు జ్యేష్ఠ పుత్రుఁడవు. కాని నామాటవినకున్న మునుముందు నీ కీరాజ్యము లభింపదు. సింహాసనము నాచిన్న కొడుకగు యశోవంతసింహునిదే యగును.

అమ—మీరు మీరాజ్య ముంచుకొనుఁడు. మొగలుల పదాఘాతములచేతను వారి యనుగ్రహముచేతను మీ యీ సింహాసనము నిర్మింపబడినది. దానిపైఁ గూర్చుండుటకు నాకేమియు నిష్టములేదు. మొగలుల పాదరక్షలు నెత్తిపై నిడుకొనుటకు నాకేమియు పట్టుదలలేదు.

గజ—మంచిది. దీనికి శిక్షగా నిన్నిప్పుడే నారాజ్యమునుండి వెడలుట కాజ్ఞాపించుచున్నాను. పొమ్ము.

అమ—ఇప్పుడే పోవుచున్నాను. (నిష్క్రమించును.)

గజ—(కొంచెమాగి) పొమ్ము దూతా! నిన్నువిడిచిపెట్టుచున్నాను.

---

చతుర్థ దృశ్యము.

స్థానము—మహబత్ఖానుని ఇంటివెలుపల.

సమయము—రాత్రి

(మహబత్ఖాను ఒంటరిగ కూర్చుండియుండును.)

మహ—

ఉ॥ భోగవిలాససంపదలఁ ♦ బొల్పుగఁ దేల్చెడి సుందరీమణిన్
ద్యాగము చేసి వైచితిని ♦ యాసతిప్రేమ విభాసితాననం
బేగతి మర్పరాదు, మరి ♦ దృష్టిపథంబున నాట్యమాడు నే
వేగగనయ్యె రత్నమును ♦ వీడితినంచు సతంబు నెమ్మదిన్.

అక్కటా! నే నామెకమ్మ నేలత్రిప్పిపంపితిని? ఇట్టి విశుద్ధసత్య ప్రేమను నిరాకరించుట నాకు చాలఅనుచితము. నాఁడు ఆపెతండ్రి పైని క్రోధావేశమునకు గురినై ఆపెప్రేమను తిరస్కరించుట నాది గొప్పతప్పు. నాకు అవకాశము కలిగినచో రెండు చేతులు జోడించి ఆమెన్ను క్షమాపణ గోరెదను.

పహరేదారు—(వచ్చి) ఖుదావంద్! గజసింహమహారాజు తమదర్శనమునకు వచ్చినారు.

మహ—గజసింహుఁడా? యోధపురరాజా?

పహ—చిత్తము.

మహ—పొమ్ము. వారినిటకుఁ దోతెమ్ము.

[పహరేదారు వెళ్ళును.]

మహ—గజసింహునకు మనతో నేమి పని? వట్టి పిరికిపంద, అధముఁడు, మొగలుల బానిస. అదిగో! వచ్చినాఁడు.

గజ—(వచ్చి) ఆదాబ్!

మహ—నమస్కారము. నేఁడు మహారాజుగారు బీద కుటీరము నేల యలంకరించిరి? ఏమిసమాచారము?



గజ—బాదుషాగారు తమ్ముఁ బిల్వనంపిరి.

మహ—వారి యనుగ్రహము. మేవాడు యుద్ధమునకు వెళ్ళుటకుఁ గాఁబోలు.

గజ—చిత్తము జనాబ్!

మహ—ఈవిషయమై పలుమారులు బాదుషాకు విన్నవించి యుంటిని. ఏలొకో మరల మాటిమాటికి నిట్లు లాజ్ఞాపించుటలు.

గజ—మేవాడురాణాచే పలుమారు మొగల్సైన్యము ఓడింపఁబడినది. ఇందుకు బాదుషా చాలవిచారముగ నున్నారు. ఈమారు మిమ్ము నాజ్ఞాపింపక తప్పినదికాదు. ఈ అవమానమునుండి వారిని రక్షింపగల వీరులు మీరొక్కరే. మీరువారికి చాల విశ్వాసపాత్రులు.

మహ—తామేమి యట్లు సెలవిచ్చెదరు?

గజ—ఇది లోకమంతయు నెఱుఁగును.

మహ—ఊఁ. (పచారు చేయును.)

గజ—ఖాన్సాహబ్! ఈమాఱు మీరు మేవాడుయుద్ధమున తప్పక శస్త్రగ్రహణము సేయుఁడు. మేవాడు మీజన్మభూమియనియు రాణా అమరసింహుఁడు మీసోదరుఁడనియు నేనెఱుఁగుదును. అయితే చాలకాలమునుండి మీరు దానిబొత్తుగా విడిచివేసితిరి. మీరు మీమతమునుగూడ విడిచిపెట్టితిరి. ముసల్మానులై మీరు మేవాడుతోడిసంబంధమును తెంచివేసికొనిరి. ఇంక వ్యర్థముగా సంశయించెదరేల!

మహ—మేవాడు నాజన్మభూమియే కాకున్న!

గజ—జన్మభూమి మిమ్ము బలాత్కారముగ చంక నెత్తుకొనునా? మీరొకమారు మేవాడుకు పోయిన మంచిది. యుద్ధమునకుఁ గాకున్నమాని, చుట్టము చూపుగనైన పొండు. మేవాడువాసులు "ప్రతాపసింహుని యన్నకొడుకు మతభ్రష్టుఁడై మ్లేచ్ఛులలోఁ

గలనో"నని మిమ్ము నాక్షేపించెదరు. వృద్ధులు మిమ్ముఁ జూచి అసహ్యముతో మొగము త్రిప్పుదురు. యువకులు మిమ్ము క్రోధారుణ దృష్టులతోఁ జూచెదరు. వనితలు గవాక్షముల నుండి తిట్టుదురు. ఖాన్‌సాహెబ్! రాజపుత్రులు మిమ్ము సోదరునిగ భావించి కౌఁగిలించుకొందురని మీరెన్నఁడు ననుకొనవద్దు.

మహా—ఊఁ! (మహబత్‌ఖాను ఆలోచించును.)

గజ—జీవితాంతము వఱకు మీరు మొగలులతోడి సంబంధమే యుంచుకొనవలసి యుందురు. వారి యున్నతితోపాటు మీ యున్నతి, వారియవనతితోపాటు మీ యవనతి. ఖాన్ సాహెబ్ మీరు నామాటలు బాగుగ యోజించుకొనుఁడు.

[సన్యాసి వేషమున సగరసింహుని ప్రవేశము]

సగ—మహబత్!

మహా—ఎవరు? నాయనగారా! మీరిచట నీవేషములో నుంటిరేమి?

సగ—నేనిపుడు సన్యాసము పుచ్చుకొంటిని.

మహా—అదియేమి నాయనగారా?

సగ—మహబత్‌ఖాన్! నీకు వింతగనున్నది కాఁబోలు. నిజముగ నిదివింత సంగతియే. ఎవఁడు దేశమునకు, జాతికి, మతమునకు తిలోదకములిచ్చి జీవితము నష్టముచేసికొనెనో, ఎవఁడు అధికసమయము విజాతీయుల కృపాభిక్షను యాచించుటయందే గడపెనో వాఁడే యిపుడు తనజీవిత సంధ్యాకాలమున మరల తనమార్గమును మార్చుకొనెను. అయితే నేనీరూపమేల గ్రహించితినో నీవెఱుఁగుదువా?

మహా—లేదు.

సగ—ఇన్నినాళ్ళకు నేను ప్రేమమయియగు మాతృభూమియొక్క పిలుపువింటిని. ఆతల్లియాహ్వాన మెంతగంభీర మెంతకరుణము



ఎంతగద్గదమునై యున్నది!—మహబత్! నీవుదాని యూహ కూడ చేయఁజాలవు. ఇపుడు నేను నాపాపములకు ప్రాయశ్చిత్తము చేసికొనుచున్నాను. నీతో నీవిషయము చెప్పుటకే వచ్చితిని. నీవును నీపాపములకు ప్రాయశ్చిత్తము చేసికొనుము.

మహా—నాపాపములకా?

సగ—అవును నీపాపములకే. నేను స్వజనమును విడనాడి మొగలులకు దాసుఁడనైతిని. నీవు నన్నుమించితివి. నీవు మతమును గూడ విడిచితివి. కాన నీపాపములకు మేరలేదు.

మహా—నాయనగారూ! నాకెట్టి పాపమున్నట్లు గనుపట్టుటలేదు. ఇంక ఇస్లాము మతము సత్యమని నాకు విశ్వాసమున్నచో—

సగ—కుమారా! నీ కీవిశ్వాస మెట్లుకలిగినది? నీవు కురాను చదివిన మాట వాస్తవము. నిజముగ నది మంచిగ్రంథమే. హిందూమతము దానిని నిందించుటలేదు. దానితో దీనికెట్టి వివాదమును లేదు. అయితే నీవు నీతాతముత్తాతల యొక్క వ్యాస కపిల శంకరాచార్యుల యొక్క మతము విడుచుటకుముందు వారిగ్రంథములను చదివితివా? నీవంటి మూర్ఖునకు, నిరక్షరకుక్షికి, ధర్మాధర్మ విచారమెట్లుకలుగును? ప్రవృత్తి దమనమును (ఇంద్రియ నిగ్రహము) ఆత్మజయమును ఏమతమునకు మూలమంత్రములో, సర్వభూతములపై దయవహించుటయే ఏమతము యొక్క అంత్యపరిణామమో ఆదయయు నొకమనుష్యజాతియందే పరిమితముగాక చీమను జంపుటకూడ ఏమతము నిషేధించుచున్నదో అట్టిమతమును అవిచారితముగ విడిచి నీవెంత పాపముచేసితివో యెఱుఁగవు.

మహా—నాయనగారూ! నాకిది చాల విస్మయముఁ గొలుపుచున్నది. నేఁడు మీరు—

సగ—అవును. నేఁడు నేను ధర్మోపదేశము సేయుచున్నాను. నేనిటుల నెట్లు మారితినాయని నాకే చాల విస్మయముగ నున్నది. ఎవఁడు ప్రపంచములో ధనముకంటె నితర మెఱుఁగఁడో వాఁడుధర్మమునకై సన్యసియయ్యెను! ఎంతవింత! కాని ఉచ్చప్రవృత్తిని ఉచ్చస్వరముతో మ్రోగించు నొక తంత్రియేనిలేని హృదయమేదియు నుండదు. ఒకనాడు దైవవశమున ఆతంత్రి పరిస్థితియను అంగుళ్యాఘాతముచే మ్రోగినపుడు ఒకక్షణములో హృదయమంతయు పరివర్తనము చెందును. ఆత్మ ఆసమయమున క్షుద్రస్వార్థకంచుక నిర్ముక్తమై అనంతాకాశమువైపునకు నడుచును. ఈవిషయము కల్యాణి నాఁడు నాకు చెప్పినది.

మహా—కల్యాణియా?

సగ—అవును. నాఁడు అదియే నాకీవిషయము చెప్పినది. ఇప్పటికిని దానిమాట సంగీతస్మృతివలె నా చెవులయందు మ్రోగుచున్నది. మహాబత్ఖాన్! కల్యాణిని దానితండ్రి ఇంటినుండి వెళ్ళగొట్టిన సంగతి నీవెఱుఁగుదువా?

మహా—ఇంటినుండి వెళ్ళఁగొట్టెనా? ఎందుకు? ఏ అపరాధముచేత?

సగ—కల్యాణి ఇప్పటికిని మతాంతరుఁడవగు నిన్ను పూజించుచున్నదని.

మహా—మీ రుభయులు నెక్కడ కలసికొంటిరి?

సగ—ఒక గ్రామమువద్ద భగ్నకుటీరమందు.

మహా—నాయనగారూ! ఇదియేనా మీయుదారమగు అత్యుదారమగు హిందూధర్మము? హిందువులు ముసల్మానులయెడ నింత ద్వేషభావము వహించుచున్నారు. కల్యాణియొక్క పతిభక్తికి ప్రతిఫలము ఆమెకు గృహబహిష్కారశిక్ష! నాయనగారూ! నన్ను ప్రాయశ్చిత్తము చేసికొనుమనుచున్నారా? తప్పక చేసికొందును. అయితే నేను ముసల్మాను నైతినని కాదు. ఒకప్పుడు నేను హిందువుగ నుండిన పాపమునకు ప్రాయశ్చిత్తము చేసికొందును.



సగ—మహాబత్ఖాన్!

మహా—నాయనగారు! ఇంతవరకు నాహృదయమున మిగిలియున్న సహానుభూతినికూడ నేడు పారదోలుచున్నాను. నేఁడు నేను పూర్తిగా ముసల్మాను నైతిని.

సగ—మహాబత్ఖాన్—

మహా—నాయనగారు! మీ రెఱిఁగియే యున్నారు. నేను చాలమితముగా మాట్లాడుచుందును. ఒకమారు ఏదేని ప్రతిజ్ఞ చేసిన నింక దానినివిడువను.

సగ—మహాబత్ఖాన్—

మహా—నాయనగారు! మీకు నాస్వభావ మెఱుఁగుదురు. మీ ఉపదేశములు, మీయాదేశములు, మీయుక్తులు అన్నియు వ్యర్థములు. (అచ్చటనుండి వెళ్ళఁబోవును.)

సగ—మహాబత్ఖాన్! నీవింత యధోగతిపాలైనచో పొమ్ము. చావుము. ఈఅంధకూపములో కుళ్ళిచావుము. మ్లేచ్ఛా! ధర్మభ్రష్టా! కులాంగారా!

[సగరసింహుఁడు వెళ్ళిపోవును. తర్వాత మహాబత్ఖాను ఉద్రేకముతో ఇటు నటు పచారుచేయును.]

మహా—(కొంచెము సేపాగి) ఇంతవిద్వేషమా! ఇంతయాక్రోశమా! ఇట్టిజాతి మాటిమాటికి మ్లేచ్ఛుల కాలితాపులఁ దిన్నదన్నచో నాశ్చర్యమేమి? ముసల్మానులు దీనికి బదులుగ వడ్డీతో సహా ఎక్కువ ద్వేషించుచుందురన వింతయేమి? ఇదియేనా వీరి యుదారము—అత్యుదారమునగు సనాతన హిందూధర్మము! ముసల్మాను ధర్మమందు ఏలోపము లేని యుండుఁగాక! ఈమాత్ర మౌదార్యము తప్పక యున్నది. అది అన్యమతస్థులను ఆనందముతో తనలో కలుపుకొనును. ఇంక హిందూధర్మమా? ఒక

మతాంతరుఁడు నూరేండ్లు తపస్సుచేసినను తనలో కలుపుకొనఁజాలదు. ఇంతగర్వమా! ఇంతఅహంకారమా! ఇంత స్పర్ధయా! నే నీయహంకారమును చూర్ణముచేసిన నెంతబాగుండును! (గజసింహునితో) మహారాజా! నేను మేవాడుపైకి దాడివెడలుదును. పొండు. బాదుషాగారితో నా యీవిన్నపము మనవిసేయుఁడు.

[గజసింహుఁడు చకితుఁడై చూచును]

మహా—మహారాజా! మీరాశ్చర్యపడెదరేల? నేను మేవాడుపై కెందుకు దాడివెడలుచున్నానో మీరెఱుఁగుదురా?

గజ—మీరు బాదుషాకు ఆజ్ఞాపాలకులును, విశ్వాసపాత్రులు నగుటచే.

మహా—కాదు. ఇందుకుఁగాదు. నేను హిందూధర్మమును సమూలముగ పెరికివేయుటకును మీజాతిసంతను విధ్వంసము చేయుటకును పోవుచుంటిని. నేనుదాని నామరూపము లుండనీయను. తెలిసినదా? మీరిపుడు బాదుషాగారితో వెళ్ళి విన్నవించుఁడు. [గజసింహుఁడు సలాముచేసి ఒకవైపుగను మహాబత్ఖాను మఱియొక వైపుగను పోవుదురు.]

---

పంచమదృశ్యము.

స్థానము—జహాంగీరు దర్బారు.

సమయము—ప్రభాతము.

(జహాంగీరు, సభాసదులు, హిదాయత్ అలీఖాను.)

జహాం—ఈఅవమానము ఎన్నటికిని మఱువఁబడదు. తుదకు పర్వేజునకేమి వచ్చినది.? వాని కీమాత్రమును శక్తిలేదా? వాఁడెందుకు ఓడినాఁడు?



హిదా—జహాంపనాహ్! నేను ప్రమాణపూర్తిగ చెప్పఁగలను. శాహజాదాకు ఓడవలయునను కోరిక ఇంచుకయు లేదు.

జహాం—మీరు వట్టి దండుగ చేటు. ఎందుకును కొఱగారు.

హిదా—నిశ్చయము. దేవరవారు సెలవిచ్చినది యథార్థము.

జహాం—హిదాయత్! నీవుయుద్ధములో ఖైదుకూడ అయితివి. తుదకు రాణా దయతలఁచి నిన్నువదలి పెట్టెను. అబ్దుల్లా యుద్ధము చేసి, చనిపోయినాఁడు. ఇంక చచ్చుట కూడ నీవలన కాలేదు.

హిదా—నిశ్చయము జహాంపనాహ్! నేను యుద్ధములో చావవలయుననియే యనుకొంటిని. కాని తమతో నేమి మనవిసేయుదును. నాపెండ్లాము ఇష్టపడలేదు.

జహాం—చాలు, మొదలకుము.

[సగరసింహుఁడు ప్రవేశించును]

జహాం—అదిగో! సగరసింహుఁడు. ఏమి రాజుగారు!

సగ—జహాంపనాహ్!

జహాం—మిమ్ము మేవాడురాణాగా చేసి చిత్తూరు పంపితిమి. అయితే మీరు చిత్తూరుకోట రాణా అమరసింహునకప్పగించితిరని వింటిని.

సగ—చిత్తము.

జహాం—ఎవరి హుకుముచే?

సగ—దాని కెవ్వరి హుకుమును ఆవశ్యకమని యెంచలేను.

జహాం—ఎందుకు?

సగ—న్యాయదృష్టిచే రాణాఅమరసింహుఁడే దానికి ప్రభువని యెంచితిని.

జహాం—మీ రెంచితిరా?

సగ—నిశ్చయముగ. అక్బరుబాదుషా న్యాయముగ పోరాడి చిత్తూరుకోట వశపఱచుకొనలేదఁట. ఆతఁడు మోసము చేసి జయమల్లుని చంపెనఁట.

జహాం—రాజా! మీరీన్యాయాన్యాయవిచారణ కెప్పటినుండి తొడఁగిరి?

సగ—ఏనాఁడు నేనొక నూతన ప్రకాశమును గనుగొంటినో నాటి నుండియు.

జహాం—నూతనప్రకాశము కనుగొంటిరా?

సగ—చిత్తము. నేనొక నూత్నప్రకాశముఁ జూచితిని. నాకనుల యెదుటనుండి యొక మాయాపటలము విచ్చిపోయినది. రామచంద్రభగవానుఁడు మొదలుకొని నేటివఱకుఁగల మేవాడు అతీతకాలమంతయు నాకనులయెదుట పొడగట్టినది. బాప్పారావల విజయగాథలు, చూడాజీ సమరసింహులు దేశమునకై ప్రాణత్యాగము సేయుట, కుంభుని శౌర్యము మున్నగుగొప్ప వింతలను గాంచితిని. వెంటనే పొగమంచు క్రమ్మినట్లయ్యెను. అందులోనే ప్రతాపసింహుని—నాసోదరుఁడు ప్రతాపసింహుని కరవాలము మెరయుచుఁ గనుపట్టినది. నన్ను నేను ధిక్కరించుకొంటిని.

జహాం—తర్వాత నేమయ్యెను?

సగ—అప్పుడు నాహృదయమున నీయూహ పొడఁగట్టినది. నేనును వారి వంశమువాఁడనే అయినను శత్రుపక్షముఁ జేరి నేనెంత యనుచితము చేసితిని? అని. అప్పటికిని నానైచ్యమును సమర్థించుకొనుటకై చాల ప్రయత్నించి చూచితిని. తర్వాత నొకనాఁడు మఱియొక యద్భుతదృశ్యమును జూచితిని. (గర్వముచే కనులవెంట నీరువచ్చును.)

జహాం—ఆఁ ఆఁ. చెప్పుఁడు. ఏమి చూచితిరి?



సగ—అది పూర్వకాలపు విషయముకాదు. ఐతిహాసిక వృత్తాంతము కాదు. పురాణ. గాథ కాదు. నాకొమారిత—ఈమొగలబానిస కొమారిత—స్వదేశమునకై జీర్ణవస్త్రములఁ దాల్చి అరణ్యములందు గ్రుమ్మరుట చూచితిని. ఇంక నేనో ఆదేశపు స్వాతంత్ర్యము హరించుటకు మొగలులతోఁ గలిసితిని. అప్పుడు నా కనులవెంట నీరు ప్రవహించెను. కంఠము సగద్గదమయ్యెను. ఒక్కమాఱుగ లజ్జ, గర్వము, ప్రేమ, భక్తి నాహృదయమునఁ బాదుకొనెను. నేనుండలేకపోతిని. వెంటనే చిత్తూరుకోట నాసోదరపుత్రున కిచ్చివచ్చితిని.

జహాం—రాజా! మీరు చచ్చుటకు సిద్ధమయే వచ్చితిరా?

సగ—పూర్తిగా నేను చచ్చుటకు సిద్ధమయేవచ్చితిని. పూర్వము నాకు చావనిన భయముగ నుండెడిది. కాని నాటినుండి నేనొక క్రొత్తపాఠము నేర్చుకొంటిని.

జహాం—ఏమి పాఠమది?

సగ—త్యాగపాఠము. లోకములో రెండురాజ్యములున్నవి. ఒకదాని పేరు స్వార్థము. రెండవదానిపేరు త్యాగము. ఒకదానికి జన్మస్థానము నరకము. రెండవదానికి స్వర్గము. ఒకదానికి రాజు సైతాను. రెండవదానికి ఈశ్వరుఁడు. నే నింతవఱకు స్వార్థరాజ్యమున వసించితిని. ఆనాఁడు త్యాగరాజ్యమును జూచితిని. ఆదేశమునకు రాజులు బుద్ధుఁడు, యేసుక్రీస్తు, చైతన్యుఁడు. అచ్చటి రాజ్యనీతి ప్రేమ, దయ, భక్తి. అచ్చటి శాసనము సేవ. శిక్ష దయ. బహుమానము ఆత్మత్యాగము. నేనునాటనుండియు ఆరాజ్యపు ప్రజనైతిని. ఏహస్తమున ఇదివఱకెన్నఁడును కత్తి పట్టలేదో ఆహస్తముననే నాఁడు ఆర్తరక్షణార్థము ఖడ్గము ధరించితిని. నాఁడు దొంగలకత్తిపోటు నాకు పూలచెండువలె నుండెను.

జహాం—తర్వాత నేమయ్యెను?

సగ—తర్వాత మృత్యువుచే నాపూర్వపాపములకు ప్రాయశ్చిత్తము చేసికొనుటకై యిచ్చటకు వచ్చితిని. పూర్వము మరణమన్న నాకు చాల భయముగ నుండెడిది. ఇప్పుడు భయములేదు. ఎవఁడు ప్రేమపూరిత హృదయుఁడో, ఎవఁడు త్యాగమంత్రదీక్షితుఁడో వానికి మరణమనిన భయమెందుకు?

జహాం—మంచిది. మీరు చచ్చుటకు సిద్ధముగుఁడు. ప్రహారీ!

[ప్రహారి (పహరేదారు) వచ్చును.]

సగ—జహాంపనాహ్! ప్రహారియెందుకు? వధకుఁడు చేయుపని నేనే చేసికొందును. (ఱొమ్ముపై కత్తితో పొడుచుకొని నేలపైఁబడును) ఈరక్తమే నాపాపమునకు ప్రాయశ్చిత్తమగుఁగాక!

---



# మేవాడు పతనము.

## చతుర్థాంకము

### ప్రథమదృశ్యము.

స్థానము:—ఉదయసాగరతీరము.

సమయము—వెన్నెలరాత్రి.

[రాణా అమరసింహుఁ డొక వేదికపైఁ గూర్చుండును. ఉదయసాగరపు తరంగములధ్వని వినిపించుచుండును. దగ్గరనొక చెట్టుపై కోయిల కూయుచుండును. రాణా కనులుమూసికొని యాకూత వినుచుండును. ఇంచుక దూరమున స్త్రీలు హోలిపాట పాడుచుందురు.]

గీతము.

పిల్లఁగ్రోవి నూదెహరి
ఇల్లువాకిళుల నొల్లమఱచి యా
వల్లవాంగనలు వనికి వెంటఁజన॥

౧ మందమారుతము వీచె, ఆనందమున
మత్తవిహగములు కూసె
సుందరకుట్మలములు వికసించెను
సుమకుంజమ్ములు శోభ వహించెను॥

౨ ఇందుకిరణ పరంపరలు, కాళిందీజలమున
నింపుమీఱగ విశ్రమించె

క్రిందుగ వేణువు "రాధరాధ" యని
యానందపుఁబలుకుల నమృతము గురిసెను॥

రాణా—వీరందఱు హోలీయాటలందును పాటలందును నిమగ్నులై యున్నారు. ఈసమయమున వీరిపాదములక్రింద భూకంపము గలిగినను వీరికి తెలియదు. ప్రపంచమెంతటిది! మానవునకిట్టి యాటవస్తువులనిచ్చి పొరపెట్టినది. లేనిచో ఈశూన్యధాత్రిపై నుండుట కెవ్వఁడేని యిచ్ఛగించునా? ప్రపంచము చాల మోసపుది. ఇదిగో! మానసివచ్చినది.

[మానసి వచ్చును]

మాన—నాయనగారూ! ఇంతదనుక మీరిచ్చటనే యుంటిరా? లోనికి రండు. ఇచ్చట చలివేయుచున్నది.

రాణా—కొంచెమాగుము. వెళ్ళెదము. ఈ ఉదయసాగరతీరమునఁ గూర్చున్న మనస్సు శాంతముగ నుండును. మానసీ!

మానసి—ఏమి నాయనగారూ!

రాణా—ప్రపంచము చాల మోసపుదని నీకెప్పుడేని తోఁచెనా?

మాన—మోసపుదా?

రాణా—అవును మోసపుది. మానవుఁడు చింతనాశక్తిచే అమరుఁడు కాకుండుఁగాక యని ప్రపంచము వాని మనస్సును వివిధ చింతలందు ముంచివేయుచున్నది.

మాన—కాదు తండ్రీ! ప్రపంచమంత చెడ్డదని నే ననుకొనను.

రాణా—ఈ వెన్నెలరాత్రిని చూడుము. ఈతరంగనినాదము వినుము. ఈస్నిగ్ధసమీరము ననుభవింపుము. ఈయీ విషయములనుండి వేఱుపఱచుటకై ప్రపంచము మానవుని క్షుద్రజీవిత సుఖదుఃఖముల వైపునకు బలాత్కారముగఁ గొనిపోవుచున్నది.



అమ్మాయీ! నేనిప్పుడీ ప్రపంచమును విడిచి వేసెదను. ఇది పట్టిమాయ.

మాన—ఇది మాయయేయనినను చాల మనోహరమగు మాయ. నాయనగారూ! నిజముగా నీబాహ్యప్రకృతి చాల అందమైనది. ఇది మనపై చాల దయవహింపుచున్నది. మనము భీషణగ్రీష్మతాపసంతప్తులమగునపుడు స్నిగ్ధగంభీరమగు గర్జన సేయుచు వర్షఋతువేతెంచి వర్షముచే మనలను జల్లపఱచును. కఠినశీతముచే మనము గజగజవణఁకునపుడు వసంతఋతువేతెంచి తన మందసుగంధిత సమీరముచే నాశైత్యావగుంఠమును వెడలించును. దుర్భరదినాతపముచే మనము పీడితులమగునపుడు నిశాదేవి తల్లివలె మెల్లగ నేతెంచి చల్లని తన తొడపై మనవ్యథితమస్తకమును జేర్చుకొనుచున్నది. ఇంతటితో దాని దయ ముగియలేదు.

రాణా—దాని కంతమెక్కడ?

మాన—మానవునిచింతాజగత్తున. నాయనగారూ! మీరీ సరోవరము చూచుచుంటిరా?

రాణా—అవును కుమారీ! చూచుచున్నాను.

మాన—దీనిపైఁ బ్రసరించు చంద్రికిరణములు కనిపించుచున్నవా?

రాణా—అవును కనుపించుచున్నవి.

మాన—మీరు దీనినిఁ బట్టుకొనఁగలరా?

రాణా—దేనిని?

మాన—ఈవెన్నెలను. ఈతరంగనినాదమును. అంధకారమున ఈజలతలము దాఁగునపుడు ఈసమీరము ఆగిపోవునపుడు ఈసౌందర్యము ఈ సంగీతము ఎచ్చటకుఁ బోవును.

రాణా—కుమారీ! ఎక్కడకుపోవునో నీవే చెప్పుము.

మాన—ఎక్కడకుపోవునో సరిగా చెప్పఁజాలను. కాని ఇది అంతరించ దనుమాట వాస్తవము. అది విరహిస్మృతియందును, కవి స్వప్నమందును, మాతృప్రేమయందును, భక్తుని భక్తియందును మానవుని కరుణయందును వ్యాపించియుండును. మానవుని యందలి సౌందర్యాంశమును, పృథ్వియందలి ఈకిరణములను, ఈ సుగంధమును, ఈ ఝుంకారమును, ఈనృత్యమును అన్నిటిని ప్రకృతియే నిర్మించినది. లేనిచో నీసౌందర్యమునకు సార్థక్యమెక్కడిది?

రాణా—అమ్మాయీ! మానవునియందు సౌందర్యమని చెప్పఁదగిన యంశ మేదేనియున్నదా? మన మొకకబళమును నోటఁబెట్టుకొనినంత లోకమంతయు లోభదృష్టితో దానినే కాంచును. తన కాకబళము లేకుండఁజేసితిమని యెంచును. ఔరా! ఇంతలోభమా! ఇంతఈర్ష్యయా! ఇంత ద్వేషమా!

మాన—ఇది మానవుల మానసిక వ్యాధి, ఈ వ్యాధియే లేకున్నచో మానవునిదయకు స్థానమే యుండదు. అప్పుడింక ఎవనిదుఃఖమును నివారించి, ఎవనిని ఉద్ధరించి మానవుఁడు సుఖించును? నాయనగారూ! ప్రపంచ మధమమని చెప్పి దానిని విడువవచ్చునా? కూడదు. మానవుఁడెంతయు దుఃఖితుఁడు. వాని దుఃఖమును తీర్చవలయును. ప్రపంచమెంతయు దీనమైనది. దాని నుద్ధరించవలెను.

రాణా—నీవుచెప్పినది చాల బాగుగ నున్నది. నాతల యిప్పుడుతిరుగుచున్నది. నేనేమియు విచారింపఁజాలను.

(నేపథ్యమున) మానసీ! మానసీ!

మాన—అమ్మా! వచ్చుచున్నాను. నాయనగారూ! మీరును రండు. చీఁకటిగానున్నది. (వెళ్ళును.)



రాణా—ఇదియొక స్వర్గీయకథ. ఒకనీహారిక. విశ్వసౌందర్యసారము. చక్కని గాలి వీచుచున్నది. ఆకసమున ఒక్క మేఘమును లేదు. ప్రపంచము కేవలము శాంతముగ నున్నది. ఉదయసాగరము నుండిమాత్రము సంగీత తరంగములు వచ్చుచున్నవి. ఎన్నియో బాలసావర్ణప్రభ లరుదెంచి యీ తరంగములందు స్నానము చేయుచున్నటులున్నవి. వాని మధురహాసములే యీతరంగములు. మ్రాఁకులయాకులు వెన్నెలలో ఆడుచున్నవి. గాలితో క్రీడింపుచున్నవి ఈమర్మరధ్వని వాని కేళీరవంబే. జడపదార్థములును సౌందర్యము ననుభవించుచున్నటులున్నవి.

[రాణిప్రవేశించును]

రాణి—మహారాజా!

రాణా—కొంచెమూరకుండుము. నేనొకస్వప్నము గాంచుచుంటిని:

రాణి—మేలుకొనియేనా? ఇంక నేను చెప్పునది లేదు.

రాణా—పోనిమ్ము. మోహాభంగమైనది. ఇంక చెప్పుము. ఏమైనది?

రాణి—ఇంకచెప్పెడి దేమున్నది? ఈకాలముపిల్లలు తల్లిదండ్రులమాటలు విననే వినరు. ఆనాడు గోవిందసింహుని కొడుకును, కూతురును తండ్రి కొంచ మేదో అన్నాడని ఇల్లువిడిచి వెళ్ళిపోయిరి. నిన్న—

రాణా—మరల ఆప్రపంచపు గోలయే. పాడిన దేపాట పాచిపండ్లదాసరీ మరల సంసారచక్రకర్కశస్వరమే.

రాణి—ఈకలికాలపు పిల్లల కేమివచ్చినదో తెలియదు. మాకును బాల్యావస్థ యుండెడిది.

రాణా—అప్పుడు సత్యయుగమై యుండవచ్చును. తల్లులు సత్యయుగమందును, కూతుళ్ళు కలియుగమందును బుట్టుటయే మనము చాలకాలమునుండి చూచుచున్నాము. మంచిది. ఇవియన్నియు నట్లుంచుము. నేనిపుడు చేయవలసిన దేదియో చెప్పుము.

రాణి—మానసికి పెండ్లి చేయఁదలఁచుకొనినచో నిప్పుడే చేయుఁడు. లేకున్న ఇఁకముందు దానికి పెండ్లికాదు.

రాణా—నాకును అట్లే తోఁచుచున్నది. మానసి పెండ్లిచేసికొనుటకు గాను పుట్టలేదనియే నాతలంపు.

రాణి—చాలు. చాలు. తెలిసినది. మీలక్షణములుకూడ ఏమియు బాగుగనుండలేదు. మీరు మేలుకొనియే కలగనుచున్నారు.

రాణా—నేను కలనైనను గనుచున్నాను. నీవదియును లేదు.

రాణి—ఇప్పుడేమియగును?

రాణా—ఎవ్వరికి తెలియును? ఏమగునో చూడుము.

రాణి—ఏమి చూచెదను? జోధపురము వెళ్ళినవాఁడు ఇంకను రాలేదు. సత్యవతి కొడుకును జోధపుర మంపితిరి. వాఁడెక్కడ తిరిగి వచ్చును!

రాణా—అరుణసింహుఁ డచ్చటనుండి వచ్చినాఁడు.

రాణి—వచ్చినాఁడా? వివాహ మెప్పటికి స్థిరమైనది?

రాణా—మహారాజు మనకొమార్తెను తనకొడుకునకు జేసికొనఁడు.

రాణి—ఎందుకు?

రాణా—ఆయనకు మనపైఁగోపముఁట.

రాణి—ఎందుకు?

రాణా—యుద్ధములో మనము గెలిచితిమి. ముగలులోడిరి. ఇదియే కారణము.

రాణి—మానసికి పెండ్లికాదని నేను మొదటనే చెప్పితిని. ఇంక పెండ్లి అయినట్లే. ఇట్టిచిక్కులలో నెచ్చటనైన పెండ్లియగునా?

[illegible]—నేను నిదియే యనుకొంటిని. మానసి పెండ్లికై జన్మించలేదు. ఇదియొంతయు భ్రమ.



రాణి—భ్రమయెట్లు?

రాణా—జోధపుర రాజపుత్రునకు మానసి నీయవలెననుకొనుట భ్రమ. ఇంతసైన్యమునుదీసికొని మొగలులపైకి దాడివెడలుట భ్రమ. నీకును నాకును పెండ్లియగుటయు భ్రమయే. మనరాజ్యము. మనజీవితము అంతయు భ్రమయే.

రాణి—మీరు నన్ను వివాహమాడక యుండినచో అదియు నొక భ్రమయే యయ్యెడిదని తలఁచెద. నవ్వెదరేల?

రాణా—మహారాజు ఆగ్రా వెళ్ళిరఁట.

రాణి—ఎందుకు?

రాణా—బాదుషాకు కొండెములు సెప్పి మేవాడుపైకి దండెత్తింపఁ జేయును.

రాణి—మరలనా?—మీరు నవ్వుచున్నారు. ఇదియు నవ్వఁదగినమాటయేనా?

రాణా—ఇంతకంటె నవ్వఁదగిన విషయమేమున్నది? రాణీ! నీవుకూడ నవ్వుము.

రాణి—మీతోఁబాటు నేను కూడ పిచ్చిదాననగుదునా?

రాణా—చాల మంచిసంగతి రాణి! ఈమారు సర్వస్వము నష్టమగును.

రాణి—ఏమైన నగుఁగాక. నేనిది యేమియు వినను. ఈవివాహము తప్పక జరుగవలయును.

రాణా—ఎట్లు?

రాణి—మీరు మార్వాడపైకి దాడివెడలుఁడు.

రాణా—రాణీ! ఇన్నినాళ్ళకు నీవు క్షత్రాణివగుటకు ప్రమాణము దొరికినది. శక్తికన్న భక్తి యెక్కువదని నీవెఱుఁగుదువు. జోధపుర మహారాజునందుఁగల మొగలభక్తి మనయందు లేదు. మనయందు శక్తిమాత్రముండెడిది. అదియును అయిపోయినది.

రాణి—అయితే ఈ అవమానము మెదలక సహించెదరా?

రాణా—లేక చేయునదేమి? మెదలక సహింపలేకున్న ఏడ్చెదము. మొత్తుకొందుము. వంటఅయినదా లేదా? భయపడవలసిన విషయము లేదు. ఈమాఱు సర్వస్వము నష్టమగును. ఇంత క్షుద్రత్వముగలజాతిని ఈశ్వరుఁడే రక్షింపలేడు. ఇంక మనుష్యుఁడేమి చేయును. పొమ్ము.

రాణి—అట్లయితే ఇందు మీ అపరాధ మేమి యున్నది?

రాణా—అపరాధమా? నేనును మహారాజును ఒకజాతియందు పుట్టుటయే నాయపరాధము. పడవలో కూర్చున్నవారిలో నొకని దోషముచే పడవమునిగినచో నిర్దోషులు నిరపరాధులు నగు తోడివారును దానితో మునిగెదరు. పొమ్ము.

[రాణి నిష్క్రమించును.]

రాణా—ఆకాశమెంత నల్లగానున్నది?

[రాణా వెళ్ళును. మానసి ప్రవేశించును.]

మాన—అజయసింహుఁడు దేశాంతరము వెళ్ళినాఁడు. వెళ్ళుటకు ముందు నాతో ఒకమారు కలిసియేని పోలేదు. తుదకు ఒక చీటి ముక్కయందైనను "నేను దేశాంతరము పోవుచున్నాను. ఇదియే తుదివీడ్కోలు" అని వ్రాసియేని పంపలేదు. అజయా! అజయా! నీవు చాల నిష్ఠురుఁడవు. నేను నీకై శోకింపను. చంద్రునిజ్యోతి ఇంతక్షీణించినదేమి? ఉదయసాగరము హఠాత్తుగ నింత మలిన మేలయయ్యెను? ప్రకృతి ముఖమందలి యీ హాసమెచ్చటకు పోయెను?

గీతము.

ఔర! చంద్రవదనము నాకతిమోదము గూర్చున్
ధారుణి వెలయింపఁజేయుఁ దనమధురాకారమునన్



విమలచారు చంద్రికలను వెలయింపఁగఁ జేయున్
అమిత తిమంబొలయఁ జేయు నగపడకయ యున్నన్
చందురుఁడేగినను కుసుమసౌరభం బేగలేదు
ఎందుకో కోయిలల కూఁత లేగలే దెఱుఁగరాదు
ముదముగూర్పదగిన వస్తువులు చాలగనున్నన్
అదిలేకుండిన లోకంబంత శూన్యముగఁ దోఁచుఁ॥

---

### ద్వితీయదృశ్యము

స్థానము—మేవాడు ఒద్ద మహాబత్ఖానుని డేరా.

సమయము—ప్రభాతము.

(మహాబత్ఖాను, బాదుషాకొడుకగు పర్వేజు, గజసింహుఁడును నిలచి మాటాడు చుందురు.)

మహా—శాహజాదా సాహెబ్! ఇంక మీరు ఆలస్యము చేయకుడు. ఈలక్షసైన్యమును దీసికొని చిత్తోరు కోట ముట్టడింపుఁడు.

పర్వే—చాలమంచిది. (వెళ్ళును.)

మహా—మహారాజా! మీరు మేవాడుగ్రామముల నొకవైపునుండి తగులఁబెట్టుఁడు. ఎవ్వరేని మిమ్మునడ్డగించుచో నఱికివేయుఁడు. మీ రీపనిలో చాల సమర్థులును జాగరూకులునని నేనెఱుంగుదును. కాని స్త్రీలయెడలమాత్రము నెట్టిద్రోహమును జరుగనీయకుడు.

గజ—మంచిది. మేవాడులో నొక్క రాజపుత్రునికూడ మిగిలించను.

మహా—అవును మహారాజా! ఈవిషయము నేను నెఱుగుదును. రాజపుత్రులపై సాక్షాత్తు తమసోదరుల కున్నంత ద్వేషము మహమ్మదీయులకుఁగూడ లేదు. నేను పూర్వచరిత్రములు బాగుగ చదివి తెలిసికొంటిని. హిందువులకు తమసోదరులయెడల ద్రో



హాము చేయుటకును వారిని హింసపెట్టుటకును ఉన్నంతయుత్సాహము మఱియేపనియందును లేదు. రాజపుత్రులయూపు మీరు మాపునటుల మరియెవ్వరును మాపఁజాలరని నేను బాగుగ నెఱుఁగుదును. కనుకనే మీకీపని అప్పగించితిని. ఇంక మీరు వెళ్ళి మీపని ప్రారంభింపుఁడు.

గజ—చాలమంచిది. (వెళ్ళును)

మహా—హిందువులారా! రాజపుత్రులారా! మేవాడురాజ్యమా! జాగ్రత్త! ఇదియొకజాతి వేఱొకజాతిని డీకొనుటగాదు. ఇది ఒకమతము వేఱొకమతమును డీకొనుట. ఏదిగెలుచునో చూతము. (వెళ్ళును.)

---

## తృతీయదృశ్యము

స్థానము—ఉదయపుర రాజప్రాసాదము.

సమయము—రాత్రి.

[రాణా అరమసింహుఁడు. సత్యవతి.]

రాణా—ఈమాఱు మహాబత్ఖాను యుద్ధమునకు వచ్చెనా?

సత్య—అవును మహారాజా! అతనివెంట లక్షకెక్కువగ సైన్యమున్నది.

రాణా—(దీర్ఘనిశ్వాసమువిడిచి) సత్యవతీ! నేనుమొదటనే చెప్పితినిగదా!

సత్య—ఏమి?

రాణా—ఈమాఱు సర్వస్వము నష్టమగునని రాజపుత్రానా అంతయు పోయినది. ఇంకనొక మేవాడు తలయెత్తుకొని యుండగలదా? విధాతయిదియోర్చునా? ఈమాఱు మేవాడును పోవును. సత్యవతీ! నీవు తలయేల వంచుకొంటివి? ఇదిచాల ఆనందింపఁదగిన విషయము.



సత్య—మహారాజా! ఇదిఆనందింపఁదగినవిషయమా?

రాణా—ఎందుకుకాదు? మంచానపడి మేవాడు ఇంక నెంత కాలము మృత్యువేదనసహించును? ఈమాఱు దానివేదన కంతమగును.

సత్య—అయితే మహారాజపుతు యుద్ధముచేయరా?

రాణా—ఎందుకు చేయరు? యుద్ధముచేయక ఇంకచేయునదేమి? ఈమాఱు నిజమైన యుద్ధము జరుగును. ఇంతదనుక జరిగినది బాలుర యాటవంటిది. ఈమాఱు మహానందమగును. మహావిప్లవమగును. ఈమాఱు అన్నదమ్ములకు యుద్ధము. భారతవర్షమంతయు నాతమాషాచూచును.

సత్య—మహాబత్ఖాను వెంట జోధపురము మహారాజు గజసింహుఁడును వచ్చెనఁట.

రాణా—అట్లఁలనా? మంచిది. అయితే ఆయన మన యాహ్వానము నంగీకరించెనా? మహారాజు మన యాహ్వానము నంగీకరింపని యంతకోపము వహించునాయని నేను మొదటనే అనుకొంటిని.

సత్య—ఆ రాజపుత్రకులాంగారము—

రాణా—ఏమంటివి? ఇంక నెప్పుడు నట్లనవలదు. అతఁడు పరమభక్తుఁడు. పరమవైష్ణవుఁడు. "ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా" యని ఇంతవఱకు నాయేకేశ్వరుని నమ్మని మనమే మేవాడు వంశమునకు కులాంగారులము—గజసింహుఁడు! ఎంతచక్కని పేరు. ఒకదానియందే గజము, సింహము! తొండమును ఆడించును, జూలును విసురును. మంచిది.

సత్య—రాజపుత్రుఁడై రాజపుత్రులతోఁ బోరుటకు వచ్చినాఁడు.

రాణా—అతఁడు లేకున్న యజ్ఞధ్వంస మెట్లు పూర్తియగును? శివుని వెంట నందీశ్వరుఁడు, భృంగీశ్వరుఁడు లేకున్న పని యెట్లుజరుగును? శాస్త్రములెన్నడు నబద్ధములుకావు.

సత్య—ఔరా! దురదృష్టవంతమగు మేవాడురాజ్యమా!

(కన్నీరు తుడుచుకొనును)

రాణా—సత్యవతీ! విధాత భారతవర్షమును సృజించిననాఁడే. ఆత్మీయ సంతతిచేతనే దానిసర్వస్వము నాశముకాఁగలదని దాని నొసటను వ్రాసిపెట్టినాఁడు. తక్షశిలను స్మరింపుము. జయచంద్రునిమాట జ్ఞప్తికిదెచ్చుకొనుము. మానసింహ శక్తసింహుల సంగతి యూహింపుము. వారి తర్వాత మహబత్ఖానును గజసింహునిఁజూడుము. సాదృశ్యము బాగుగనున్నదిగదా? అక్షరము అక్షరము పూర్తిగపోలుచున్నవిగదా? దైవలిఖిత మెన్నటికినితప్పదు. పొమ్ము సత్యవతీ! నేనింక సైన్య మాయత్త పఱచెదను.

[సత్యవతి వెళ్ళును.]

రాణా—జాతియేదేని నాశమగుచో తనదోషముచేతనే నాశమగును. ఇట్లే నాశమగును. జాతి నిర్జీవమగునపుడు వ్యాధిముదురును. ఇంటింటను ఇట్టివిభీషణులు పుట్టుదురు.

[గోవిందసింహుఁడు ప్రవేశించును]

రాణా—గోవిందసింహాజీ! ఏమిసమాచారము?

గోవిం—మహారాజా! మహబత్ఖాను నిరపరాధులగు గ్రామవాసుల కొంపలు తగులఁబెట్టుచున్నాఁడు.

రాణా—తగులఁబెట్టుచున్నాఁడా? ఉచితమే చేయుచున్నాఁడు.

గోవిం—ఉచితమా? మనముదీనికి బదులు తీర్చుకొందుము.

రాణా—అవశ్యము. లేకున్న మేవాడుధ్వంసము పూర్తియెట్లగును?

గోవిం—మహారాజా! యుద్ధముచేయుదముగదా?

రాణా—యుద్ధముచేయకున్న మఱియేమిచేయుదము. గోవిందసింహాజీ! రాజపుత్ర సైన్యమెంతయుండును? అయిదు వేలు యుండును గదా? అదియేచాలు. చచ్చుటకింతకన్న నెక్కుడు సైన్యమక్కఱలేదు. మహబత్ఖానుని సైన్యము సుమారు ఒకలక్షయుండును గదా? ఉండనిమ్ము. దానిచే నయ్యెడిదేమి?



గోవిం—రాణాగారూ!—(తలవంచుకొనును)

రాణా—ఏమి గోవిందసింహాజీ! మీరును తలవంచుకొంటిరి? లెండు. మేలుకొనుఁడు. నేఁడు చాల ఆనందమైనరోజు. ఇంటింటను మంగళవాద్యములు మ్రోయనిండు. సర్వత్ర ఎఱ్ఱజెండాలు ఎగురనిండు. ఉదయపురపు కోటపై మేవాడు రక్తధ్వజ మొకమాఱు బాగుగ నెగురనిండు. కనులారఁజూడుఁడు. మఱల రెండునాళ్లకు దానినిఁజూడఁజాలరు.

గోవిం—మహారాజా! మేము యుద్ధము చేసెదము, చచ్చెదము. కాని అప్పటికిని మాతృభూమిని రక్షింపఁజాలమనియే దుఃఖము.

రాణా—దీనికి దుఃఖమేందుకు? ఎవ్వరితల్లియైని చావక యుండునా? మనతల్లియుఁ బోవును. ఆమె వెంట మనమును పోదుము.

గోవిం—మహారాజా! అట్లయినఁగాక.

రాణా—అవును. అట్లయగును. గోవిందసింహాజీ! ఇటురండు. చచ్చుటకు ముందు ఒకమారు కవుఁగలించుకొందము. (కవుఁగలించుకొందురు.) మంచిది. ఇంక పొండు. మరణమునకు సన్నద్ధులగుడు.

(గోవిందసింహుఁడు పోవును. రాణిప్రవేశించును.)

రాణా—రాణీ! బాగుగ ఉత్సవముచేయుము. ఆనందించుము.

రాణి—మానసికి పెండ్లి నిశ్చితమయ్యెనా?

రాణా—మానసికిఁగాదు. మేవాడకు.

రాణి—మేవాడకు పెండ్లియా! ఎట్లు?

రాణా—ఈమాఱు విధ్వంసముతో మేవాడకు పెండ్లియగును.

రాణి—దీనియర్థము?

రాణా—చాలమంచి యర్థముగలదు. "ఈమాఱు అన్నదమ్ములకు యుద్ధము. బాగుగ ఉత్సవముచేయుము. ఈమారు పెండ్లియగును!—వినాశముతో—విధ్వంసముతో! (వెళ్ళును)

రాణి—ఇప్పుడు వీరికిపిచ్చి పూర్తిగాఎక్కినది. నేను మొదటనే యనుకొంటిని. ఇంకనేమున్నది! ఇంటిల్లిపాటికిపిచ్చి! ఇంక నేనేమి చేయుదును?

మానసి—(ప్రవేశించి) అమ్మా! నాయన కేమివచ్చినది? వారు పిచ్చివారువలె ఇటునటు తిరుగుచున్నారు. వారికేమి?

రాణి—ఇంక వచ్చెడిదేమున్నది? వారికి పిచ్చియెక్కినది. వెళ్ళిచూచెదను. (వెళ్ళును)

మాన—ఈమహాబత్ఖాను రాజపుత్రుఁడే! ఈగజసింహుఁడును రాజపుత్రుఁడే! ఇంతఈర్ష్య! ఇంతద్వేషము! ఓసీ అధమజాతీ! నీవే పతితవుగాకున్న నింకనెవ్వరయ్యెదరు? అన్నదమ్ములందే ఇట్టివైరమున్నపు డింక నెవరుతీర్చఁగలరు?

---

## చతుర్థదృశ్యము.

స్థానము—మేవాడలో నొకగ్రామమార్గము.

సమయము—సాయంకాలము.

[సత్యవతియు, అరుణుఁడును నడచుచుందురు

సత్య—అరుణా!

అరు—ఎందుకమ్మా?



సత్య—నడచుట కష్టముగా నున్నదా?

అరు—లేదమ్మా!

సత్య—నేడు మనమీయూరిలో ఆగుదము.

అరు—ఇక్కడ నేమిపని?

సత్య—వీరితో రమ్మని చెప్పవలయును.

అరు—ఎచ్చటకు?

సత్య—యుద్ధమునకు. మేవాడువీరులెల్లరు నశించిరి. ఇప్పుడు క్రొత్తవీరులు సృజింపఁబడవలెను. పూజకు క్రొత్తయేర్పాటు చేయవలయును. రమ్ముపోదము. సంధ్యాకాలమగుచున్నది.

(ఇద్దరు వెళ్లెదరు.)

[కొందఱు గ్రామస్థులు ప్రవేశించెదరు]

౧ వ వాఁడు—ఇంతమంచిదేశము. ఈమారు అంతయు నశించినదనుకొనుము.

౨ వ—ఈమాఱు సాక్షాత్తు మహాబత్ఖానే వచ్చినాఁడు. ఇంక మనకు బ్రతుకులేదు.

౩ వ—మహాబత్ఖాను యుద్ధము బాగుగ నెఱుఁగునా?

౨ వ—ఇంక నడుగవలయునా?

౪ వ—ఏమి! అతఁడు యుద్ధమెప్పుడు నేర్చుకొనినాఁడు? నిన్న కాక మొన్న అతఁడు నాకండ్లముందు పుట్టినాఁడు.

౨ వ—ఇట్లు ప్రతివారును ఎవరి కండ్లముందో పుట్టుచునే యుందురు. అందుచే వారు యుద్ధమెఱుఁగని వారా?

౪ వ—అబ్బాయీ! నీవు పెద్ద తర్కశాస్త్రవేత్తవు.

౧ వ—అదిగో చూడుము. ఆయూరు తగలఁబడుచున్నట్టు లున్నది.

అందఱు—ఎక్కడ?

౧ వ—అదిగో చూడుఁడు. పొగవచ్చుచున్నది.

౨ వ—అదియా? అదిమబ్బు.

౩ వ—మబ్బు నేలమీఁదనుండి పైకెగిరిపోవునా? మబ్బు గిరగిర తిరుగునా? అది యెట్లు తిరుగుచున్నదో చూడుము.

౨ వ—అయితే దుమ్ము అయియుండును.

౩ వ—అవును. దుమ్మురంగు నల్లగానుండును కాఁబోలు.

౨ వ—బాబూ! నీవు పెద్ద తార్కికుఁడవుగా నున్నావు.

౧ వ—అదిగో ఆగ్రామస్థుల రోదన ధ్వని వినిపించుచున్నదా?

అందఱు—అవును. అవును.

౨ వ—అరే జనులు పాడుచున్నారేమోరా. లేక గాడిద అఱచుచున్నదేమో.

౩ వ—అవును రెండు ధ్వనులు నొకవిధముగనే యుండును కాఁబోలు.

౧ వ—అదిగో చాలమంది గ్రామస్థులు ఏడ్చుచు నిటేవచ్చుచున్నారు.

౩ వ—వారిని సిఫాయీలు తుపాకులు వేయుచు తఱుముకొని వచ్చుచున్నారు.

(తెఱలో—దండాలు బాబో దండాలు, చంపకుఁడు.)

౧ వ— అయ్యో పాపము వీరు—

(కల్యాణియు అజయసింహుఁడును ప్రవేశించెదరు.)

అజయ—అయ్యా! మీరు నిలఁబడి ఏమి చూచెదరు? కొంచెము వీరిని రక్షింపుడు.

అందఱు—మేమేమి చేయుదుము?

అజయ—కదలక నిలఁబడి ఈ యన్యాయము చూచెదరా?

౨ వ—అయితే మమ్మును వారికై ప్రాణము లీయమందురా? చాలు అబ్బాయీ! పాఱిపోదమురండు వారు ఇటే వచ్చుచున్నారు.



కల్యా—పాఱిపోయిన రక్షింపఁబడుదురా? లేదు. మీవంతునువచ్చును. మీయిండ్లను తగులబెట్టఁబడును. మీలోనొక్కరును బ్రదుకరు.

౧ వ—తగులఁబెట్టినప్పటిమాట చూచెదములెండు. ఆయువుండఁగా నెవ్వరేని చచ్చెదరా? అదిగో వారు వచ్చినారు. పాఱిపొండు పాఱిపొండు.

[అజయుఁడు కల్యాణియుఁదక్క నందఱు పాఱిపోవుదురు.]

అజ—ఈ యాక్రందనము మఱియు సమీపించుచున్నది. ఇదిగో తుపాకులమోఁత! కల్యాణీ! నీవొకప్రక్కకు తొలఁగియుండుము. నేను వీరిని రక్షించెదను.

కల్యా—అన్నా! వీలగునంతవరకు వీరిని రక్షింపుము.

[కల్యాణి కొంచెముదూరము పోవును.

అజ—కల్యాణీ! నేను వీరిని రక్షింపగలనో లేనో చెప్పఁజాలను, కాని వీరికై ప్రాణములీయగల్గుదును. మానసియొద్ద నేనునేర్చుకొనిన మహామంత్రమును నేఁడు ప్రయోగించెదను. అదిగోవారు వచ్చుచున్నారు. (ఒఱనుండి కత్తిదూయును.)

[రోజాను నిద్దఱు గ్రామస్థులువచ్చెదరు. వారివెనుక ఖడ్గపాణులై ఇద్దరు మొగలుభటులు వచ్చెదరు.]

గ్రామస్థులు—మహారాజా! మమ్ము రక్షింపుఁడు. రక్షింపుఁడు. (అజయుని కాళ్ళపైఁ బడుదురు.)

అజ—(భటులతో) జాగ్రత్త!

౧వ భటుఁడు—కదలకుము. (కత్తియెత్తును.)

(అజయుఁడు వానినికత్తితోఁగొట్టి క్రిందఁబడవేయును. తక్కినవారు అజయునితో బోరాడుదురు. మొగలుభటులు క్రమముగ క్రిందఁబడుదురు. మఱల కొందఱుభటులు వచ్చెదరు.)

అజయు—కల్యాణీ! ఇంక రక్షింపఁజాలను. పాఱిపొమ్ము.

కల్యా—అన్నా! నీవిట ప్రాణమిచ్చువాఁడవును, నేను పాఱిపోవు దాననునా?

(కల్యాణి ముందుకుఁ బోవును, అప్పుడే మొగలభటుని తుపాకిదెబ్బచే అజయుఁడు పడిపోవును.)

కల్యా—(పరుగెత్తుకొని వచ్చి) అన్నా! అన్నా!

౨వ భ—ఈమెయెవరు? ఈమెను పట్టుకొనుఁడు.

౩వ భ—వద్దు, స్త్రీలపై నెట్టియన్యాయమును చేయఁగూడఁదని సేనాపతిగారి హుకుము.

అజ—కల్యాణీ! నేనుచనిపోవుచున్నాను. ఈశ్వరుఁడు నిన్ను రక్షించుఁగాక! (గిలగిల కొట్టుకొని చనిపోవును)

కల్యా—(ఏడ్చుచు) అన్నా! అన్నా! ఎక్కడకుపోతివి?

(అజయునిశవముపైఁబడును.)

౪ వభ—ఇంక నెక్కడకుపోవును? అందఱును ఏదోఒకనాఁడు పోవు చోటికే.

కల్యా—(శాంతించి) లేదు. నేనుశోకింపను. క్షత్రియవీరా! నీవు నీకర్తవ్యమును నెఱవేర్చితివి. నీవు దీనరక్షణార్థము ప్రాణములు విడిచితివి. ఇంకవీరో! వీరు రక్తలోలుపులగు హింస్రపశువులు. వీరు నిర్దాక్షిణ్యకముగ ఇతరుల ఇండ్లు తగులఁబెట్టుచున్నారు. దీనులగు గ్రామవాసులను వధించుచున్నారు. ఈశ్వరా! వీరికి నరకమందును స్థానములేకుండుఁగాక!

౧ వభ—ఇందు మాదోషమేమున్నది? మా సేనాపతియాజ్ఞ ప్రకారము మేము జనులయిండ్లు తగులఁబెట్టుచున్నాము. జనులను వధించుచున్నాము.



కల్యా—మీ సేనాపతి యెవరు?

౨ వభ—నీకు తెలియదా? మహాబత్ఖాను.

౩ వభ—పద. పోనిమ్ము.

కల్యా—వారియాజ్ఞయా? కాదు. వట్టిది.

౪ వభ—పద. పద.

కల్యా—ఆగుఁడు నేనును వచ్చెదను.

౧వ భ—నీవెక్కడకు వచ్చెదవు?

కల్యా—మీ సేనాపతి యొద్దకు.

౨వ భ—నిన్ను అక్కడకు తీసికొనిపోయి మేమింక—

౩వ భ—చివాట్లు తినమా?

౪వ భ—ఆమె స్వయముగా రాఁగోరినచో మన దేమున్నది! తీసికొని రండు.

౧వ భ—మంచిది. రమ్ము.

కల్యాణి—నడువుఁడు.

---

## పంచమ దృశ్యము.

స్థానము — ఉదయపురము రాజసభ

సమయము — ప్రభాతము.

[రాణా, గోవిందసింహుఁడు, సామంతులు]

రఘువర—మహారాజా! చేతనయినంతవఱకు మనము యుద్ధము చేసితిమి, ఇంక మనవలన కాదు.

రాణా—కాదు రఘువరా! మనము యుద్ధము చేసితీఱవలయును. దీనికి తిరుగులేదు. సేన సిద్ధముగ నున్నదా?

కేశవ—మహారాజా! సేన యెక్కడనున్నది? మేవాడఅంతయు పోగు చేసినను అయిదు వేలైనను అవునోకాదో. ఈమాత్రపు సైన్యము దీసికొని మనము ఒకలక్ష సైన్యముతో పోరాడఁగలమా?

రాణా—ఇందుసంశయ మేమియులేదు. మన అయిదు వేల సైన్యము అయిదులక్షలకు సమానము.

కేశవ—మహారాజా? మనమిపుడు మొగలులతో సంధి చేసికొనుటయే మంచిది.

రాణా—కాదు. ఇది ఎన్నటికిని కాఁజాలదు. నేను సంధిచేయవలె నన్నపుడు నామాట యెవ్వరును వినలేదు. అప్పుడు మొగలులు వారంతట వారే సంధికిచ్చగించిరి. ఇప్పుడా సమయము పోయినది. ఇప్పుడుమనము సంధికై మొగలులఁ బ్రార్థింపఁజాలము.

కేశవ—కాని—

రాణా—ఇప్పుడీ విషయ మెవ్వరు నేమియు చెప్పవద్దు. ఇప్పుడేమియు నుపాయము లేదు. ఇప్పుడు యుద్ధము చేయవలెను, చావవలెను. రెండేపనులు. ఏమి గోవిందసింహాజీ?

గోవిం—అవును మహారాజా! మనము ప్రాణమిచ్చెదముగాని మానమీయము.

రాణా—మీరుచెప్పునది బాగుగనున్నది గోవిందసింహాజీ! మనము ప్రాణమిచ్చెదము గాని మానమీయము.

రఘు—మహారాజా—

రాణా—ఇప్పుడు నేనేమియు వినను. యుద్ధమే చేయఁగోరెద—యుద్ధము. సైన్యము సిద్ధముచేయుడు. మేవాడ రక్తధ్వజమెత్తుఁడు, రణభేరి మ్రోగింపుఁడు, పొండు సిద్ధముకండు.

[రాణాతప్ప తక్కినవారు వెళ్ళెదరు]



రాణా—మేవాడ్! సుందరమేవాడ్! నేఁడు నీవెంతయందముగఁ గనుపట్టుచున్నావు. ఈయందమును మే మిదివరకెన్నఁడును చూడలేదు. నీవస్త్రములన్నియు చినిగిపోయినవి. శరీరమంతయు దుమ్ముకప్పినది. వెండ్రుకలు విరఁబాటియున్నవి. నిన్నీ వేషముననే వారు వధ్యస్థానమునకుఁ గొంపోవుచున్నారు. అమ్మా! యేమి నీ యీ సౌందర్యము! నేఁడు ఇన్నినాళ్లకు నిన్ను గుర్తించితిమి. ఇంతదనుక నీసౌభాగ్య సూర్యకిరణములు నిన్ను కప్పియుంచెను. ఇప్పుడాసూర్యుఁ డస్తమించినాఁడు. కనుక నేఁడునీయా యాకాశమందు నెట్టియద్భుతప్రకాశమును గాంచఁగలుగుచున్నాము! ఏమి యీజ్యోతి! ఏమి యీనీలిమ! ఏమి యీప్రశాంతమహిమ!

---

## షష్ఠదృశ్యము

స్థానము—మహాబత్ఖానుని శిబిరము

సమయము—ప్రభాతము

[మహాబత్ఖాను, గజసింహుఁడు నిలిచియుందురు.]

గజ—రాణా ససైన్యముగ యుద్ధమునకు వచ్చినాఁడా?

మహా—అవును మహారాజా! కాని ఆయన ఒక్కఁడే మరలతిరిగివెళ్ళినాఁడు. ఆయన అయిదు వేల సైనికులలో నాల్గువేలు యుద్ధమున జచ్చిరి.

గజ—అయిదు వేలసైన్యమును మాత్రము దీసికొని లక్షసైన్యముతో యుద్ధము చేయవచ్చెనా? వింతసాహసము!

మహా—అవును సాహసమే. మహారాజా! నేను నేఁడాతని విషయమునకై చాల గర్వపడుచున్నాను.

గజ—అవును ఖాన్‌సాహెబ్! గర్వపడవలసిన విషయమే.

మహా—కాని నేనెందుకు గర్వపడుచున్నానో మీరు ఊహింపనేని చాలరు. మీరు దానికి కారణమెఱుఁగుదురా?

గజ—చెప్పుడు.

మహా—నేను ముసల్మాను నయినను రాజపుత్రజాతికి చెందినవాఁడ నగుటకును, అమరసింహునికి సోదరుఁడ నగుటకును గర్వపడు చున్నాను. అయిదు వేలసైన్యముతో మన లక్షసైన్యముపైకి యుద్ధమునకు వచ్చెనన్న అతఁడు ప్రాణమర్పించుటకే వచ్చినాఁడన్నమాట. తనదేశమునకై ఇట్టిప్రాణత్యాగము, ఇట్టినిర్భయత, ఇట్టి సాహసకృత్యము రాజపుత్రుఁడే చేయఁగలఁడు. నేనును ఆరాజపుత్రజాతివాఁడనే.

గజ—నిశ్చయము, నిశ్చయము.

మహా—మీరును ఆరాజపుత్రులే. మీరును గర్వపడవచ్చును. కాని మీరుపతితులయినారు. కాన సిగ్గుచే తలయువంచుకొనుఁడు. మీరు ఎట్టివారో ఏమిఅయితిరో ఊహించుకొనుఁడు. నామాట అట్లుంచుడు. నేను ఇపుడు రాజపుత్రుడను కానని సరిపుచ్చుకొనుట కవకాశమున్నది. నేను పూర్వమెపుడో రాజపుత్రుఁడను. కాని మీరిపుడును రాజపుత్రులే.

గజ—రాణా యుద్ధమున చంపనుబడలేదు. కైదునుచేయఁబడలేదు.

మహా—లేదు. వారిని చంపవద్దనియు కైదుచేయవద్దనియు నే నాజ్ఞాపించితిని. ఇట్టిశత్రువు ప్రపంచమున గౌరవింపదగినవాఁడు. నే నాగౌరవమునకు భంగము చేయఁగోరలేదు.

గజ—మంచిది. ఇంక నాకు సెలవిండు.

మహా—ఆఁ. తాము దయచేయవచ్చును.

[గజసింహుఁడు వెళ్ళును.]

మహా—అదిగో! ఎదురుగ మండుచున్న గ్రామములు గనఁబట్టుచున్నవి. గ్రామవాసుల యాక్రిందనధ్వనులు వినవచ్చుచున్నవి. హిందు



వులారా! నేఁడు మీరు మీమతగౌరవముతో చావుఁడు. నేఁడు నేను మీపౌగరంతయు నణఁచితిని. మీయాడంబరము మీ గర్వముఅంతయు చూర్ణముచేసితిని. మీ—

[నలుగురు భటులతో కల్యాణివచ్చును.]

మహా—ఈమె యెవరు?

౧వభ—ఖుదావంద్! మే మీమెను ఎఱుఁగము. దారిలో కనఁబడి మా వెంట నిచటకువచ్చినది.

మహా—(కల్యాణితో) నీ వెవతెవు?

కల్యా—నన్ను తెలిసికొనుటచే మీ కేమియు ప్రయోజనములేదు.

మహా—నీ కేమికావలయును?

కల్యా—నేను మీయొద్దకు ఒకవిషయమై న్యాయము కనుగొనుటకు వచ్చితిని.

మహా—ఏవిషయము?

కల్యా—మీయీభటులు నిరపరాధుఁడగు నాసోదరునిజంపిరి.

మహా—నీసోదరుని జంపిరా? ఎట్లు? భటులారా!

౧వభ—ఖుదావంద్! మేము గ్రామవాసులను వధించుచుంటిమి. ఈమెసోదరుఁడు వారిపక్షమున యుద్ధముచేసి అందు హతుఁడయ్యెను.

మహా—(కల్యాణితో) ఇదినిజమేనా?

కల్యా—అవును. మీసైనికులు దీనులగు గ్రామస్థులను వధించుచుండ నాసోదరుఁడు వారిని రక్షింపబోయెను. అంతవీరు అతనినిఁ గూడ చంపిరి.

మహా—అగుచో ఆయన యుద్ధమందే హతుఁడయ్యెను.

కల్యా—అట్లుకానిండు. వీరు అతనిని యుద్ధమందుచంపిరి.

మహా—దేవీ! ఇంకనిందు వీరియపరాధములేదు. నేను వీరికి అట్టిఆజ్ఞ నిచ్చితిని. సైనికులారా! మీరు వెలుపలికిపొండు.

(సైనికులు వెళ్ళిపోవుదురు)

కల్యా—మీరు నిరపరాధులగు గ్రామవాసులను జంపుటకు ఆజ్ఞాపించితిరా?

మహా—అవును.

కల్యా—గ్రామములను తగులఁబెట్టుటకుకూడ ఆజ్ఞాపించితిరా?

మహా—అవును.

కల్యా—మీరింత నిష్ఠురులగుదురని నాకు నమ్మకములేదు.

మహా—నాపైనిట్టి సదభిప్రాయమునకుఁ గారణమేమి?

కల్యా—నానాథుఁడింత నిష్ఠురుఁడుకాఁడు.

మహా—నీనాథుఁడా!

కల్యా—అవును. ప్రభూ! ప్రాణేశ్వరా! నన్నుగుర్తింపగలరో లేరో బాగుగచూడుఁడు. నేను మీపరిత్యక్తహిందూస్త్రీని, కల్యాణిని.

మహా—కల్యాణీ! కల్యాణీ! అయితే వీరునీయన్నను అజయసింహుని వధించిరా?

కల్యా—అవును. ఏనాఁడు మిమ్ముహృదయమునసిలిపి మీప్రేమను నాజీవితమునకు ధ్రువనక్షత్రముగఁ జేసికొని నాజీవితనౌకను ఈయనంత సంసారసముద్రమున విడిచితినో నాఁడు నాసోదరుఁడు ఆనందపూర్వకముగ తనంతటతాను నన్నురక్షించుటకై ఈదుఃఖకాలమున నాకు సహచరుఁడయ్యెను. త్రోవలో దుష్టులగు మీసైనికులనుండి నన్నురక్షించునపుడు ఆతనికిచాల పెద్దగాయములుతగిలెను. అప్పుడు,

ఆ॥ వె॥ పలుదినంబులేను ♦ పటకుటీరమునందు
నుండిసేవసలిపి ♦ దండనుండు



పల్లియలకుఁబోయి ♦ భైక్షుకమునఁగల్గు
భోజనంబొసఁగుచుఁ ♦ బ్రోచితయ్య.

కం॥ అట్టిమదీయసహోదరు
నిట్టివధించితిరి మీర ♦ లేమననేలా
కట్టడిదైవకృతమునకుఁ
జట్టన నీదీనురాలిఁ ♦ జంపుమునాథా.

మహా—కాదు. కాదు. నన్నుక్షమింపుము.

కల్యా—ఇందఱు గ్రామవాసులహత్య మీయాజ్ఞచేతనే జరిగినదా?

మహా—అవును. నాయాజ్ఞచేతనే జరిగినది. నేను నాసైనికులకు రాజపుత్రజాతిని రూపుమాపుట కాజ్ఞాపించితిని.

కల్యా—హా ఈశ్వరా! ఏమిచేసితివి? యీయనయే నాకు పూజ్యదేవత. ఈఘాతకుని హృదయమున నిడుకొనియే నేనుసన్యాసినినైతిని. నాకు మృత్యువునులేదా? ఈశ్వరా! నేనొక్కనాఁడే ఒక్కమాఱుగ పతిని, భ్రాతనుగూడ పోఁగొట్టుకొంటిని. నేఁడు నావంటి అభాగ్యురాలెవరు, అకటా! (నోరుమూసికొనును.)

మహా—నీవెఱుఁగుదువా నేనెందుకు—

కల్యా—వద్దుప్రభూ! నేనిది యెఱుఁగఁగోరుటయులేదు. నామోహము విడిపోయినది. నేను ఇన్నినాళ్లనుండి మిమ్ము పూజించుచుంటిని. కాని నేటినుండి మిమ్ము పరమశత్రునిగా తలఁచుచుంటిని. నేను మిమ్ము తలఁచునంతగా మొగలులను గూడ శత్రులుగా తలఁచుటలేదు. మొగలులు మనకేమియుఁగారు. వారి మతము వారికి కాఫరులను వధించుట కుపదేశించుచున్నది. మీరో ఈదేశమునకు బిడ్డలు. మీనాళములందు విశుద్ధరాజపుత్రరక్తముఉన్నది. మీరును తుచ్ఛధనమునకాసించి మీజాతిని నశింపఁబూనితిరి. నాథా! ఇంక నేనేమిచెప్పుదును! మీరు మొగలులనుగూడ మించితిరి. వారు మేవాడును జయించుటయేకోరిరి,

కాని దీనులగు గ్రామవాసులయిండ్లు కాల్పఁగోరలేదు. మీరు వారికొఱతనుతీర్చితిరి. మీరు వారి యుచ్ఛిష్టమును భుజించుచు ఈఘాతకసైనికులను మాంసలోలుపులగు ఈనీచనరశ్వానములను దీనగ్రామవాసులపైకి వదలితిరి. మీరు మేవాడును శ్మశానవాటిక నొనర్చితిరి. నిరపరాధులగు మానవుల హాహారవంబుచే ఆకాశమంతయు ఘూర్ణిల్లుచున్నది. మొగలులకిట్టియుద్దేశ మెన్నడునులేదు. హా ఈశ్వరా! ఇట్టి దేశద్రోహులకు నీయొద్ద తగినశిక్షలేదా? అకటా! ఇంకను వీరినెత్తిపై వజ్రమేఁపడదు!

మహా—కల్యాణీ! కేవలము నీకొఱకే నే నీయుద్ధమున ప్రవేశించితిని.

కల్యా—నాకొఱకా? అసత్యము.

మహా—అసత్యముకాదు. నిజము. ఏనాఁడు నీతండ్రి మొగలులపైని ద్వేషముచే నిన్ను ఇల్లువెడలఁగొట్టెనో నాఁడే నేను మేవాడుపైకి శత్రుత్వము కట్టితిని.

కల్యా—ఈసంగతి యొప్పుకొన్నను మీ రేమతసిద్ధాంతము ప్రకారము ఒకని యపరాధమున జాతినంతయు నిర్మూలించుటకు సమకట్టితిరి?

మహా—ఇదినీకు వింతగానున్నదా? ఒకరావణుని పాపముచే లంకయంతయు ధ్వంసముకాలేదా? మఱియు ముసల్మానులపై ఈవిద్వేషము యొకనీతండ్రికేకాదు. హిందువులెల్లఱకు ముసల్మానులందఱపై ఇట్టిద్వేషమున్నటుల నీతండ్రి వెల్లడించెను. హిందువుల యాజాతిగతద్వేషమునకు ప్రతీకారము సేయుటకై నేను వచ్చితిని.

కల్యా—మొగలసేనాపతీ! దీనికి ప్రతీకారము సేయవలసియున్నచో జాతిముసల్మానుచేయును. మీరు ముసల్మానుమతమునుస్వీకరించినపుడు హిందువులయందలి ఈముసల్మాను విద్వేషమును ఎఱిఁగియే స్వీకరించితిరా? నాథా! మీరే మీయీదశను చేసికొంటిరి. మీరు వ్యర్థముగ అన్యాయప్రతీకారము సేయుచుంటినని ఏలసంతుష్టిచెందెదరు? మీయందలి ముసల్మానుత్వము మిమ్మీపని చేయించుటలేదు. మీయందలి అహంకారము—మహాబల్ఖానుత్వమే మిమ్మీపని చేయించుచున్నది.



మహా—(స్వగతము) ఆఁ! ఇదినిజమేనా!

కల్యా—మీ రావ్యక్తిగతద్వేషముచేతనే మేవాడువిధ్వంసమునకు గడంగితిరి. ఇదియే మీధర్మము! ఇదియే మీశూరత్వము! ఇదియే మీమనుష్యత్వము! హా ఈశ్వరా! ఎంతజేసితివి? నేను ఇన్నినాళ్ళనుండి గాలిలో మేడకట్టుచుంటిని. నీవు దానిని నేఁడు మట్టిలోఁగలిపితివి.

మహా—కల్యాణీ—

కల్యా—చాలుచాలు. ఇపుడు నా మోహము భంగమైనది. మీరునాకు పతియు నేనుమీకు పత్నిని అని అనుకొంటిని. కనుకనే ఒకనాఁడు నేను గొప్పయభిమానముతో "మమ్మెవ్వరు వేఱుచేయఁగల"రని పలికియుంటిని. కాని మీకునునాకును మధ్యఒక మహాసముద్రమున్నటుల నేఁడు గాంచుచుంటిని. మనయిద్దఱమధ్యను నాసోదరుని కోమలశరీరము పడియున్నది. దానిని మించి మనయిద్దఱమధ్యను నాస్వదేశరక్తపునది ప్రవహించుచున్నది. నిష్ఠురా! దేశద్రోహీ! రక్తపాయీ! ఘాతుకుఁడా! ఇసీ!—ఓఈశ్వరా! ఓవిధాతా! ఇట్టినీచుని, క్రూరుని, సోదరహంతకుని, ఉచ్ఛిష్టభిక్షుకుని, వికటాట్టహాసము విని తుదకు నీపై గూడ నాకు విశ్వాసము పోదుగదా!

[కల్యాణి వెళ్ళును.]



# మేవాడు పతనము

## పంచమాంకము

ప్రథమదృశ్యము

స్థానము—ఉదయపురము: రాజప్రాసాదము

సమయము—రాత్రి

[మానసి ఒంటరిగా పాడుచుండును.]

గీతము.

వచియింపఁగఁజాల నాప్రాణనాథ! నీప్రేమను
వచియింపఁదొడంగఁ గళము బాష్ప పూరితంబగు నే॥
మనసులోనిమాట నామనసుననే యుండిపోయె
కనఁగరా దుపాయమేమి కాంతుఁడ! నేనేమిచేతు॥
పెదవివిప్పకున్న, నాయెద విదీర్ణమైన
మదమున నాసర్వహృదయమును జూపించెదను నీకు॥

[రాణా ప్రవేశించును.]

మాన—ఏమి నాయనగారూ! మీరు యుద్ధక్షేత్రమునుండి తిరిగివచ్చితిరా?

రాణా—అవును మానసీ!

మాన—ఏమీ! ఏమయినది నాయనగారూ?

రాణా—మాటాడకుము. నేనొక యద్భుతమునుగాంచితిని.



మాన—ఏమిచూచితిరి? యుద్ధము—

రాణా—కాదు మానసీ! ఈమారు యుద్ధము జరుగనే లేదు. యుద్ధక్షేత్రమున కేవలము అగ్ని వర్షింపసాగెను. అందు మనసైన్యమంతయు భస్మమాయెను.

మాన—ఎట్లు?

రాణా—మేమేమియు తెలిసికొనలేకపోతిమి. అదియేమియో. అది ఈజగత్తులోనిది కాదు. ఉల్కావర్షమగు చున్నట్టులుండెను. భయంకరమగు అభిశాపప్రవాహము వచ్చుచున్నటులుండెను. నేనొకక్షణము కనులుమూసికొంటిని. నాశరీరమునుండి ఒక హృత్కంపము పోయినట్లయ్యెను. నాతల తిరిగిపోయెను. నేనేమియు తెలిసికొనఁజాలక పోతిని. కన్ను తెఱచి చూచువరికి నిద్రపోయిలేచినట్టు లయ్యెను. యుద్ధక్షేత్రమున నేనొక్కఁడనే యుంటిని. ఇంకనెవ్వరును గనిపించలేదు. నలుప్రక్కలను పీనుఁగులకుప్పలు తెప్పలై యుండెను. ఆహా! ఎంతభయంకర దృశ్యము!

మాన—నాయనగారూ! మీరు కొంచె ముద్వేగవశులయినట్టు లున్నారు. కూర్చుండుడు. మీకు పరిచర్య చేసెదను.

రాణా—నేనా శ్మశానమందే ఒంటరిగ తిరుగసాగితిని. కాని నన్నెవ్వరును వధింపలేదు.

మాన—ఈయుద్ధమున మీరు ఓటమి నొప్పుకొంటిరా?

రాణా—నేను ఒప్పుకొనుటవలనను, మానుటవలనను ఏమియుప్రయోజనము లేదు. ఒప్పకున్నమాత్రమున జయమువచ్చినదనుటకు యుద్ధమేమియు తర్కముగాదు. ఇదిస్థూలము, కఠినమునగు ప్రత్యక్షసత్యము. నన్నువారెందుకు వధించలేదో తెలియదు. నేనా మహాశ్మశానమున 'మహాబత్ఖాన్! గజసింహా!' అని అఱచుచు తిరిగితిని. కాని యెవ్వఁడును నాయొద్దకురాలేదు. దీనికికారణము చెప్పఁగలవా మానసీ?

మాన—నాయనగారూ! మీరు వ్యాకులపడవద్దు—

రాణా—ఆఁ. మఱియొక మాట నాకు బోధపడలేదు. మహాబత్ఖాను యుద్ధమున విజయము పొందినాఁడుగదా! అతఁడుగర్వముతో ఉదయపుర దుర్గమున నేల ప్రవేశింపలేదో తెలియదు. అతఁడింక దుర్గమున అధికారము సేయుటయే అభీష్టము.

మాన—నాయనగారూ! మీరు ఓడిపోతే పోయినారు. మీకు విచారమెందుకు? యుద్ధమున ఏదో ఒకపక్షమునకు పరాజయము తప్పదుగదా!

రాణా—అమ్మాయీ! నీవుచెప్పినది నిజము. యుద్ధమున ఏయొక పక్షమునకో పరాజయముతప్పదు. విచారమెందుకు—మానసీ!- నాకును ఈవిషయమై విచారములేదు. కాని నన్నువారు ఎందుకు వధింపలేదు?

[రాణి ప్రవేశించును.]

రాణా—(రాణితో) పెద్దసమస్య వచ్చినది. నీ వేమని చెప్పఁగలవా?

రాణి—ఏమి?

రాణా—నన్ను వారెందుకు వధింపలేదు?

[రాణి మానసివంక చూచును.]

రాణా—వినుము. ఆగంభీర రాత్రియందు, ఆయుద్ధక్షేత్రమున, ఆపీనుఁగుకుప్పలమధ్య నే నొంటిగా నిలచియుంటిని. అది యెట్టిదృశ్యము! నీవు దానిని ఊహింపనేని చాలవు. పైన ఆకాశమున అనంత నక్షత్రములును, క్రింద నేలపై అసంఖ్య శవములును నిశ్చలముగ నుండెను. ఆరెండిటి మధ్య ఘోరాంధకారము దక్క మఱియేమియు లేదు. నాకు ఈజగత్తుతో నేమియు సంబంధమే లేనట్టు లుండెను. నేనును చచ్చినట్లును లేక సజీవమగు మృత్యువా యనునట్లును నాకు తోచినది. నేనా యుద్ధక్షేత్రమున నాఖడ్గమును విసరితిని. కాని అది



ఆ శీతలనిశావాతమునే చీల్చుకొనిపోయినది. నేను 'మహాబత్' అని కేక వేసితిని. ఆధ్వని వ్యర్థముగ నలుప్రక్కలు వెదకి తిరిగివచ్చెను. తరువాత (భగ్నస్వరముతో) నే నా యుద్ధక్షేత్రమందు నలుప్రక్కలను దృష్టిపరపితిని. నే నా నక్షత్రప్రకాశమున మన బంగారురాజ్యము ఒక గొప్ప భూకంపముచే ధ్వంసమగుటను గాంచితిని. (మందస్వరముతో) ఆపిమ్మట ఆ మహాశ్మశానవాయువు మృతసైనికుల ఆత్మల బరువుచే కాంబోలు నాకు భారముగఁ దోఁచెను. అతికష్టముతో నేనొక నిట్టూర్పువిడిచితిని. ఆనిట్టూర్పును పైకిపోవక బరువుచే నేలపై బడెను. ఆసమయమున అచట అంధకారము లేనిచో వెదకిన అదితప్పక దొరకునని నాయభిప్రాయము.

రాణి—కానున్నది అయినది. ఇప్పుడువిచారించిన నేమిలాభము? నేను మొదటనే చెప్పితిని.

రాణా—అవును నీవు నిజముచెప్పితివి. మేవాడు చనిపోయినది. నేను నిలఁబడిచూచితిని. బుజముపై వేసికొని ఇచటకు తీసికొని వచ్చితిని. చూచెదవా? రమ్ము.

---

## ద్వితీయదృశ్యము.

స్థానము-మేవాడు అంతఃపురమందలి మార్గము

సమయము—రాత్రి

[ఇద్దఱుపరిచారికలు మాటాడుచు వచ్చెదరు.]

౧—పాపము వృద్ధగోవిందసింహుని దుఃఖమునకు మేఱలేదు. పాపము ఒక కొడుకు.

౨—అయితే చారణి దొరసానిశవమును గోవిందసింహుని ఇంటికడ కేల తీసికొనివచ్చినదో తెలియదు.

౧—ఆమె పనులన్నియు నిట్లే వింతగనుండును. ఆమెకు ఇంక నేమియు పనిలేదు కాఁబోలు. అక్కడ చాలమంది పోగయిరా?

౨—అఁ. వాఁకిలియంతయు నిండియుండెను. గోవిందసింహుఁ డింటి యొద్దలేఁడు. చారణి దొరసాని కొడుకు అరుణసింహుఁడు ఆయనను పిలుచుటకు వెళ్లెను. అచ్చటనే శవమునకు దగ్గరగ దొరసాని ఒక్కతె నిలఁబడి యుండెను. తక్కినవారు దూరముగ నుండిరి.

౧—ఇదియంతయు చీకటిలోనేనా?

౨—అవును. దూరముగ మేడలో నొకదీపముమాత్రము మినుకు మినుకు మనుచున్నది. ఆమెయెవరు?

౧—ఎక్కడ?

౨—అదిగో! కనఁబడుటలేదా?

౧—ఆమె రాజకుమారి. ఆమెఅవస్థచూచితివా? గుడ్లు పైకి వచ్చినవి. పైఁటచెఱఁగుజారి నేలదొరలుచున్నది. రెండుచేతుల్లును గుప్పిళ్ళుపడినవి.

౨—అదిగో! ఆమె యిచటకే వచ్చుచున్నది. పద, వెళ్ళుదము.

[ఇద్దఱును ఒకప్రక్కగా పోవుదురు. రెండవప్రక్కనుండి మానసి ప్రవేశించును.]

మాన—పోయినాడు. అజయుఁడుకూడపోయినాఁడు. నన్ను కలియను లేదు. నాతో నేమియు చెప్పనులేదు. వెళ్ళిపోయినాఁడు. ఇది న్యాయ్యమా? అయ్యో! నాతల తిరిగిపోవుచున్నది. నాకనుల యెదుట పచ్చనిబింబములు భూమినుండియెగసి ఆకసమున లుప్తమగుచున్నవి. శరీరమునుండి జ్వాల వెడలుచున్నది. శిరస్సుపై నుండిఆకాశము వెడలిపోయినది. కాళ్ళక్రిందనుండి భూమితొలఁగిపోయినది. నేనెక్కడనున్నాను! జౌరా! (కొంచెముసేపు ఊరక యుండి మెల్లగా) నేనుచాల కఠినురాలను. నోటినుండి



మాటయే వచ్చెడిదికాదు. ఆనాఁడు అజయుఁడు నా దయాలేశమునుగోరి దీనదృష్టితో 'నన్నుగాంచుచుండగా, నాకరుణాదృష్టికై కడునాతురుఁడగుచుండగా నే నతనితో మాట్లాడనే లేదు. కనుకనే నా అజయుఁడు కోపగించి వెళ్లిపోయినాఁడు. నా యీ అభిమానమును చూర్ణముచేసి కాలితో రాచి వెళ్లిపోయినాఁడు. అజయా! నేఁడు నీపాదములకడ విశ్రమించుటకు మనసు గలుగుచున్నది. నేఁడు నాహృదయమును జీల్చి నీకు చూపింపవలెననియున్నది. కానిఅయ్యో! ఇప్పుడు సమయము గాదు. (నిష్క్రమించును.)

---

### తృతీయ దృశ్యము.

స్థానము—గోవిందసింహుని గృహాంగణము.

సమయము—రాత్రి

[పెద్దగాలి వీచుచుండును. అజయసింహునిశవముయొద్ద సత్యవతి యునలుగురు వాహకులును నిలఁబడి యుందురు. గోవిందసింహుఁడుతెప్పయార్పక శవమును చూచుచుండును.]

గోవిం—ఇదియే నాపుత్రుఁడు అజయసింహుని మృతదేహము. సత్యవతీ! ఇది నీకెచ్చట దొరకెను?

సత్య—బాటకు ప్రక్కగ.

గోవిం—ఇతని మృత్యు వెట్లయ్యెను.

సత్య—దగ్గిర నున్నవారివలన తెలిసికొంటిని. మహాబత్ఖాని భటులు నిరపరాధులగు గ్రామవాసులను వధింపుచుండ అజయుఁడు వారిని రక్షించుటకై పోయి అందు చంపఁబడెనఁట! తర్వాత భటులు కల్యాణిని పట్టుకొని తీసికొనిపోయిరఁట!

గోవిం—కుమారా! అజయా! క్షమాపణ వేడుకొనుటకును అవకాశ మొసఁగితివి కావు. నేను క్రోధాంధుఁడనగుటచే ఇలు వెడలి

పోవు నిన్నేమియు ననఁ జాలకపోతిని. అకటా! నిన్నేల పోనిచ్చితిని! పోతివిపోని! న్నేల పిలిపించకపోతిని! అయ్యో! కుమారా! అజయా! ప్రాణప్రియా! నాకు క్షమాపణ వేడుకొనుటకును అవకాశ మొసఁగితివికావు. ఇంతఅభిమానమా! ఇంతఅలుకయా!—నీముసలి తండ్రిని— అజయా! అజయా!—

సత్య—గోవిందసింహాజీ! ఇందుకు దుఃఖమేల? అజయుఁడు దీనరక్షణమునకై ప్రాణములొసఁగెను.

గోవిం—అవును సత్యవతీ! నీవుచెప్పునది సత్యము. అజయుఁడు దీనరక్షకై ప్రాణమర్పించెను—అసహాయులకు సహాయముచేయుచు ప్రాణము విడిచినాఁడు. ఇంకదుఃఖమెందుకు? పొండు. చక్కఁగా దహనకర్మము చేయుఁడు.

[గోవిందసింహుఁడు శవముఖమును కప్పివేయును. వాహకులు శవము నెత్తఁబోవుదురు.]

గోవిం—ఆగుఁడు. నన్ను మఱియొకమాఱు చూడనిండు. హా నా సర్వస్వమా! వృద్ధునిపాథేయమా! అంధునిహస్తదండమా! నా ప్రియకుమారా! ఒకమాఱు— లేదులేదు. దుఃఖమెందుకు? సత్యవతీ! నీవుచెప్పినదినిజము. అజయుఁడు దీనరక్షకై ప్రాణములు విడిచినాఁడు. ఓసీ మేవాడుభూమీ! రాక్షసీ! ఇందఱ ప్రాణముల మెక్కినను నీపొట్ట నిండలేదు. నీవు పోవుటకు సిద్ధముగఁ గూర్చున్నావు. కాని అందఱ ప్రాణములను భక్షింపక పోవునట్లు లేవు. అయ్యో! నాబంగారువంటి సంసారము పాడైనది. కాదు, కాదు. నాఅజయుఁడు చనిపోయినాఁడని యెవ్వరందురు. వాఁడు చావలేదు. అదిగో! నావంక చూచుచున్నాఁడు. ఇంకబ్రదికియే యున్నాఁడు. అజయా! అజయా! (గోవిందసింహుఁడు శవమువైపునకువచ్చుండ సత్యవతి మధ్య నిలఁబడును.)



సత్య—గోవింద సింహాజీ! శోకముచే నున్మాదము చెందవలదు. మీ పుత్రుఁ డిప్పు డీప్రపంచమున లేడు.

గోవిం—లేడు. పుత్రుఁడులేడు నిజము పుత్రుఁడులేడు! నేను పొరపడుచున్నాను. అజయా! అజయా! నాసర్వస్వమా! అజయా! (ముఖము కప్పివేయును.)

సత్య—గోవింద సింహాజీ! నీవు వీరుఁడవు. పుత్రశోకముచే నింతయధీరుఁ డవగుట నీకు బాగుగలేదు.

గోవిం—ఏమంటివి సత్యవతీ! కొంచెము బిగ్గరగా చెప్పుము. నాకు వినిపించుటలేదు. నాహృదయమున నొకభయంకరమగు ఝంఝామారుతము వీచుచున్నది. అందుచే నాకేమియు వినిపించుటలేదు. ఓహోహో! (హృదయము పట్టుకొనును.)

కల్యాణి—(ప్రవేశించి) నాయనా! నాయనా!

గోవిం—ఎవరుపిలుచునది? కల్యాణియా? సర్వనాశనీ! చూడుమెంత చేసితివో! రాక్షసీ! నాఅజయుని నీవేమ్రింగితివి. ఇప్పుఁడు నాకు తెచ్చియిమ్ము.

కల్యా—హా సోదరా! హా సోదరా! (శవమును కౌఁగలించుకొనును.)

గోవిం—పో. దూరముగా పో. నాఅజయుని ముట్టుకొనవద్దు. పొమ్ము పిశాచనీ! (చేయిపట్టుకొని కల్యాణిని త్రోయును.)

కల్యా—(లేచి) నాయనగారూ! నేను నిజముగ పిశాచినిని. నన్నుచంపి వేయుఁడు. నాపేరు కల్యాణిఅని యెవ్వరుంచిరి? నాయనగారూ! నేను మీగృహమునకు అకల్యాణిని—మేవాడు రాజ్యమునకు ధూమకేతువను. ఈపృథ్వికి సర్వనాశనిని. నన్నుచంపి వేయుఁడు. ఈసర్వనాశనిని ఈప్రపంచమునుండి వెడలఁగొట్టుఁడు. ఇంక మీకేమియు కొదువయుండదు. నన్నుచంపి వేయుఁడు. చంపివేయుఁడు!—(గోవిందసింహుని కెదురుగా తలవంచుకొని కూర్చుండును.)

గోవిం—నాహృదయమున నేమియిది? ఈ నరకజ్వాలను ఈపిశాచ నృత్యమును ఇంక సహింపఁజాలను. ఓజగదీశ్వరా! ఇంక సహిం పఁజాలను.

సత్య—గోవిందసింహాజీ! మీరు అధీరత చెందవద్దు. మీ వీరపుత్రుని దహనకర్మమును సగౌరవముగ జేయుడు. మీపుత్రుఁడు దీనరక్షకై ప్రాణమర్పించినాఁడు.

గోవిం—నిజము. నీవుచెప్పినది నిజము. నాపుత్రుఁడు దీనరక్షకై ప్రాణమర్పించినాడు. ఇంక నేను దుఃఖింపను. నన్నుక్షమింపుము కుమారీ! ఇదినాకు గౌరవావహమగు విషయము. కాని— (ఏడ్చుచు) సత్యవతీ! ఇపుడు నేను వృద్ధుఁడనయిపోతిని. చాలవృద్ధుఁ డనయిపోయితిని.

కల్యా—నాయనగారూ!

గోవిం—(కంపితస్వరముతో) రమ్ము కుమారీ! నా యొడిలోనికి రమ్ము. మద్గృహనిర్వాసితా, పతిపరిత్యక్తా, మాతృహీనా, అభాగ్యోపహతా, కుమారీ! రమ్ము. నేను సాధ్వి నవమానించితిని. కనుకనే ఈశ్వరుఁడు నాకీ శిక్షయొసఁగినాఁడు. పొండు. మీరీ మృతదేహమునకు దహనసంస్కారము చేయుఁడు.

[జనులు శవము నెత్తఁబోదురు. ఇంతలో హఠాత్తుగ మానసి ప్రవేశించును. ఆమె వెండ్రుకలు విరబోసి యుండును. వస్త్రము చెదరియుండును.]

మాన—ఆగుడు. కొంచెము నన్నును చూడనీయుఁడు.

సత్య—ఎవరు! రాజకుమారీ!

మాన—అజయా! ప్రియతమా! నాజీవన సర్వస్వమా! నాథా!

సత్య—ఇదియేమి రాజకుమారీ! నీనాథుఁడా!

మాన—మంచిది. ఇంక నెల్లరు వినుఁడు. నేటిదనుక నే నీ విషయ మెవ్వరికిని చెప్పలేదు. నేఁడు చెప్పుచున్నాను. అజయసింహునితో



నాకు వివాహమయినది. ఇదియెవ్వరు నెఱుఁగరు. నేనును ఎఱుఁగకుంటిని. ఎవ్వరికిని తెలియకయే మౌనముగ ఆత్మలో ఆత్మలోనే ఈవివాహము జరిగినది.— ప్రియతమా! ఎక్కడకు పోతివి? ఇదిగో! నేను వచ్చితిని. నేఁడు నేను ప్రగల్భనగు నీ గురువురాలను గాను. దయామయినగు రాజకుమారిని గాను. నీప్రేమభిక్షను యాచించు నొక అబలను. నేఁడు నేను భిక్షుకి కంటెను అతిదీనురాలను. అజయా! నేటిదనుక నేను నిన్నెంత ప్రేమించుచుంటినో నీకు తెలుపలేదు. మొదట నే నిది గ్రహింపనే లేక పోతిని. నన్ను క్షమించుము.

సత్య—అయ్యో! రాజకుమారియు శోకముచే నుద్విగ్న యగుచున్నది. మానసీ! శాంతించుము. అజయుఁడు దీనరక్షణకై ప్రాణము విడిచినాఁడు.

మాన—నిజము. ప్రాణములిట్లే విడువవలయును. నా ప్రియశిష్యా! నేడు నీవు నా గురుస్థానము నాక్రమించితివి. నీ గౌరవకిరణము పరలోకము వ్యాపించి యీపృథ్విపై వ్రాలినది. చావనున్నచో ఇట్లే చావవలయును. వృద్ధ గోవిందసింహాజీ! మీరు ధన్యులరు. ఇట్టిపుత్రునికి తండ్రియగుటకు మీరు గర్వపడవచ్చును. ఇట్టి వాఁడు పతియగుటచే నేనును ధన్యురాలను. గోవిందసింహాజీ! ఇది మనము గర్వపడుటకు సమయముగాని శోకించుటకుఁ గాదు.

గోవిం—(శుష్కకంఠముతో) రాజకుమారీ! అజయుఁడు దీనరక్షార్థము ప్రాణమువిడిచినాడు. దుఃఖమెందుకు? (స్వరభంగముతో) అజయుఁడు దేశమునకై— (మాటరాదు. గోడకు కుడిచేయిఆనించి దానిపై తలయుంచును. ఏడ్వగా ఏడ్వగా ఎక్కిళ్ళువచ్చును.)

మాన—వ్యర్థము! వ్యర్థము! వ్యర్థము! లోపలనుండి ప్రబలశోకోద్వేగము వెలువడి ఔదార్యములనన్నిటిని కప్పివేయుచున్నది. ఇంక సహింపఁజాలను—అజయా! అజయా!—

కల్యా—ఇదియంతయు నేమో నాకు తెలియుటలేదు. ఇది స్వర్గమా మర్త్యమా! వీరు దేవతలా మనుష్యులా! ఇది జీవనమా లేక మృత్యువా! నే నెవతెను? ఓహో—(మూర్ఛపడును.)

సత్య—కల్యాణీ! కల్యాణీ!

గోవిం—పిల్లచనిపోవుచున్నది. పోనిండు. మేమును వెంటనేపోదుము.—కొడుకు, కూతురు, నేను, మేవాడ—అందఱము ఒక్కసారిగనే పోదుము. కొడుకుపోయినాఁడు, కూతురుపోయినది, ఈ మేవాడు- ప్రియమైన నా మేవాడు—అదియు మునిగిపోవుచున్నది. మునిగిపోవుచున్నది - అదిగో! మునిగినది! కానిండు —నేనును పోవుచున్నాను. (పిచ్చివానివలె పరుగెత్తుచుపోవును.)

సత్య—అంతయు పూర్తిఅయినది. ఇంక ప్రళయమే కావలయును.

---

## చతుర్థ దృశ్యము

స్థానము— మేవాడులో ఒక పర్వతప్రాంతమున మహాబత్ఖానుని శిబిరము.

సమయము—సాయంకాలము.

(మహాబత్ఖాను డేరాకు వెలుపల నిలఁబడి పర్వతముపై అస్తమింపఁబోవు సూర్యుని కిరణములు చూచుచుండును.)

మహా—పద. అస్తమయమైనది.

(గజసింహుఁడు ప్రవేశించును.)

గజ—ఖాన్‌సాహబ్!

మహా—రండు మహారాజా!



గజ—తాము విజయముఁ బడసినను తమసైన్యముతో ఉదయపుర దుర్గమున నింకా నేల ప్రవేశింపలేదు.

మహా—మహారాజుగారు ఆవిషయము నన్నిపుడు విచారింపుచుండిరా?

గజ—లేదు. నేను ఊరక అడిగితిని. ఖాన్‌సాహబ్! ఈమాఱు మేవాడులో స్త్రీలుకూడ ఖడ్గము ధరించిరఁటగదా!

మహా—స్త్రీలు ఖడ్గము ధరించిరా!—స్త్రీలా?

గజ—అవును. స్త్రీలు. వారెట్లు యుద్ధముచేసెదరో చూతము. ఈమాఱు యుద్ధములో కొంత కోమలత్వము గనుపట్టును. నేనును ఈ యుద్ధమునకు వచ్చెదను.

మహా—మహారాజా! రాజపుత్రులయ్యు మీరు రాజపుత్రస్త్రీలనిట్లు పరిహాసింపు చుంటిరా! మీరు నిజముగ రాజపుత్రులేనా? కాదు.

గజ—ఖాన్‌సాహబ్!

మహా—పొండు, పొండు. మీ యీ పరాక్రమము మీ దేశమునకై అట్టిపెట్టుకొనుఁడు. ఎప్పుడేని పనికివచ్చును.

[గజసింహుఁడు పోవును.]

మహా—ఈ మహాత్ములే హిందూధర్మపతాకను ధరించెదరు. హిందువులారా! మీరు మీ దేశమును పోఁగొట్టుకొనుటయే కాక దానితోపాటు మీ మనుష్యత్వమును గూడ పోఁగొట్టుకొంటిరి.

[ఒక భటుఁడు ప్రవేశించును.]

మహా—ఏమి సమాచారము?

భటు—శాహజాదాసాహబు సైన్యముతో దయచేసిరి?

మహా—వచ్చినారా? మంచిది పొమ్ము.

[భటుఁడు వెళ్ళును.]

మహా—ఇంక సైన్యము తీసికొనివచ్చుట కవసరములేదు. మేవాడ విధ్వంసమును నేను పూర్తిచేసితిని. అయితే మొగలసైన్యమును దీసికొని ఉదయపురదుర్గమున ప్రవేశించుటకు నే నిష్టపడుటలేదు. ఆపని శాహజాదాసాహబ్—మొగలులు చేసికొందురుగాక! నాపని యింతటితోనే ముగిసినది.

[గోవిందసింహుఁడు ప్రవేశించును.]

మహా—మీ రెవరు?

గోవిం—నేనొక మేవాడుసర్దారును.

మహా—ఇచ్చటి కేలవచ్చితిరి?

గోవిం—చెప్పెదను. కొంచె మూపిరి తీసికొననిమ్ము.

మహా—రాణా అమరసింహుఁడు మిమ్ము సంధిచేసికొనుటకై పంపెనా?

గోవిం—అట్లగుటకుముందు నాపై వజ్రపాతమగుగాక!

మహా—ఇంక మీ రేమికోరుచున్నారు?

గోవిం—నేను చావఁగోరుచున్నాను. నేను మిక్కిలి వృద్ధుడనైతిని. చావఁగోరుచున్నాను. నేను యుద్ధముచేసి చావఁగోరుచున్నాను. సామాన్య భటునితోఁగాదు. నీతోయుద్ధముచేసి నీచేతిలో చావఁగోరుచున్నాను.

మహా—మీకు పిచ్చి యెక్కలేదుగదా?

గోవిం—లేదు మహాబత్! పిచ్చిలేదు. నీవు ఎఱిఁగియుండవచ్చును. ద్వంద్వయుద్ధమున నిన్నువధించుటకు వచ్చితిని— ఈశ్వరా! నాయందిపు డంతశక్తియేయున్నచో! లేదు, మహబత్ఖాన్! నేడు ద్వంద్వయుద్ధమున నిన్ను గెలువఁజాలనని యెఱుఁగుదును. కాని చావఁజాలుదును. నేను నీచేతులలో చావఁజాలుదును.

మహా—ఇదిచాల అద్భుతమగు కోరిక.



గోవిం—ఇందులో అద్భుతత్వమేమియులేదు. నేను స్వర్గీయ రాణా ప్రతాపసింహుని యొద్దనుండి దాదాపు ఏఁబది యుద్ధములు చేసితిని. నా శరీరమందలి శస్త్రచిహ్నములకు లెక్కలేదు. ఇప్పు డంతిమచిహ్నము నీ శస్త్రముచే కావలయును.

మహా—దీనిచే మీ కేమి లాభము?

గోవిం—విశేష లాభమేమియు లేదు. కాని మతముచే ముసల్మానువయ్యును జాతిచే హిందువవు. మఱియు రాణాప్రతాపసింహునకు సోదర పుత్రుఁడవు. కనుక నీచేతిలో చచ్చుటలో కొంచెము గౌరవమున్నది.

మహా—మీరు సాలుంబర ప్రభువులగు గోవిందసింహులా!

గోవిం—హా హా హా! గుర్తించితివా మహాబత్ఖాన్? నేను నీచేతిలో నెందుకు చావఁగోరితినో ఇప్పుడు తెలిసికొంటివా? మహాబత్ఖాన్! నేఁడు నీవు మేవాడు గెలిచితివి— మేవాడును ధ్వంసముచేసితివి. అయినను నిన్ను ఉదయపుర దుర్గమునఁ బ్రవేశింపనీయను. మేవాడులో ఇప్పుడు సేనలేదు. ఇప్పుడు నీవు యుద్ధముచేయ నక్కఱలేదు. నేను మేవాడుకు అంతిమ వీరుఁడను. నేఁడు నేనొక్కఁడనే మొగలులను ఉదయపుర దుర్గమునఁ జొరనీయకుండుటకు నిలఁబడితిని. నాప్రాణములుండగ మీ రీ దుర్గమునఁ బ్రవేశింపఁజాలరు. శస్త్రము పట్టుఁడు. [కత్తిదూయును.]

మహా—వీరాగ్రణీ! నే నీదుర్గమున ప్రవేశింపనే కోరుటలేదు.

గోవిం—నీవుకోరినను కోరకున్నను నాకు రెండును ఒకటే. శస్త్రము పట్టుము.

మహా—వినుఁడు—

గోవిం—కాదు కాదు. నేనేమియు వినఁగోరుటలేదు. నాహృదయమున అఖండాగ్ని జ్వలించుచున్నది. నాకొడుకు పోయినాడు. కూతురు పోయినది. ఇంక నేను చావఁగోరుచున్నాను. స్వతంత్రమగు నామేవాడు మ్లేచ్ఛపద దళితమగుటను చూచుటకు మున్న నేను చావఁగోరుచున్నాను. అల్లుఁడయ్యును నాపుత్రుని చంపినవాఁడును, నాదేశమునకు సంతానమయ్యును పరులకు బానిసయు, నాజాతివాఁడయ్యును మునల్మానును, నారాజునకు సోదరుడయ్యును, ఆయనకు పరమశత్రువును అగువాని చేతిలో చావఁగోరుచున్నాను. మహాబత్! శస్త్రముపట్టుము.

మహా—(ఖడ్గముఁపట్టుకొని) మీరు శాంతింపుఁడు. నేను మిమ్మెన్నటికిని చంపను.

గోవిం—నే నేమియువినను. కాచికొనుము.

మహా—గోవిందసింహాజీ!—

గోవిం—నన్నువధింపుము. వధింపుము.

మహా—నేనుశస్త్రము క్రింద పెట్టుచున్నాను.

గోవిం—మహాబత్! నేను నిన్నువిడువను. శస్త్రముపట్టుము. నేను నేఁడు చచ్చుటకువచ్చితిని. తప్పక చచ్చెదను. శస్త్రముపట్టుము. నేను విడిచిపెట్టను.

[గోవిందసింహుఁడు కలియఁబడఁబోఁగా గజసింహుఁడు వెనుక వచ్చిఅతనిపైతుపాకిపేల్చును. గోవిందసింహుఁడు పడిపోవును.]

మహా—ఇదియేమి? మహారాజా! ఇటుచేసితిరేమి?

గజ—వీనిని చంపివేసితిని.

మహా—ఈయన యెవ్వరో మీ రెఱుఁగుదురా?

గజ—ఎందుకు? ఎవ్వఁడో తస్కరుఁడుకావచ్చును.



గోవిం—దొంగను నేనుకాను. దొంగలుమీరు. పరులరాజ్యమును దోఁచుకొనుటకు నేను రాలేదు. మీరువచ్చితిరి. మహాబత్ఖాన్! పోమ్ము. ఉదయపురము పోమ్ము. ఇప్పుడు నిన్నెవ్వరు నడ్డగింపరు. నీతల్లినిపట్టుకొని మొగలులకు దాసినిచేయుము. పుత్రుని కర్తవ్యము నెరవేర్పుము. అజయా!—కల్యాణీ!—(గిలగిల కొట్టుకొని చనిపోవును)

---

## పంచమదృశ్యము.

స్థానము—ఉదయపురదుర్గమున కెదురుగ రాజమార్గము.

సమయము—రాత్రి

[దుర్గరక్షకుఁడగు నొకరాజపుత్రభటునితో కొందఱు పురవాసులు మాట్లాడుచుందురు.]

౧—ఏమయ్యా! మనమహారాజు నేఁడు కోటనుండి బయటికేల వెళ్లిరి?

భటుఁడు—ఎందుకు వెళ్ళిరో తెలియదు. కాని మహాబత్ఖాను మేవాడుతోడి వైరమును ఆపి బాదుషా కొకజాబు వ్రాసి పంపెనని వింటిని. కనుకనే ఈమాఱు శాహజాదాఖుర్రమ్ యుద్ధమునకు వచ్చినాఁడు. ఒక మొగలదూత శాహజాదాయొద్దనుండి జాబుతెచ్చినాఁడు. ఆజాబులో ఆయన రాణాతోడి మైత్రిని కోరినట్లు వ్రాసెనఁట! మొగలదూత వెళ్ళిన మరునాఁడు—నేఁడు ఉదయమున రాణాగారు గుఱ్ఱమెక్కి శాహజాదాశిబిరమునకు పోయిరి.

౨—తర్వాత ఏమయ్యెను?

భటు—తర్వాత నేమయ్యెనో తెలియదు.

౩—రాణాగారు ఇంక తిరిగి రాలేదా?

భటు—లేదు.

౪—ఆయనతో మఱి యెవ్వరు వెళ్ళిరి?

భటు—ఎవ్వరును లేరు. వారు ఒక్కరే వెళ్ళిరి.

౧—చూడుము. వా రెవరు?

౨—రాణాగారు కాదుకద?

౩—కాదు. వీరు రాణాగారుగా లేరు.

౪—వేషము రాజవేషమే. (భటునితో) ఏమయ్యా! ఈయన యెవరో నీ వెఱుఁగుదువా?

భటు—ఈయన జోధపురము మహారాజు, గజసింహుడు.

౧—మహాబత్ఖానుతో మేవాడు పైకి దండెత్తి వచ్చిన ఆయనయే కాదు?

భటు—అవును.

౨—ఈయన రాజపుత్రుఁడేనా?

౩—రాజపుత్రుఁడయ్యును రాజపుత్రులకు శత్రువు.

[చాల సైనికులతో గజసింహుఁడు ప్రవేశించును.]

గజ—(భటునితో) కోటదర్వాజా మూసియున్నదా?

భటు—అవును మహారాజా.

గజ—ద్వారము తెరువుము. ఇప్పుడు కోటమాది.

భటు—మహారాజా! మాప్రభువుల ఆజ్ఞలేక నే నీ ద్వారము తెరువఁజాలను.

గజ—ప్రభువుల ఆజ్ఞయా? ఇప్పుడు మీ ప్రభువు అమరసింహుఁడు కాఁడు. మీప్రభువును నేను.

భటు—తమరా? నాకు తెలియలేదు. అయినను రాణా అమరసింహుని ఆజ్ఞలేక నేను కోటద్వారము తెరువఁజాలను.



గజ—(తన సైనికులతో) వీనియొద్దనుండి తాళముచెవి లాగికొనుఁడు.

భటు—ప్రాణముండగ మీరు లాగికొనఁజాలరు. (కత్తిదూయును)

గజ—మంచిది, వీనిని చంపుఁడు.

౧—(అన్యపౌరులతో) చూచెద రేల? చంపుఁడు.

[అందఱును గజసింహునిపై కలియఁబడుదురు.]

గజ—వీరులారా—

[గజసింహుని సైనికులు పౌరులపైఁగలియఁబడుదురు. ఇంతలో కొందఱు మొగల సైనికులతో అమరసింహుఁడు ప్రవేశించును.]

రాణా—సైనికులారా! శస్త్రములు దింపుఁడు.

[మొగల సైనికుల జూచి రాజపుత్ర సైనికులు శస్త్రములు క్రిందనుంచెదరు.]

రాణా—గజసింహ మహారాజా! ఇచ్చట మీకేమిపని?

గజ—మే మీదుర్గమున బ్రవేశింపఁ గోరుచున్నాము.

రాణా—రాజాతిథీ! రాణా అమరసింహుఁడు నీకుతగిన సత్కారము చేయును. ఓరీ మొగలులకుక్కా! ఇదిగో! నీకుతగిన గౌరవము. (గజసింహుని తన్ని క్రిందపడద్రోయును.)

రాణా—సైనికులారా! దుర్గద్వారము తెరువుఁడు. (ద్వారము తెఱచిన పిమ్మట మొగల సైనికులతో) ఇంక మీరు వెనుకకు వెళ్ళిపోవచ్చును.

(రాణా కోటలో ప్రవేశించెదరు. ద్వారము మూయఁబడును.)

---

## షష్ఠదృశ్యము

స్థానము—మేవాడు పర్వతమార్గము

సమయము—సాయంకాలము.

[సత్యవతి, అరుణసింహుఁడు, కొందఱు చారణులు.]

చారణులు పాడుదురు

ఇపుడు మేవాడాద్రిశిఖరం బెఱ్ఱజెండా తలధరింపదు
అపరిహార్యపు దుస్థితినిగన నంధకారము గ్రమ్మకనులకు.

౧ నాసుఖస్వప్నమ్మవోయెను నాదువీణాతంత్రియుం దెగె
గాసిచెందిన మాతృభూమిని గానమేమియొనర్తునీయెడ.

౨ అతులమేవాడాద్రి సోయగమంతయును నంతమ్మునొందెను
అతికఠోరపు వజ్రపాతం బౌర! దీని హతమ్ముజేసెను.

౩ వననికుంజములందు నీయెడ వినఁబడదు ఖగమధురగీతము
ఘనమరందము గ్రోలి మధుకరగణముచేరదు కుసుమజాతము.

౪ చందురుఁడు శోభావిహీనత నందె మలయానిలము వీవదు
క్రిందుకొన వైకల్యమిరుదరులందు నదియును వడిగఁ బాఱదు

౫ కాననములువిషాదయుతములుగ్రామములుజనతారహితములు
మానచింతాన్వితులు పౌరులు మలినములు శూన్యములు
గృహములు.

౬ రాజపుత్రభటాళికరముల రాజిలదు కరవాల మీయెడ
తేజరిలవు మనోజ్ఞ భూషాదికము పడతుల యొడలు లందున.

౭ అంధకారమ్మలమెనెల్లెడ నయ్యెసుఖసర్వస్వనాశముబంధురంపు
యశమ్ము పాడుచు వందులోదార్పఁగఁ దొడంగిరి

౮ పోవుఁగాక సుఖంబులన్నియు పూర్వయశమును చారణుల్
భావమలరఁగఁ బాడునెడ మేవాడుసేయు ప్రతిధ్వనిన్.

[ముగ్గురు సైనికులతో హిదాయత్ఖాను ప్రవేశించును.]



హిదా—ఎవరుమీరు?

సత్య—నేను చారణిని.

హిదా—నీవు పర్వతమార్గములం దీ గీతమునే పాడుచు తిరుగు చుందువా?

సత్య—అవును. గీతముపాడుటయే నాయుద్యోగము.

హిదా—నీవింక నీగానమును పాడఁగూడదు.

అరు—ఏమి సైనికా?

హిదా—నేఁడు ఈదేశము మీదికాదు. ఇది మొగలులది.

సత్య—మొగలులకుఁ జై. మేవాడు స్వతంత్రముగా నున్నంతకాలము మేము యుద్ధము చేసితిమి. కాని మేవాడు తలవంచుకొని మొగలుల ప్రభుత్వమును స్వీకరించినపుడు మాకు మొగలులతో నెట్టి వివాదమును లేదు. కాన మేమిపుడు ఏడ్వను గూడ వలనుగాదా? మొగల సిఫాయి! ప్రపంచమున ఎల్లరును తమతల్లిని ప్రేమించెదరు. అట్టిచో హతభాగ్యులగు మేవాడు వాసులే ప్రేమింపఁగూడదా?

హిదా—కాదు, మీ రీ గీతమును పాడఁగూడదు.

అరు—మేము పాడుదుము. ఎవ్వరడ్డగింతురో చూతుము. పాడుమమ్మా!

హిదా—ఈ గీతము పాడుచో మీరు కైదు చేయఁబడుదురు.

సత్య—కైదుచేయుము సిఫాయి! మమ్ములను కైదు చేయుము. మేము మీచీఁకటి చెఱసాలలోనుండి మా యీదుఃఖగీతమును పాడుకొందుము. పాడుము కుమారా!

హిదా—మంచిది. అగుచో మిమ్ములను కైదు చేసితిని.

(ముందుకు వచ్చును.)

అరు—ఖబర్దార్! (కత్తిదూసి) ప్రాణమ్ముపై తీపియున్న మాయమ్మను ముట్టకుము.

హిదా—ఓరీ దుడుకుపిల్లఁడా! కత్తి యొక్కడ పెట్టుము.

అరు—పెట్టించుము.

హిదా—భటులారా! కలియఁబడుఁడు.

[సైనికులు అరుణునిపైఁ బడుదురు. అరుణుఁడు యుద్ధము చేయును.]

సత్య—సెబాసు కుమారా! నీతల్లిని రక్షింపుము.

[ఒకసైనికుఁడు భూమిపైఁబడును.]

సత్య—సెబాసు కుమారా! ప్రాణముండగా శస్త్రము విడువకుము. ఇదియే నేఁగోరువది. ఓహో—ఏమిఆనందము!

[హిదాయత్ఖాను సైనికులును అందఱు నొక్కమాఱుగ అరుణునిపైఁ గలియఁబడుదురు. అరుణుఁడు యుద్ధముచేయుచుండును. సత్యవతిపుత్రుని ఆసన్నమరణునిగా నెఱింగి క్షణ కాలము కనులుమూసికొనును. ఇంతలో మహాబత్ఖాను వెనుకనుండి వచ్చును.]

మహా—హిదాయత్ఖాన్! శాంతించుము.

[అందఱు నిశ్చేష్టులై నిలఁబడుదురు.]

మహా—హిదాయత్! నీకు లజ్జలేదా! ఇందఱు సైనికులు ఒకబాలునిపైఁ గలియఁబడిరి. అంతతో నాగక నీవును కత్తి పట్టితివా? ఛీ!—వత్సా! ప్రాణములను సరకుగొనక తల్లిని రక్షించితివి! నీవు ధన్యుఁడవు. జీవితము సఫలముచేయు మార్గమిదియే. వత్సా! చిరంజీవివి కమ్ము.

[సత్యవతి హృదయమున చేతులుంచుకొని సాభిమానమగు నానందముతో నరుణుని చూచును. తర్వాత మహాబత్ఖాను వెళ్ళునకు రెండడుగులు నడిచి వెనుకకు తిరిగి తలవంచుకొనును. మహాబత్ఖాను సత్యవతి వంక చూచుచుండును.]



మహా—అక్కా! నీకేమని చెప్పుదును. నిన్ను "అక్కా" యని పిలుచుటకును నాకధికారములేదు. ఇంక నేమి చెప్పుదును. నన్ను క్షమించుము—అక్కా!

సత్య—ఈశ్వరా!—ఏమిచేసితివి! నాతమ్ముఁడు నన్ను 'అక్కా' యని పిలుచుచున్నాఁడు. అయినను వానిని కౌఁగిటఁ గుచ్చెత్తు భాగ్యము నాకు లేదుగదా!

అరు—ఈయన యెవరు అమ్మా?

సత్య—ఈయన మొగలసేనాపతియగు మహాబత్ఖాను.

మహా—నేను నీమేనమామను.

సత్య—రమ్ము వత్సా! మనము పోదము.

మహా—ఎక్కడకు పోదురు? నన్ను క్షమించిపొండు.

సత్య—నీవేమి పాపముచేసితివో ఎఱుఁగుదువా మహాబత్ఖాన్?

మహా—ఎఱుఁగుదును. నేను నాచేతులతో నాయింటికి నిప్పుపెట్టుకున్నాను. పైశాచి కానందముతో పైకెగయుదాని ధూమ రాశిని చూచితిని.

సత్య—ఇంతయేనా?

మహా—ఇంక నేమి?—ముసల్మానుఅయితిననియా? అదిపాపకార్యమని నే నొప్పుకొనను. ఎవ్వరికిదేనిపై విశ్వాసముండునో ఆవిధమున నడువ స్వతంత్రుఁడు, గాన—

సత్య—మంచిది. రమ్ము. వత్సా!

మహా—ఆగుఁడు. అట్లేయయ్యును అది మనుష్యహృదయమునందలి కోమల ప్రవృత్తినంతయు నణఁచునంతటి ఘోరపాపమా? అక్కా! నారీహృదయము పవిత్రతకు తపోవనమును, ఆత్మత్యాగమునకు లీలాక్షేత్రమును, ప్రేమకు నందనవనమును అని ఎఱుఁగుదును. కాని ఆచారనియమములు ఇట్టి నారీహృద

యమును పాషాణమయముగాఁ జేయునంతటి కఠోరములా? ఒక్కనిమేషమాత్రము నీవు హిందువనియు, నేను ముసల్మాననియు, నీవు పీడితవనియు, నేను ఘాతుకుఁడననియు మఱచి పొమ్ము. పరిశుద్ధమనముతో నీవును నేనును ఒకేమనుష్యులము. నీవు అక్కవు నేను తమ్ముఁడను అని ఊహింపుము. నన్నుచంక నెత్తుకొని నాచుబుకమును ముద్దుగొనుచు తిరుగు నా బాల్యకాలమును స్మరింపుము. మనమిద్దఱము తల్లిలేని ఆ సోదరీ సోదరులమే అని తలంపుము—అక్కా!

సత్య—ఈశ్వరా!—

మహా—అక్కా!—

సత్య—ఇంక సహింపఁజాలను. ఏదికావలెనో అదిఅయినది. నీవు నాతమ్ముఁడవే. పొమ్ము. నీతప్పులన్నిటిని క్షమించితిని. పొమ్ము తమ్ముఁడా! నీవు నాయెదుట మొగలసేనాపతియగు మహాబత్ఖానువుకావు. నీవు కేవలము నాతమ్ముఁడగు మహీపతివే— పొమ్ము తమ్ముఁడా!

మహా—నేను నల్లేవచ్చితిని అక్కా! (నమస్కరించును)

సత్య—ఆయుష్మంతుఁడవుకమ్ము తమ్ముఁడా!—రమ్ము కుమారా!

హిదా—ఎక్కడకు పోదువు? నేను నిన్ను ఖైదుచేసితిని.

మహా—నాసమక్షమున నాసోదరిని ఖైదుచేయుట కెవ్వనికిని తరము కాను—పొమ్ము అక్కా!

హిదా—నీవిపుడు సేనాపతివికావు మహాబత్ఖాన్!— నే నిపుడు నీ మాటను వినను. ఇపుడు సేనాపతి శాహజాదాఖురమ్.

[శాహజాదా ప్రవేశించును.]

శాహ—మంచిది. అయితే నేను స్వయముగ ఆజ్ఞాపించుచున్నాను. వెళ్ళుమమ్మా! నిర్భయముగ పొమ్ము.



హిదా—శాహజాదాసాహబ్! ఈమె కొండఘాటీలందు రాజద్రోహకరములగు గీతములఁ బాడుచు తిరుగుచున్నది.

శాహ—నేను దూరమునుండి ఆగీతము వింటిని. అదియొక నిరాశామయమగు గంభీరదుఃఖగానము.

హిదా—దీనిచే రాజ్యమున అశాంతి గలుగును శాహజాదాసాహబ్

శాహ—ఆ యశాంతిని నివారించు తెరవు మొగలచక్రవర్తి యెఱుఁగును. హిదాయత్ఖాన్!—మేవాడునందేకాదు సమస్తభారతవర్షమందును ఏ సంతానమును తనతల్లిని ఈవిధముగ గానము చేయుట చేతనే ఈ విశాల మొగలసామ్రాజ్యము శీతకాలపు మబ్బువలె పటాపంచలగుచో కాసిమ్ము. మొగలసామ్రాజ్య మట్టి యిసుకదిబ్బపై ప్రతిష్ఠింపఁ బడినదికాదు హిదాయత్ఖాన్! ఆసామ్రాజ్యము భారతీయుల గాఢప్రేమపై ప్రతిష్ఠింపఁబడినది. మొగలు చక్రవర్తి న్యాయసంగతమును, భక్తిపవిత్రమునగు మాతృపూజ కెన్నఁడును బాధకలిగింపఁడు. దానికై ఈ సామ్రాజ్య మీయవలసి వచ్చినను ఇచ్చివేయును. తెలిసినదా హిదాయత్?

హిదా—చిత్తము శాహజాదా!

శాహ—పాడుమమ్మా! నీ వాగానము పాడినందుకు విచారములేదు. నేఁడు మేవాడులో అట్టిగానము వినువారెవ్వరును లేరనియే విచారము పాడుమమ్మా! ఏమియు భయములేదు. నేను విందును. నేను మీదేశపు పూర్వమహిమను విని కన్నీరుకార్చుట యెఱుఁగుదును.—పాడుమమ్మా! పాడుఁడు బాలకులారా! నేనును మీతోకలిసి పాడుదును. పాడుము హిదాయత్! పాడుఁడు సైనికులారా! [అందఱు పాడుచు పోదురు.]

సప్తమదృశ్యము.

స్థానము – ఉదయసాగర తీరము.

సమయము – సాయంకాలము.

(మానసి ఒంటరిగా ప్రవేశించును.)

మాన—నామీఁదుగా నొకతుపాను పోయినది. మృదుమధురమగు ఆ యనాది సముద్ర సంగీతము మరల వినఁబడుచున్నది. అది పూర్వముకన్న చాల మధురముగ నున్నది. మబ్బులు విడిపోయినవి. ఆకాశమున నక్షత్రోజ్జ్వలమగు ఆనీలిమ మరల కనుపట్టుచున్నది. చాల నిర్మలముగనున్నది. నాకర్తవ్యమార్గము నేఁడు క్షుద్రములగు జీవన సుఖదుఃఖముల పరిధిని విడిచి బహుదూరము వ్యాపించినది.

(కల్యాణి ప్రవేశించును.)

మాన—ఎవరు? కల్యాణియా?

కల్యా—అవును రాజకుమారీ!

మాన—ఇంకను రాజకుమారియేనా? ఇప్పుడు మనకు నూతన బంధుత్వమేర్పడినదికదా! — ఏల ఏడ్చెదవు కల్యాణీ! ఛీ!

కల్యా—ఇంక దుఃఖింపను. కాని సోదరీ!— సహింపఁజాలను. కనుక నే నేఁడు నీయొద్దకు వచ్చితిని. నన్నోదార్పుము.

మాన—నీదుఃఖమునంతయు నాకిమ్ము. నాసుఖము నీవు తీసికొనుము కల్యాణీ!

కల్యా—నీసుఖమా?

మాన—అవును. నాసుఖము. నాకు దుఃఖములేదు వినుము.

సీ॥ ననుఁబట్టిహింసింప ♦ ఘనమైనయాశతోఁ
జెంతకుఁజేరె దు♦రంతదుఃఖ
మైన నన్బాధింపఁ ♦ గా నోపదయ్యె నె
ప్పటికిని బాధింపఁ ♦ బడనుజుమ్ము



ఘాతుకజంతువు ♦ కరణిదుఃఖమును నా
వశముననుంచుదు ♦ పనులుగొందు
అతులోపకారంబు ♦ నమరించె దుఃఖము
నాకుఁబూర్వం బిన్ని♦నాళ్ళనుండి
గీ॥ సౌఖ్యరాజ్యంబునందలి ♦ చనువుచేసి
దుఃఖరాజ్యంబునన్ భీతి ♦ దోఁచుచుండె
బళిర దుఃఖరాజ్యమె నేఁడు ని♦వాసమయ్యె
శత్రువుం బ్రాణమిత్రుని ♦ సలిపికొంటి.

ఇంతదనుక అపూర్ణముగనున్న నాజీవితము నేఁడు పూర్ణమైనది.

కల్యా—సోదరీ! నీవుధన్యురాలవు.

మాన—నీవును ధన్యురాలవుకమ్ము కల్యాణీ!

కల్యా—ఎట్లుసోదరీ?

మాన—నా పనులకు సాయము చేయుచుండుము. రమ్ము. మనమిద్దఱము మానవకల్యాణమునకై జీవిత మర్పణముచేయుదము. నీ కల్యాణీ నామము సార్థకమగుఁగాక! నాకుసాయముచేయుదువా?

కల్యా—చేయుదును.

మాన—మంచిది. నీకు శాంతిగలిగినదో లేదో చూచుకొనుము. ఈవ్రతము పట్టినవారికి ఇంకదుఃఖమెక్కడిది?

కల్యా—మంచిది. నానిష్ఫలప్రేమ ఇందుసార్థకమగుగాక!

మాన—నీవు మహోబత్ఖానును ఇప్పటికిని ఏవగింపుతో జూచుచుంటివా?

కల్యా—సోదరీ! నాఁడు అభిమానముతో ఆయనను ధిక్కరించి వచ్చితిని. కాని ఆయనను ఏవగించుటకు నాయందు శక్తి లేనట్లు తెలియుచున్నది. బాల్యమున ఎవ్వని ధ్యేయునిగాఁ జేసికొని పెద్దదాననైతినో, యౌవనమున ఎవ్వనిజీవితము నకు ధ్రువనక్షత్రముగాఁ జేసికొని చరించితినో, ఇప్పుడీ నిరా

శాంధకారమున ఎవ్వనిచింత రావణాసురునిచితివలె హృదయ
మున నిరంతరము జ్వలింపుచున్నదో,—వానిని ఏవగింపఁ జాలను.
అది కేవలము మాటమాత్రమే.

మాన—కల్యాణీ! దానియవసరము లేదు. పోనిమ్మా. నీవు నీప్రేమను
మానవజాతియందు ప్రసరింపఁ జేయుము. శాంతినొందుదువు.
విశ్వప్రేమ ప్రతిఫలమునుగోరదు. యోగ్యతా యోగ్యత
లను విచారింపదు. సేవవలననే అది సుఖము వడయును.—

సత్యవతి—(ప్రవేశించి) మానసీ! మీనాయనగారు నిన్ను పిలుచు
చున్నారు.

మాన—నాయనగారు తిరిగివచ్చిరా?

సత్య—అవునఅమ్మా!

మాన—మొగలులతో సంధిజరిగినదా?

సత్య—లేదు. శాహజాదాఖుర్రమ్ రాణాగారికి మైత్రిని కోరుచు
వ్రాసిన యుత్తరము విశ్వసనీయము కాదని రాణాగారు
గ్రహించిరి. అదియొక్క గగనకుసుమము. ఒకమృగమరీచిక.

మాన—ఎందుకుఅమ్మా?

సత్య—(కొంచెము ఆగి) మానసీ! మైత్రి యెపుడును సరిసమానులకే
కలుగును. ఏపునకును కాలితాపునకును నెయ్యమెన్నఁడును
కుదురదు. జయధ్వనికిని ఆర్తనాదమునకును పొత్తు కుదురదు.
రాణా కోటనుండిబయటికివచ్చి బాదుషా ఫర్మానాను గైకొన
వలయునని శాహజాదా కోరుచున్నాడు. మానసీ! రాణా
ప్రతాపసింహుని పుత్రునకు ఈ అవమానముకన్న మరణము
మేలు.

మాన—నాయనగారేమి చేసిరి?



సత్య—వారు నేఁడు సామంతుల నెల్లర రావించి తమపుత్రు సింహాస
నాధిష్ఠితునిఁ జేసి రాజ్యభారమునుండి విముక్తులైరి. వారింక
రాణిగారితో కూడ రాజ్యమును విడిచి అడవులందు నివసించె
దరు.—నేఁడు మేవాడుపతనమైనదిమానసీ!

మాన—కాదు అమ్మా! మేవాడుపతనము నేఁడు ప్రారంభము
కాలేదు. అది ప్రారంభమయి చాలకాలమయినది. నేటిది ఆ
పతనపరంపరలోని ఒక గ్రంథిమాత్రమే.

సత్య—ఈపతన మెప్పటినుండి ప్రారంభమయినది మానసి?

మాన—ఏనాఁడు మేవాడుకనులకు గంతకట్టుకొని గుడ్డిదై ఆచారము
నూఁతగాఁగొని నడువఁదొడఁగెనో,ఏనాఁడు అది యోజనాశక్తిని
గోల్పోయెనో నాటనుండియే దానిపతన మారంభమయినది.
ప్రవాహము పాఱుచున్నంతకాలము జలము శుద్ధముగ నుం
డును. ప్రవాహము కట్టుబడిననాఁడు అందు పురుగులు పడును.
కనుకనే ఈజాతియందు నేఁడు ఈనీచ స్వార్థపరత్వము, క్షుద్ర
త్వము, భ్రాతృద్రోహము, విజాతివిద్వేషము నుత్పన్నము
లయినవి. ఆ మహోదారమగు హిందూధర్మము నేడు నిర్జీ
వమై, ఆచారశల్యావశిష్టమై యున్నది. దేని స్వధర్మము నశిం
చెనో దానిపతనము కాక యుండునా? జాతియందే పాపము
వ్యాపించినదో దానిని విచారింపక 'మేవాడుపోయినది' అని
దుఃఖించిన నేమిలాభమమ్మా?

సత్య—ఈదుఃఖమున కిదియొక యోదార్పుగాదా?

మాన—కాదు. అంతకంటెను గొప్పయోదార్పుగలదు. మేవాడు
పోయినఁ బోనిమ్మా. మాకంతకంటెను గొప్పసంపద గలుగుఁ
గాక యని యాసించుటయే గొప్పయోదార్పు. నా సోదరులు
నైతికబలసంపన్నులై దుఃఖమందును, నిరాశా ఘోరాంధ
కారమందును, ధర్మమునే జీవయాత్రకు ధ్రువనక్షత్రమునుగాఁ

జేసికొని చరింతురు గాకయని నేను కోరుచుందును. అట్లు కానినాఁడు వారు నాశనమైనను నేను చింతింపను.

సత్య—సోదరులు నశింపుచుండ నిలఁబడి చూచుట యుచితమా!

మాన—లేదు, ప్రాణములిచ్చి వారిని రక్షింపుము. అప్పటికిని సఫలులము గాకున్న చింతింపఁ బనిలేదు. ఈశ్వరుని శుభవిధానము నెరవేరుచుండును. స్వార్థముకన్న జాతీయత్వమును, జాతీయత్వముకన్న మనుష్యత్వమును గొప్పవి. మనుష్యత్వమునకు విరోధియగు జాతీయత్వము మనుష్యత్వమహాసముద్రమున మునిగిపోవును. మనుష్యత్వ శూన్యమగు దేశముయొక్క స్వాతంత్ర్యము నశించును.— ఆజాతి మఱల మనుష్యత్వమును బడయును.

సత్య—అది సంభవమా?

మాన—ఎందుకు కాదు. మనము సాధన చేయవలయును. గొప్ప సాధన యెన్నఁడును నిష్ఫలముగాదు. ఈజాతి మఱల మనుష్యత్వమును బడయును.

సత్య—ఎప్పుడు?

మాన—ఇదిగో వినుము.—

సీ॥ మూఢపూర్వాచార ♦ ములకు బానిసగాక
చింతనాశక్తి యో ♦ జించునాఁడు
ఎడతెఁపులేక పా ♦ రెడు భావనా స్రోత
ములు వెండి యెడఁద ను ♦ ప్పొంగునాఁడు
ఉచితానుచితముల ♦ నూహించి నిర్భీతి
మించి యుచితమాచ ♦ రించునాఁడు
త్రోసిపుచ్చుచు పర ♦ దూషణ భూషణ
మ్ముల నాత్మ సాక్షిగ ♦ మెలఁగునాఁడు



గీ॥ తరతరములుండి తముఁజేరు ♦ నురు గతాను
గతికతన్, జీర్ణవస్త్రమ్ము ♦ కరణివీడి
హృదయవీణను దగ మేళ ♦ గించునాఁడు
ప్రకటమగుఁజూవె నూత్నధ ♦ ర్మమ్ము ధరణి.

సత్య—మానసీ! ఏది యాధర్మము?

మాన—ఆధర్మము ప్రేమ. తన్నువిడిచి క్రమముగ సోదరుని, జాతిని, మానవుని, మానవజాతిని ప్రేమించుట నేర్చుకొనవలయును. పదపడి మనము చేయునదేమియు లేదు. అజ్ఞేయమగు ఈశ్వర విధానమే భవిష్యత్తును చక్కఁబఱచును. జాతీయోన్నతిపథము నెత్తుటేఱులమధ్య గోచరింపదు. అది కౌఁగిలింతలనడుమ గాననగును. వంగదేశపు చైతన్యస్వామి చూపించిన మార్గమున నడువుమమ్మా!—మనము నీచులము, స్వార్థపరులము, కుటిలులము నగుచో రాణాప్రతాపసింహుని నామమును జపించియును, అతీతగౌరవనిర్వాణప్రదీపమును దగ్గిరనుంచుకొనియును, జీవితమెల్ల దుఃఖించియు నేమియు ప్రయోజనము లేదు.

(అందఱు నిష్క్రమించెదరు)

## అష్టమదృశ్యము.

స్థానము—ఉదయసాగరతీరము.

కాలము—సాయంకాలము.

[ఆకసమున మేఘములు కమ్మియుండును. రాణాఅమరసింహుఁడు ఒంటరిగ ప్రవేశించును.]

రాణా—మేవాడగగనతలము క్రోధముతో గర్జించు చున్నది. మేవాడపర్వతము లజ్జచే తలవంచుకొనినది. మేవాడ సరోవరము వ్యాకులతతో నొడ్డుకు కొట్టుకొనుచున్నది. మేవాడు కులదేవతలు రోషముతో పెడమొగము పెట్టిరి. నాచేతులలో నామేవాడు—రాణా ప్రతాపునిమేవాడు నేఁడు పతనము చెందినది. ఓహెూ! (పచారుచేయుచు) ఇదిగో మహబత్ఖాన్!

(మహబత్ఖాను ప్రవేశించును.)

రాణా—సలాము ఖాన్ సాహెబ్!

మహ—మేవాడురాణాకు జై!

రాణా—మొగలసేనాపతీ! నీవు ఒక హత్యావిద్యయందే పండితుఁడవు కావు. పరిహాసము చేయుటయందును చాల సమర్థుఁడవు. "మేవాడు రాణాకు జై" మంచిది!

మహ—లేదురాణా! నేను పరిహాసము చేయలేదు.

రాణా—చేసినను చేయకున్నను వచ్చునదియు పోవునదియు లేదు—పోనిమ్ము. నే నొకపర్యాయము నిన్ను కలసికొనవలయునని కొంటిని.

మహ—సెలవీయుఁడు.

రాణా—ఎంతవినయము!—వినుము. నే నొకపనికై నిన్ను పిల్వనంపితిని. ఆపని నీవలననే కానగును.



మహ—ఆజ్ఞాపించుఁడు.

రాణా—మహబత్ఖాన్! ఒక్కింత నావంక చూచి నాకు నీవేమికావలయునో చెప్పఁగలవా?

మహ—నేను మీసోదరుఁడను.

రాణా—సోదరునికి తగినపని చేసితివి. నీతాతముత్తాతల మేవాడును మొగలుల పాదాక్రాంతము చేసితివి. దాని హృదయరక్తముచే నీరెండుచేతులును రంజితములైనవి.

మహ—రాణాజీ! నేను బాదుషాచే పోషింపఁబడినవాఁడను.

రాణా—అదియెప్పటినుండి మహబత్ఖాన్? పోనిమ్ము. నీపనినీవు చేసితివి. దానికై నీతో వాగ్వాదము చేయుట వ్యర్థము. స్వధర్మపరిత్యాగికిని, మొగలోచ్ఛిష్టభోగికిని ఈపని అనుచితము గాదు. నియమరహిత జీవితునకును ఉచ్ఛృంఖల స్వేచ్ఛాచారప్రమత్తునకును ఇట్టిపని అనుచితముకాదు. నీవు మేవాడు ధ్వంసముచేసితివి. అంతతో నీపని ముగియలేదు. దానితోపాటు మేవాడురాణాను కూడ అంతమొందింపుము. ఇదిగో! ఖడ్గము. (ఖడ్గమీయఁబోవును.)

మహ—రాణాజీ—

రాణా—మారుసెప్పకుము. వినుము నన్నువధింపుము. దానిచే నీకళంకమేమియు హెచ్చదు. నీ కప్రియమగు పనిచేయుటకును నేను చెప్పుటలేదు. నీవు నా నెత్తురుత్రావుటకై తత్తరపడుచుంటివని నేనెఱుఁగుదును. నీ యీ దక్షిణహస్తము నాహృత్పిండమును పెకలించుటకై అదరుచున్నది. ఇదిగో! నా హృత్పిండమును దీసికొనుము. నన్నువధింపుము.

మహ—రాణాజీ! మహబత్ఖాను అంతనీచుఁడుకాఁడు. నేను మేవాడభూమిని ఖడ్గముచే నరికియు, అగ్నిచే తగులఁబెట్టియు శ్మశా

నను చేసిన మాట వాస్తవము. కాని నేను అన్యాయయుద్ధము చేయలేదు. నేను న్యాయయుద్ధమునే చేసితిని.

రాణా—న్యాయయుద్ధమా! దీనిని న్యాయయుద్ధ మనుచుంటివా? మహాబత్? ముష్టిపరిమేయ సేనావశిష్టమగు నొక క్షుద్రరాజ్యముపై ఒక సామ్రాజ్యపు మహావాహినిపడుట; ఒక మినుగురుపై సముద్రతరంగపతనము; ఒక్క పసిపాప ఆత్మపై ఘోరనారకీయ దుస్స్వప్నము! న్యాయయుద్ధమా! పోనిమ్ము—జయించితివి. ఇంక నీపని ముగించుము. ఇదిగో! ఖడ్గము తీసికొనుము. ఈఖడ్గమును రాణాప్రతాపసింహుఁడు చనిపోవునపుడు నాకిచ్చుచు "దీని కవమానము కలిగింపకుమా" అని చెప్పిపోయెను. నేను దానికి అవమానము కలిగించితిని. ఆ యవమానము నా రక్తముచే గడగఁబడుగాక!

మహా—రాణాజీ! మహబ్బత్ఖాను యోధుఁడుగాని వధకుఁడు కాఁడు.

రాణా—అగుచో యుద్ధము చేయుము. ఖడ్గము ధరింపుము.

మహా—రాణాజీ! నేను మేవాడుపైకి కత్తికట్టుట విరమించితిని.

రాణా—అదియెప్పటినుండి మహాబత్? కత్తిపట్టుము—కత్తిపట్టుము. నేఁడు మేవాడు శ్మశానమున మాతృశవమును బుజమున నిడుకొని నిన్ను ద్వంద్వయుద్ధమునకు పిలుచుచున్నాను.

మహా—రాణాజీ! వినుఁడు.

రాణా—నే నేమియువినను.

గీ॥ భీరు! మ్లేచ్ఛ! కులాంగార! ♦ ధీరుఁడవయి
పోరునొనరింపు, మేనీదు ♦ భుజబలంబు
గాంచి భారతవర్షమ్ము ♦ కంపమందు
దాని నీయెడ నేఁజూడఁ ♦ దలఁచినాఁడ.

అస్త్రము గ్రహింపుము. నిన్ను విడిచిపెట్టను. అధమా! నరకకీటకమా! పిశాచమా!



మహా—మంచిది రాణా! అట్లేయగుఁగాక! (కత్తిదూయును.) జాగ్రత్త రాణా! భారతవర్షమున మహాబత్ఖానున కెవ్వఁడేని ప్రతిద్వంద్వి యున్నచో ఒకనీవే—అయినను జాగ్రత్త!

(ఇద్దఱును కత్తులు దూయుదురు.)

రాణా—నేఁడు సోదరులమధ్య యుద్ధము జరుగుచున్నది. ఇట్టిది ప్రపంచమున నెవ్వఁడును చూచియుండఁడు. పృథ్విపై ప్రళయమగుఁగాక!

[ఈసమయమున వెండ్రుకలు విరియఁబోసికొని వస్త్రము జారుచుండ మానసి ప్రవేశించి ఇద్దఱమధ్య నిలఁబడును.]

మాన—ఇదియేమి నాయనగారూ! ఇదియేమి! (మహాబత్ఖానువంక తిరిగి) శాంతింపుఁడు.

రాణా—తొలఁగిపొమ్ము మానసీ! ఈయుద్ధమున కాతంకము చేయకుము.

మాన—శాంతింపుఁడు నాయనగారూ! మేవాడుకు కానున్న సర్వనాశమయినది. ఆసర్వనాశమును భ్రాతృరక్తముచే రంజితము చేయకుఁడు. ఈదుఃఖమునకు ఓదార్పు హత్యగాదు. దీనికి ఓదార్పు మరల మనుష్యుఁడగుట.

రాణా—మనుష్యుఁడగుటయా—అదియెట్లు మానసీ?

మాన— గీ॥ శత్రుమిత్రత్వభేదప్ర♦సక్తిమఱచి
నైజదైశకలంకపం♦కమ్ము విశ్వ
ప్రేమజలమునఁ గడగి ప్ర♦విమలమతిని
తిరిగి మానవత్వమ్ము సా♦ధింపవలయు.

పాడుఁడు చారణులారా! నేను మీకు నేర్పిన యాగీతముఁ బాడుఁడు—"క్రమ్మఱ మానవులగుడు"

(కాషాయాంబర ధారిణులగు చారణులు పాడుచుందురు. మానసియు వారితోఁ గలసిపాడును.)

గీతము

౧ గాసివహింపఁగ నేల మీరలిటు క్రిమ్మర మానవులగుడు
దేశముపోయిన దుఃఖములేదెదఁ దిరిగియు మానవులగుడు

౨ మీరేశత్రులు మీకుఁకాఁగ నిఁక దూరగనేలా యొరులన్
ఆరయదోషము లన్నియుమీవని యరుగుఁడీ మనుజులు మరలన్

3 ప్రికృతకాలమిటు లాశా రహితంబయి పోయినఁబోవున్
ఇఁక నేనియు మీరొండురులను ప్రేమింపుఁడు సోదరులంచున్

౪ ఈతఁడు నా వాఁ డీతఁడు పరుఁడని యెంచక భేదంబెదలన్
బ్రీతి జగంబే మాగృహమనుకొని వెండియు మానవులగుఁడు

౫ ఉన్నతహృదయం బుదారబుద్ధియు నుండిన శత్రునినేనిన్
మన్ననవానికి మీహృదయంబిడి మహితపుఁ బ్రీతిం గనుఁడీ
కపటియు ధూర్తుండగు మిత్రుఁడే ఘనమగుశత్రుండు
నిపుణతివానిని తొలఁగింపుచు వెండియు మానవులగుడు

౬ జగమున సేనలు రెండుయుద్ధమును సలుపఁగ నిలఁబడియుండెన్.
ప్రిగతిని బుణ్యపు సేనఁ జేరుఁడీ పాపపుసేనను విడుఁడీ

౭ నిజధర్మంబు పరిత్యజింపకుఁడు భజియింపుఁడు సర్వేశున్
స్వజనము దేశముపోయినఁ బోవును బరువడి మానవులగుడు॥

రాణా—మహాబత్!

మహా—అమర్!

రాణా—నీ దోషమేమియు లేదు. నాదియే దోషము. క్షమింపు సోదరా!

మహా—క్షమింపు సోదరా! (కౌగలించుకొందురు.)

(తెరవాలును)

—సంపూర్ణము—

శుద్ధ పత్రిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 24 | వర్థ | వ్యర్థ |
| 13 | 2 | యోధ | యోద్ధ |
| 16 | 12 | వీరి | వీరితో |
| 32 | 9 | పరకు | పరక |
| 48 | 5 | పాటున | పాటున ఒక వృద్ధరాజ పుత్రుఁడు |
| 49 | 18 | చిగుప | చిత్తూరు |
| 57 | 4 | అవు | అవ |
| 65 | 4 | మీరు | మీదు |
| ,, | 5 | తెరఁగును | తెఱఁగున |
| 68 | 17 | పాచీ | ప్రాచీ |

శ్రీ

# బాలభారతీ గ్రంథనిలయము

చాగలమర్రి

కర్నూల్ (జిల్లా)—దత్తమండలము

స్థాపితము 1923

ముఖ్యోద్దేశము

భాషోద్ధారణ! పరిశ్రమపోషణ!!

## ఇందు

ప్రతిరెండు మాసములకు మత, సాంఘిక, దేశీయ, పౌరాణిక, అపరాధ పరిశోధక నవలలుకాని, రసవంతములగు నాటకములుకాని, శ్రేష్ఠతమములగు పద్యకావ్యములుకాని, ఒకటి వంతునతప్పక ప్రకటింతుము.

చందాదార్లుగా చేరగోరువారు ప్రవేశరుసుము రు॥ 0-8-0 ముందుగా చెల్లించి రశీదు పొందవలయును.

ప్రతిరెండు మాసములకు ప్రకటించు ప్రతిగ్రంథమును చందాదారులు తప్పక తీసికొనవలయును.

పోస్టేజీకగు తపాలా ఖర్చులన్నియు చందాదారులే భరించుకోవలయును.

మా చందాదారులకు యితరులకన్న నూటికి యిరువది అయిదు రూపాయలవంతున ధరలు తగ్గించి పంపబడును.

చందాదారులుగా చేరగోరువారు వెనుకటి గ్రంథములుకాని, అనుబంధములుకాని కొననక్కరలేదు. వలయునన్నచో వానినిసహా తగ్గింపువెలలకే పంపబడును.

చిరునామా మారినవెంటనే మాకు తెలుపవలయును.

మాతో ఉత్తరప్రత్యుత్తరములు జరుపవలసినచో తమచందా నెంబరు తెలుపనిచో జవాబువ్రాయుట కష్టసాధ్యము.

రసవంతములగు నాటకములను, నవలలను తదితరగ్రంథములను, మాచందాదార్లుగాని, లేక యితరులుగాని మాకు పంపినచో వందనపూర్వకముగా నందుకొని, ముద్రణయోగ్యముగా నున్నచో తప్పక ప్రకటింతుము.

## కనుక

మా గ్రంథనిలయమునకు మహారాజ పోషకులు, రాజపోషకులు, పోషకులు, సహాయులు, శాశ్వత చందాదార్లుగాచేరి మాకు చేయూత నొసంగ నాంధ్రమహాజనులను ప్రార్థింపుచున్నాము.

## విరాళములు

| | |
|---|---|
| మహారాజ పోషకులు | రు 116—0—0 |
| రాజ పోషకులు | 50—0—0 |
| పోషకులు | 25—0—0 |
| సహాయులు | 12—8—0 |
| శాశ్వత చందాదార్లు | 7—2—0 |

మహారాజపోషకులు, రాజపోషకులు, పోషకులు, సహాయులు వీరలనామములను, చేరినలగాయతి మాయొక్క ప్రతిపుస్తకమునందు చేర్చబడును.

పోషకులు, సహాయులు, శాశ్వత చందాదార్లు వీరలు ప్రతి సంవత్సరము వారి వారి విరాళములను చెల్లించుచుండవలయును.

మహారాజ పోషకులు, రాజపోషకులు కార్యములపట్ల సర్వవిధములగు సహాయములు చేయవలయును.



పై అయిదు తరగతులవారికి ప్రతి రెండు మాసములకు వెలువడు ప్రతిగ్రంథమును పోస్టు ఖర్చులు యావత్తు మేమే భరించుచు ఉచితముగా పంపెదము.

మొదటి మూడుతరగతులవారికిమాత్రము మా గ్రంథనిలయమున ప్రకటించు ప్రతిపాత్తమును ఉచితముగా పంపెదము.

మా గ్రంథనిలయమునకు ఒక రాజపోషకునిగాని, ఇద్దరు పోషకులనుగాని, నలుగురు సహాయులనుగాని, పదిమంది శాశ్వతచందాదార్లనుగాని, చేర్చువారికి మాచే వెలువరింపబడిన ఒక నవలను నాటకమును పంపెదము. 25 మంది చందాదార్లను చేర్చినవారికి మా గ్రంథములలోని యేదేని వారుకోరిన ఒకపాత్తమును వారికి ఉచితముగా పంపబడును.

మాకు ఏజంట్లుగానుండి పనిచేయువారికి మంచి కమీషన్ ఇయ్యబడును. కానవివరములకు వ్రాసినచో నిబంధనలు తెలుపబడును.

### ఇందు వెలువడిన గ్రంథములు.

(ప్రథమ రత్నము)

## సువర్ణకేసరీ కృష్ణసేన (నవల)

కథాచమత్కృతి అద్భుతము. ఇందు సందర్భానుసారముగా వైద్య సాంఘిక విషయములు చర్చింపబడినవి. వెయ్యేల చదువమొదలిడిన అంత్యమగువఱకును విడువరు.

| | | |
|---|---|---|
| వెల చందాదారులకు | రు 0—12—0 | పోస్టేజి వేరు. |
| యితరులకు | 1—0—0 | |

### ద్వితీయ రత్నము

## కలియుగ దర్పణము (నాటకము)

వృద్ధ వివాహములు, అతిబాల్యవివాహములు, కలియుగానర్థములనియు—యవ్వనకంటకములనియు—ప్రదర్శించుటకు "కలియుగదర్పణమే" దర్పణము.

| | | |
|---|---|---|
| వెల చందాదార్లకు | రు 0—12—0 | పోస్టేజి వేరు |
| ఇతరులకు | 1—0—0 | |

### తృతీయ రత్నము

## మనోరమా విజయము (చరిత్రాత్మక నాటకము)

గ్రంథకర్త: గండ్లూరి నరసింహారావుగారు

రిటయిర్డు రివిన్యూయిన స్పెక్టరు, జంబులమడుగు.

| | |
|---|---|
| వెల చందాదారులకు | రు 0—12—0 |
| ఇతరులకు | 1—0—0 |

## రానున్నది (ప్రియదర్శిని)

చిత్రపట శోభితమును చరిత్రాత్మకమునునగు నవలారాజము.

గ్రంథకర్త: పాలపర్తి సూర్యనారాయణరావుగారు.

వెల చందాదారులకు రు 0-12-0  ఇతరులకు రు 1-0-0

## గండికోట

ఒకపురాతన పట్టణముయొక్క చరిత్రము చక్కగ చిత్రింపబడినది. చందాదారుల కుచితము. ఇతరులకు ౨ అణాలు మాత్రమే.

---

# ఇతర ప్రకటనలు

ఇటు చూడుడు! | మాచే తమగృహముల నలంకరింపుడు!

చేతిపనుల నుద్ధరింపుడు!!! | వెలసరసము! | ఫలమధికము!!!

మా కంపెనిలో మంచి పనివారలచే ఇనుముతో చెక్కతో చెయ్యబడి సరియగు మెరుగు వెయ్యబడిన గృహోపకరణములు మిక్కిలి సరసమగు వెలలకు దొరుకును.

గొప్పగా ఆర్డరు యిచ్చువారికి మంచిలాభకరము. తరుణమును పోగొట్టకొనకుడు. ఒకపరి మా సామానులను తెప్పించి వానిగుణములను కనుగొనుడు.

## సామానుల యొక్క వెలల వివరము.

| సామానుల యొక్క పేర్లు. | ఇనుము. డజను 1కి | ఇనుము. వస్తువు 1కి | చెక్క. డజను 1కి | చెక్క. వస్తువు 1కి |
|---|---|---|---|---|
| సాదామడత కుర్చీ (దళసరియినుపపట్టి) | రు. 40 0 0 | రు. 3 8 0 | రు. 50 0 0 | రు. 4 8 0 |
| డిటో [సన్నయినుపపట్టి] మేలురకం తేకుమడతకుర్చీ | 35 0 0 | 3 0 0 | 65 0 0 | 6 0 0 |
| మడతకుర్చీ [చేతులుకలది] | 45 0 0 | 4 0 0 | 110 0 0 | 10 0 0 |
| సాదాయీజీచేర్ ఆకుపచ్చ క్యాన్వాస్ పట్టతోసహా | 80 0 0 | 7 0 0 | 80 0 0 | 7 0 0 |
| డిటో చేతులుకలది | 100 0 0 | 9 0 0 | 100 0 0 | 9 0 0 |
| క్యాంపుకాటు [పట్టతోసహా] | 170 0 0 | 15 0 0 | 110 0 0 | 10 0 0 |
| వలచట్టము | రు. 20 0 0 | 2 0 0 | [illegible] 0 0 | [illegible] 0 0 |



| సామానుల యొక్క పేర్లు. | ఇనుము. డజను 1కి | ఇనుము. వస్తువు 1కి | చెక్క. డజను 1కి | చెక్క. వస్తువు 1కి |
|---|---|---|---|---|
| ఉయ్యాలకుర్చీ [పట్టతోసహా] | 220 0 0 | 20 0 0 | | |
| రాకింగుచేర్ [పట్టతోసహా] | 80 0 0 | 7 0 0 | 90 0 0 | 8 0 0 |
| క్యాంపుఫోల్డింగు టేబిల్ [$3 \times 1\frac{3}{4} \times 2\frac{1}{2}$] అడుగులు | 110 0 0 | 10 0 0 | 65 0 0 | 6 0 0 |
| డిటో (ఒకడ్రాయరు) | 140 0 0 | 12 0 0 | 90 0 0 | 8 0 0 |
| క్యాంపు ఫోల్డింగు స్టూల్ | [illegible] 0 0 | 2 8 0 | 32 0 0 | 3 0 0 |
| ఆఫీసు సాదాకుర్చీ | ... | ... | 65 0 0 | 6 0 0 |
| ఆరుకాళ్ళ క్యాంపుమంచము | ... | ... | 170 0 0 | 15 0 0 |
| టేబిల్ ($3 \times 2 \times 2\frac{1}{2}$) ఒకడ్రాయరు | ... | ... | 170 0 0 | 15 0 0 |
| డిటో రెండుడ్రాయర్లు | ... | ... | 310 0 0 | 30 0 0 |
| స్టూల్ ($1\frac{1}{4} \times \frac{1}{4}$) | ... | ... | 45 0 0 | 4 0 0 |
| బెంచి ($3 \times 1 \times \frac{1}{2}$) అడుగులు | ... | ... | 80 0 0 | 7 0 0 |
| డిటో బ్యాకు | ... | ... | 100 0 0 | 9 0 0 |
| బెంచినాదా ($6 \times 1 \times 1\frac{1}{2}$) | ... | ... | 130 0 0 | 12 0 0 |
| డిటో బ్యాకు | ... | ... | 170 0 0 | 15 0 0 |
| వ్రాతడస్కు ఒకడ్రాయరు | ... | ... | 195 0 0 | 18 0 0 |
| డిటో రెండుడ్రాయర్లు | ... | ... | 340 0 0 | 30 0 0 |
| బ్లాకుబోర్డు ($3\frac{1}{2} \times 3$) | ... | ... | 110 0 0 | 10 0 0 |
| ప్లాంకులు (Planks 6 x 1) | ... | ... | 55 0 0 | 5 0 0 |

| | | | | |
|---|---|---|---|---|
| రికార్డుపెట్టెలు 2 x 1¼ x 1½ | .... | ... | 110 0 0 | 10 0 0 |
| అలమారు (5 x ¼ x 1) | .... | ... | 600 0 0 | 55 0 0 |
| డిటో గ్లాసులు | .... | ... | 620 0 0 | 56 0 0 |
| అలమారు (7½ x 4½ x 1½) లోపలి తల్పులతోసహా | ... | ... | 1100 0 0 | 100 0 0 |
| రాటము | ... | ... | 72 0 0 | 6 0 0 |

వరా:—ప్రతిఆర్డరున్ను పాతికె మొత్తము అడ్వాన్సులేనిదే చెల్లనేరదు. రెండునూర్ల రూపాయలకు మించిన ప్రతిఆర్డరుకు ప్యాకింగు రయిలుచార్జి ఉచితము. భారీగా ఆర్డరుయిచ్చువారు 15 దినములు ముందుగా మాకు తెలియచేయవలయును. తాలూకు డిస్ట్రిక్టుబోర్డు పనులను కంట్రాక్టు తియ్యగలవారము.

వలయువారు దిగువ చిరునామాకు వ్రాయవలయును.

పి. గోవిందప్ప అండు సన్సు, ప్రొప్రైటర్సు,
జగదీశ్వర ఇండస్ట్రీసు.
చాగలమఱ్ఱి (పోస్టు,) (కర్నూలుజిల్లా)

కడప (రైలువేస్టేషన్)



# ది "వెల్ కమ్"
# ఫోటోగ్రాపు మందిరము అండ్ కంపెని

నంద్యాల.

ఇచ్చట అన్నివిధములగు ఫోటోగ్రాఫులు అఫ్టాల్ జ్లావులు, బ్రోమైడ్ యెన్లార్జిమెంటులు, వాటర్ పెయింటింగ్, ఆయిల్ పెయింటింగులు చేతిగుడ్డలమీద ఫోటోలు, ఉంగరములమీద ఫోటోలు పాతకాపీలు రీకాపీచేయుడం ఒక ఫోటోయందుగల బింబమును వేరు చేయుడం లేక చేర్చడం మొదలగుపనులు ప్రత్యేకసీనులతో జోడించి మా స్టూడియోలో ఫోటోతీసి యివ్వబడును. కార్డు సైజు మొదలు 12 x 10 రాయల్ సైజువరకు ఫోటోతీసి యివ్వబడును. యెన్లార్జిమెంటులు సులభధరలకు తీసియివ్వబడును. వలయువారు పాణీన్ని కేతల ముద్రాక్షరశాల పక్కనుండు మా స్టూడియోయందుగల పనులను పరీక్షింపగోరుచున్నాము.

అమ్మకమునకు సిద్ధముగానున్నవి.

స్వదేశ మైనవుత్పత్తులు, శుభ్రమైన సబ్బులు, రబ్బరు స్టేట్ స్లేటు పలకలు, సుగంధద్రవ్యములు, తలనూనెలు, సుందరమగు పడకటింటి ఫోటోగ్రాఫులు, అన్ని విధముల పటములకుతగిన ఫ్రేములు, అద్దములు, ముఖము చూచుకొను అద్దములు, మా ఫ్యాక్టరిలో తయారగుచున్నది.

ముసికోటి శ్రీనివాసరావు R. P. A.

# ఫోటో సైజులు

(ఈధరలు పి. ఓ. పి. పటములకు మాత్రము)

| సైజులు. | మొదటికాపీ. | తర్వాతికాపీ. |
|---|---|---|
| కార్డుసైజు | రు. 1—8—0 | రు 0—6—0 |
| క్యాబినెట్ | 3—0—0 | 1—0—0 |

| | | |
|---|---|---|
| ఫుల్ ప్లేట్ | 6—0—0 | 1—8—0 |
| 10 x 8 ఇంపీరియల్ | 8—0—0 | 1—8—0 |
| 12 x 10 రాయల్ | 10—0—0 | 2—0—0 |

బ్రోమైడ్ ఎన్లార్జిమెంట్సు రు 8/- మొదలు పైగా
వాటర్ పెయిటింగు రు 10/- మొదలుకొని పైగాను
ఆయిల్ పెయింటింగు క్యాన్వాసుమీద రు 25/. మొదలుకొని
తయారుచేసి యివ్వబడును.

## మ రి యు

నాటకములకు కావలసిన పడతాలు, సీనులు, మొదలగునవి సెట్టుగాగాని, విడివిడిగాగాని తయారుచేసి సరసమైన ధరలకు యివ్వబడును.

మునికోటి శ్రీనివాసరావు R. P. A.
నంద్యాల.

---

## ఆంధ్రకర్మాగారము చాగలమఱ్ఱి.

---

ఇచ్చట ప్రసిద్ధమైన హార్మోనియములు ప్యారిసురీడ్సుతో మిగుల సుందరముగా తయారుచేసి ఆర్డరు మేరకు అందీయబడును. కావలసిన వారలొకసారు ఆర్డరు ఇచ్చి చూడవలయును.

| | | | |
|---|---|---|---|
| సింగిల్ రీడ్సు (ప్యారీస్) | రు 40-0-0 | డబ్బుల్ రీడ్సు (ప్యారిస్) | రు 50-0-0 |
| డిటో (అమిరికా) | 30-0-0 | డిటో (అమిరికా) | 40-0-0 |




---

